# గో[illegible]కా వ[illegible]ప[illegible]ము



గ్రంథకర్త:

మొవ్వ వేంకట దాసస్వామి

వేణుగోపాలసేవాశ్రమము-పూడివాడ

[వయా] చందోలు — గుంటూరుజిల్లా

[illegible]ములు వెల: 1-50

# గోపికావిలాసము

౪ ఆశ్వాసములు





గ్రంథకర్త:

మొవ్వ వేంకటదాసు

పూడివాడ

రేపల్లె తాలూకా, గుంటూరుజిల్లా.

[వెల 1—4—0

1941



గ్రంథకర్త : మొవ్వ వేంకటదాసు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ ...

సుధీమణులారా! ... గ్రంథరాజంబేను రచించు
...కారణం బేమనఁగా విక్రమనామ సంవత్సర భాద్రపద
...మాదిగా మదీయజఠరంబున నొకవిధమైన మంటలుగలిగి
...గఁబడి యౌషధసేవసేయఁగా నించుకైన శమింపదయ్యె
...యవసరంబున నేమి చేయుదునా యని విచారగ్రస్తుఁడనై
...డ నొక్కనాటి మధ్యాహ్నంబున మదీయోపాసనా
...బై చిన్ననాటనుండియు నుపాధ్యాయుండై సంగీత
...మాహాత్మ్యంబులును దేశికుండై యర్థపంచక జ్ఞానంబునుఁ దెల్పిన
శ్రీమహావిష్ణువు మదీయ మానసకమలంబున సాక్షాత్కరించి
యిట్లనియెఁ బుత్రా! నీకుఁ జిరకాలంబునుండి కవితా నిధానం
బొసంగితిని దాని నీవు వ్యర్థపరుపక శ్రీనివాస ప్రభావంబును
సీతారామ ప్రభావంబును శ్రీదేవీ సహస్రంబు నాంజనేయ
స్తవంబను పద్యకావ్యంబులును వరవరముని హృదయంబను
వేదాంత గ్రంథంబును, జానకీకల్యాణము రుక్మిణీ పరిణయము
ఉషా...నోద్వాహము, సత్యభామావిలాసము, కౌంతేయ
... ధనంజయ విజయము సైంధవ శిరచ్ఛేదన
జ్ఞాతవాసము... ...కిం...ధము భాగవత సురభూజము మొదలై
యుధిష్ఠిరాశ్వ... ...త్పదాంకితంబుగా రచించితి వట్టులే యిప్పు
హరికథలును ...

...లో

గోపికావిలాసంబను పద్యప్రబంధము రచింపుము నీరో
వ్యాధి నశించునని శాసించి యంతర్హితుండయ్యె
నే నత్యంతానంద సముద్రంబున నోలలాడి పరమపా
డును పరబ్రహ్మస్వరూపుండగు శ్రీకృష్ణుండు మదీయ తుచ్
శయంబునఁ జేరి పరమ నీచుండనైన నన్నుఁ దనకార్యంబ
నియమించుట కేమిపుణ్యం బొనర్చితినో గదాయని
ప్పొంగి యా రెండవదినంబె ప్రారంభించి భాగవతంబు నా
రంబుగాఁ దీసికొని పదునొకండువందల పద్యంబులతో నై
మాసంబులకు గోపికావిలాసంబు శ్రీకృష్ణానుగ్రహంబుచే
బూర్తిఁ జేయఁగలిగితి నిక్కావ్యంబుఁ బ్రారంభించిన
మొదలు ముగియువఱకు నందనందనుండు స్వకీయ చ
ణారవిందద్వయంబును మదీయ మానసంబునందును నాలుక
యందును లలాటంబునందును మోపుచుండె నక్కారణంబున
గోపవధూమణుల దివ్యప్రభావంబుఁ గొంచెము కొంచెముగా
నెఱుంగఁజాలితి నిదివఱకు గోపికలను గొల్లభామలని గొల్ల
చానలని పామరులందఱు సామాన్యదృష్టితో వాడుచుండిరి
కొంతకాలము నాకు నట్టి యజ్ఞానపిశాచము పట్టియుండెను
గాని యిప్పుడట్టి యగౌరవభావంబు భగవదను[illegible]గ్రహంబుచే
దొలఁగి పాఱినది యిది యిట్లుండ నొకానొక [illegible] సమయంబున
నేనొక్క లింగధారియగు నారాధ్యునితో [illegible] సంభాషింపుచుండ

నతండు నన్నుఁగాంచి భాగవతా! నీవు వైష్ణవుండవుగద
కృష్ణావతార తత్వంబెఱింగినవారి నెవరినైనం గాంచితివ
యని ప్రశ్నించె నందుల కేనమందానందముఁజెంది స్వామీ
వ్యాసరచితంబులగు భాగవత భారత హరివంశంబులఁ జద
వితి నానలెననేక పర్యాయంబులు చదివిన వారింగాంచి
సంభాషించితింగాని శ్రీకృష్ణుని యథార్థంబెఱింగిన వారిని
గాననైతి నేనుఁ దెలియనైతి భగవదవతారంబని మాత్ర
మెఱుంగుదునంటి నంతట నక్కోవిదుఁడునవ్వి శ్రీకృష్ణావతా
ప్రభావంబిట్టిదని వచింప యోగులకు దుర్లభంబు మనవంటి
వారికి శక్యమాయని వెళ్ళిపోయె నతని సమాచారంబిట్లుంచి
మొగలై దేశంబునఁ గలెక్టరు పదవిలోనుండు మహామ్మ
దీయుఁడొకఁడు పండితుల ననేకుల నొక్కచోట నొనగూర్చి
యయ్యలారా! భగవంతుని యవతారంబులలో మిక్కిలి
లోకోపకారంబైన యవతారంబెద్దియని యడిగ నవ్వాక్యం
బులువిని కొందఱు నిరుత్తరులైరి మఱికొందఱు తోఁచినట్లనే
కావతారంబులంగూర్చి వక్కాణించిరి కాని యప్పండి
తుర్కుఁడు తృప్తిఁజెందక కోవిదులారా! మీకుఁదెలియలేదు నేన
చెప్పెద నాలకింపుఁడు భగవదవతారంబు లన్నియుఁ బవిత్రము
న్నఁ బవిత్రములై రహస్యమునకన్న రహస్యంబులై తనరు
చున్నవికాని వానిలో రామకృష్ణావతారంబులు ముఖ్యంబులు

వేడియు నా రెండింటిలో రామావతారము దుష్టనిగ్రహము
శిష్ట పరిపాలనముగలిగి పండితులకు భక్తులకు మాత్ర ముప
యోగించు మాయామనుష్య విగ్రహముగలది కృష్ణావతా
రము లీలామానుష విగ్రహముగలదియై గోపగోపాలపశుపక్షి
మృగాదులకు సులభమై మోక్షంబొసంగుటచే లోకోపకార
మైనదని మెచ్చ, శేషుఁడు వచింపఁగా నౌరా మన కృష్ణావతా
రముమతాంతరుని సహితము కరంచినది యెంతమాహాత్మ్యము
గలదిరాయని పండితు లత్యంతాశ్చర్యముఁ జెందిరి మఱియు
వేణుగానలోలునిఁగన వేయికన్నులు గావలెనని త్యాగరాజు
గారును, మృద్వీకాసితాక్షీర సుధా మకరందంబులందుఁ గల
రుచి కృష్ణా యను రెండక్షరములలోని మాధుర్యమున కెన
గాదని భామినీ విలాసములో జగన్నాథ పండితుండును
కృష్ణా నీవు బృందావనమునఁ జల్ది గుడువగా రాలిన మెతు
కులు బ్రహ్మరుద్రాదులు వాయసములై భక్షింపుచున్నారని
యానంద మందాకినియను గ్రంథములో మధుసూదన సర
స్వతియు నీ జారత్వంబు నుతించినవారికి జారత్వాది పాప
బులు నశించునని కృష్ణకర్ణామృతంబున లీలాశుకుఁడును సం
సారరోగంబుచే బాధపడుచున్న గోపికలు కృష్ణపరత్వ
జ్ఞానమను నారోగ్యంబుఁ జెంది సుఖంబుగాఁ గ్రీడింపు
చున్నారని కృష్ణలీలా తరంగిణియందు నారాయణ తీర్థుల

వారును జన్మరోగ నివారణార్థము శ్రీకృష్ణరసాయన
స్వీకరింపుడని ముకుందమాలయందుఁ గులశేఖర
సూరియు, గోపికా, జారగ్రామణి కృష్ణుఁ డీవుత మహై
శ్వర్యంబు మాకెప్పుడున్ అని రామాయణోత్తరకాం
యందుఁ గంకంటి పాపరాజుగారును మఱియు ననేక
లనేక రీతులుగాఁ గృష్ణావతార ప్రభావంబుఁ గీర్తించి గో
మాహాత్మ్యంబు సహితము వెల్లడించిరి. యింతయేల
వ్యాసుండని పేరొందిన మహాముని గోపికాప్రభావ
భాగవతంబున వర్ణించి యాజన్మవిరాగియగు శుకయోగీం
నిచే బఠింపించె నమ్మహామునీంద్రుఁడు పరమ ముముక్షు
పరిక్షిద్భూవరునకు భాగవతంబు వినిపింపుచు నంతిమ
సంబున గోపికాకృష్ణలీలలువర్ణించి చెప్పి యారాజేంద్రు ము
కని చెప్పి గోపికాప్రిభావం బద్వితీయంబని నమ్ముటకు శా
ప్రమాణబద్ధుల కింతకంటె దృష్టాంతంబులేమి నవసరంబులే
సదా సత్యంబునకై రాజ్యమర్పించిన హరిశ్చంద్రుండు
గువ్వకై కండలుగోసి యిచ్చిన శిబిచక్రివర్తియు దేవతల
స్వకీయశల్యం బర్పించిన దధీచియు నిండ్రినికొఱకు సహ
[illegible]లంబు [illegible]సంగిన కానీనుండును, యమునిత
వాదించి భర్తను బ్రిదికించిన సావిత్రియుఁ గిరాతుని నీ
సేసిన దమయంతియు శ్రీకృష్ణునకు శరీరాత్మ లొసంగి

పకనాశ్రమణులతో సమానులు కారు. యెందువల్ల
నంగాఁ బైవారందఱు ధర్మము నాశ్రయించి స్వర్గము
సంపాదించిరి. వల్లవీ రత్నంబులు పరబ్రహ్మ నాశ్రయించి
సాక్షంబు సంపాదించిరి యీ విషయంబునందు సందియము
గలవారు శుకవ్యాస పరాశరనారదగాంగేయ హారీతోద్ధవా
ద్యారులనైనను పన్నిద్దఆళ్వారలనైనను బచనంబులనైనను
రామున రామానుజాదులనైన నడిగినఁ దెలియునేగాని
గామరుల నడిగినఁ దెలియదు నేనీ ప్రబంధమును రచించు
చెప్పుడు నన్నయతిక్కన శంభుదాస నాచనసోమనాథ పోత
నామాత్య శ్రీనాథ పెద్దన రామరాజ భూషణాది పూర్వ
మహాకవికృత ప్రబంధంబులను గోపీనాథము వేంకటకవి
గ్రంథవాల్మీకి మొదలైన యిప్పటి కవుల ప్రబంధముల నే
కక్త్యనుసారంబుగా ననుసరించి వ్రాసితినిగాని యెంకిపాటల
ననుసరించలేదు కనుక నూతన ప్రబంధ నిర్మాణచాతురీ
ధులగు మహాకవులు నధీత సర్వశాస్త్రసమూహులగు పండి
తులు జ్ఞానులు భక్తులు మదీయ సాహసంబును క్షమింతురని
సాష్టాంగ నమస్కారంబు లొనరించుచున్నాను.

...ము విన్న...చు
భాగవత శ్రీపాదరేణువు
మొవ్వ వేంకటదాసు.

# మఱియొక విజ్ఞాపనము



ఈ గ్రంథమును రచించి ద్రవ్యాభావముచే ముద్రింపలేక కొన్ని దినంబులూరక కాలంబు గడపితిఁ గాని మాకు శ్రీమన్నారాయణుండును రామానుజయోగీంద్రుండు నొసంగిన భాష్యకార సమాజం బను భాగవత సంఘం బొకటి గలదు. తదీయ సమాజము వారు రామానుజుల వారి జన్మదినమై చిత్రినెలలో వచ్చు నార్ద్రానక్షత్రమందుఁ బ్రతి సంవత్సరము నొక్క గ్రామంబునఁ జేరి యైదు దినములు భగవత్కల్యాణ గుణానుభవ మొనర్చి యెవరి నెలవులకు వారేగుచుందు రీ సంవత్సరము మోదుమూడిలో గోష్ఠిఁ గావించి భాగవతులు నన్నుఁ గాంచి గురుపుంగవా భక్త సమాజము లన్నిటిలో భక్తిలోఁ గాని సంఖ్యలోఁ గాని పవిత్రతలోఁ గాని గోపికా సంఘము చాలా గొప్పదనియు వారి సంఖ్య మూడు లక్షల నేబదివేలమంది యనియు నప్పుడప్పుడు చెప్పుచుందురు దానికిఁ దగినట్టు లీ సంవత్సరము గోపికావిలాసం బను మహాప్రబంధంబు భగవదాజ్ఞచే రచించితిరి దానిం జదివి యర్థము సెప్పుడని యడిగి తదీయ ప్రబంధరాజం బామూలాగ్రము విని యమందానందంబుఁ జెంది దీని నచ్చొత్తించి ప్రపంచంబునం బ్రకటించినచో భక్తులకు

మహోపకారముగా నుండునని తలంచి, చావలి, పెద్దవరం, పూడివాడ, మీసాలవానిపాళెము, కొత్తపేట, కోడూరు, నక్కవానితోట, వక్కపట్లవారిపాళెము, వేకనగారు, గుడివాకవారిపాళెము, చోడవరము, కమ్మనమోలు, నంగేగడ్డ, బడేవారిపాళెం, ఆవలవారిపాళెము మొదలైన గ్రామములలో నుండు భాగవతులు నాలుగువందలరూప్యంబులు గ్రంథముద్రణకై యొసంగిరి ఇూ సమాజధర్మంబు లాచరింపుచు గ్రంథాయుర్వృద్ధికై ధనంబొసంగిన స్త్రీపురుష భాగవతులకు గోపికాజన రంజకుండును రాధారుక్మిణీ సత్యభామా సమేతుండగు గోపాలకృష్ణ పరబ్రహ్మ మాయురారోగ్యైశ్వర్యంబు లొసంగి జ్ఞాన భక్తి వైరాగ్యంబులు పొదలించి రక్షించుగాత మేత్సంఘాధ్యక్షుండగు రామానుజ యోగీంద్రుండు సిద్ధాంత ధర్మంబు లుపదేశించి జనాభివృద్ధిం జేయుంగాక.

ఇట్లు విన్నవించు విధేయుడు,

గ్రంథకర్త.

# భగవతే విజ్ఞాపనమ్

శ్రియఃపతీ! భవదీయ శ్రీపాదారవిందంబులకు మదీయ శిరంబుమోపి కరములు దోయిలించి లలాటంబానించి యానందబాష్పంబులతో దండవత్ప్రణామంబు లాచరింతు నను గ్రహింపుము తొల్లి నేను భాగవతపండిత సాంగత్యంబైన లేని కుగ్రామంబున జనించి పశువులఁగాచుచు నాటపాటలయందు మరఁగి కొండికనై యుండుసమయంబునఁ బన్రెండవయేట స్వప్నంబున దేవరవారు ప్రసన్నులై క్రమక్రమంబుగా నాంధ్ర భాషయందుఁ బ్రవేశింపఁజేసి భారత భాగవత రామాయణాదులయందును వసుచరిత్రము మనుచరిత్రము విష్ణుచిత్తీయము రాఘవపాండవీయము నరస భూపాలీయము మొదలగు తెలుఁగు కావ్యముల యందును నప్పకవీయము మొదలగు లక్షణగ్రంథముల యందును బాలవ్యాకరణము మొదలగు వ్యాకృతులయందునఁ గొంత పాండిత్యంబుఁ గల్గించితిరి నాలుగ్గైదు సంవత్సరములనుండి గీర్వాణ భాషయందు సైతముఁ బ్రవేశము గలిగించితిరి వివిధ సిద్ధాంతరుచియు నానాదేవతావందన పూజనాదులందుఁ గల రక్తియుఁ దొలంగించి భగవద్రామానుజ సిద్ధాంతంబునఁ జేర్చి పీయూషంబు భంగిభోగ్యంబులై తనరారునట్టి శ్రీ పాదంబుల యందనురాగంబుఁ గలిగించితిరి. ముప్పది సంవత్సరముల

వఱకు నన్నొకనిగానెంచి యిప్పటికి మూడు నాలుగు వం
దల భాగవతుల సహాయంబుగా నొసంగితిరి నాటికి మీకంత
రంగభక్తులై పండిత శిఖామణులగు మణవాళ మహామునుల
మదంత రంగంబున నుండునట్లు నియమించి వేదాంత గ్రంథ
రచనాసామర్థ్యం బొసంగితిరి. మీకుఁ బ్రాణతుల్యంబగు
లక్ష్మీ పరిభావంబును మీ యవతార పరిభావంబునుఁ గొం
చెము కొంచెముగాఁ దెల్పితిరి. మదీయ నీచత్వంబునుఁ
ద్వదీయ మాహాత్మ్యంబునుఁ దలంపక నిరంతర స్నేహంబు
నెరపితిరి. ప్రభూ కొంతసేపు భయంబునుఁ గొంతవడి
శాంతియుఁ గొంతకాలంబు చాంచల్యంబు కొంతసేపు కామంబు
కొంతసేపు వైరాగ్యంబుఁ గలిగింపుచుంటివి బాల్య ప్రభృతి
నాకొదవిన భక్తి విఘ్నంబులు దొలంచి నీపూజావందన
శ్రవణ స్మరణంబులకుఁ జాలినంత తీరిక నొసంగితివి. ముందుగా
వచ్చి నీవు నాహృదయంబునఁ బ్రవేశించునప్పుడు నీవెవండవో
యెట్టివాఁడవో యెందుకువచ్చితివో యెఱుంగనైతి నిప్పుడు
మాత్రము నీవొసంగిన జ్ఞానము చే నీవే జననీ జనక సోదర ధన ధాన్య
ధారక పోషక భోగ్యంబులని తెలిసికొంటి నిఁక నన్యుల
నాశ్రయింప వలసిన పని లేదనియు నెఱింగితి నిర్వ్యాజ కరు
ణచేవచ్చి నాకు నీ శ్రీపాదంబు లొసగినా పై నాచార్య
త్వంబు వహించి నన్నింతవఱకుఁ దెచ్చి మేలొనర్చిన నీకుఁ

ప్రత్యుపకారంబు లేశమైనఁ జేయఁజాల నీ ఋణంబు దీర్చు
టకునుఁ దరంబుగాదు నన్ను నీ వనుగ్రహించినది మొదలింత
వఱకుఁ గొండంతవిపత్తులు గోరంతగాఁ దొలంగించితివి బల
వద్వైరుల రూపుమాపితివి యాచించిన వాంఛితార్థంబుల
న్నియు నప్పుడప్పు డొసంగితివి మహాజనులచేతను సామా
న్యులచేతను మెప్పించితివి పుండరీక దళలోచనా! తల్లివై
పోషణంబును తండ్రివై సన్మార్గంబును దాతవై దనధాన్యం
బులును సుహృదుఁడవై సౌహార్దంబును ప్రభుండవై యధి
కారంబు నుపాధ్యాయుండవై విద్యయు నాచార్యుండవై
యర్థపంచక జ్ఞానంబు నిలువేల్పువై సమస్త భోగకుటుంబ
వృద్ధియునొసంగితివి మనోహరా ప్రాణనాధా యింకొక్క పెద్ద
వాంఛితంబుగలదు భార్యావాంఛితంబు భర్తగదా తీర్ప
వలసిన వాఁడు తద్వాంఛితంబెద్ది యంటివా సంసారంబు
నిర్వహించు శక్త్యుపాయంబులు మదీయ పుత్రులకొసంగి
నన్ను బంధములనుండి విడఁదీసి భవదీయ పాదారవింద సేవ
యం దుపయోగించుకొనుము దానికి మార్గమెట్లంటివా ప్రథ
మంబున ధనధాన్య సమృద్ధిగల నీ సేవానిలయంబును దానికిఁ
జుట్టునొక రమ్యారామంబును దయసేయు మటుపిమ్మట
ననేక భాగవతు లానిలయంబునకు వచ్చి నిలుచునట్లనుగ్ర
హింపు మట్లొనర్చితివేని నేను తదీయ నిలయంబునఁ జేరి

భాగవతులకు నీకల్యాణగుణంబు లుపదేశింపుచు నారిచే నీ పూజావందనశ్రవణ స్మరణంబులు సేయింపుచు నీపాదార విందంబులు గొలుచుచు నమృతపానం బొనర్చినట్టి సంతోషంబుతో సంవత్సరంబులు నిమిషంబులుగాఁ గడపెద నీవంటి తుచ్ఛవ కది సిద్ధించుట సులభమా యందువేని నాశక్తిని బట్టి నేను కోరలేదు సర్వశక్తుండవగు నీ సామర్థ్యంబును సముద్రమువంటి నీకారుణ్యంబునుబట్టి యడుగుచున్నాను త్రిజట కుచేలుర కపారైశ్వర్యంబును ద్రౌపది కక్షయవస్త్రం బులును కుబ్జకు లోకోత్తర సౌందర్యభోగంబులును సర్వ లోక పూజ్యతయు సాందీపాదులకు మృతపుత్ర దానంబును వానరుల కద్వితీయ సామర్థ్యంబును మృతవానరులకుఁ బునర్జీవితంబు నొసంగితివి యింతియేకాక నీటిపై రాలు దేలిం చిన నీకసాధ్యం బెద్దిగలదు. సృష్టిస్థితిలయకారణా, సూర్య చంద్రలోచనా, కరుణాసముద్రా, భక్తజనరక్షణదీక్షా ధురంధరా, కోటిసూర్యప్రకాశా, లక్ష్మీమనోహరా, భూసరోజాక్షీ ప్రాణనాథా, రక్తాంభోరుహ సదృశచరణతల యుగళా, శంఖచక్రగదాది దివ్యాయుధధరా, జగజ్జేగీయ మానదరుశశచంద్రికానిలయా, మాదృశదీనజనసంరక్షణ బిరు దాంకితా, విపద్బాంధవా, యాచకజనసమూహకల్పమహీ రుహా, వేదవేదాంతవేద్యాపురుషోత్తమాభిదానా, బ్రహ్మ

విద్యాసదనా సర్వజగన్మోహనాకారా, మునిజనమనః ప్రవృత్తికారణా, నిశాచరసముదయ శోకప్రదాయకా స్వాశ్రిత జనమనోరథసాఫల్యకరా, హారకిరీటకటకకుండల గ్రైవేయక శ్రీవత్సకౌస్తుభ పీతాంబరాది దివ్యభూషణ భూషితా, శ్రీవైకుంఠనికేతనా, నిత్యముక్తబద్ధకేవలముముక్షు నామక పంచవిధజీవసంరక్షకా, సంసారబంధ నిర్మూలనా, ముక్తిరాజ్య ప్రదాయకా, లీలానిత్యనామక విభూతిద్వయైకచ్ఛత్రాధిపతీ సత్త్వగుణ సేవధీ నిఖిల భూభార నివారణకారణ లీలామానుషావతారా భక్తకాంతామతల్లీకాముకా దుర్జనైశ్వర్య నిర్మూలనా దాసజనైశ్వర్య ప్రదాయకా డింగరజన సముదయ దుఃఖతమః పటలబాలభాస్కరా వివిధకిల్బిష గహన వైశ్వానరా కమలభవభవ పురందరాది సమస్త బృందారక బృందకిరీటమణిగణశోభితాంఘ్రికమల యుగళా నిఖిలకల్యాణగుణగణ పరిపూర్ణా హేయగుణరహితా దివ్యమంగళ విగ్రహధరా శ్రీమన్నారాయణా నిన్నాశ్రయించిన యాచకుల మనోరథంబులు సఫలంబై తీరవలయును నీకు ననంత నమస్కారంబులన్ని దిక్కులకుం బ్రణామంబులు సర్వకాలంబులయందు జోహారులు దివ్యచిత్తానుసారంబుగా ననుగ్రహింపుము.

ఇట్లు

భగవద్భాగవతాచార్య కైంకర్యార్థి

మొవ్వ వెంకటదాసు.

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ సీతాలక్ష్మణభరత శత్రుఘ్నహనుమత్సమేత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# గోపికావిలాసము

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీరాధారమణీ మనోవిమల రా ♦ జీవద్విరేఫంబు భూ
భారధ్వాంతదినేంద్ర బింబము నిలిం ♦ పద్వేషివంశాటవీ
ఘోరాప్పిత్రశిఖావరండము మహా ♦ గోపీకురంగేక్షణా
సారంగాంబుదమైన కృష్ణుఁ డిడు నై ♦ శ్వర్యాయు
రారోగ్యముల్॥

ఉ॥ క్రమ్మినమానవేశ్వరులఁ ♦ గాదనిపుర్వుల శేవదూటి మో
దమ్మున లేఖ వ్రాసి ముర ♦ దానవభంజనుఁ బిల్వఁబంచి శీ
ఘ్రమ్మున నమ్మహాత్ముని క ♦ రంబు గ్రహించి సుఖించినట్టి మా
యమ్మ విదర్భరాజతన ♦ యామణి రుక్మిణి ప్రోచుఁగావుతన్॥

సీ॥ సిరికనుకూలురై హరిఁగూడి నిరతంబు
తనరు ధాత్రీనీళలను నుతించి
పన్నగాధిప చమూపాలసుపర్ణాది
నిత్యసూరులకుబల్ నియతి మ్రొక్కి

శార్ఙ్గకౌమోదకీ చక్రనందక పాంచ
జన్యాది చంద్రహాసములఁ గొలిచి
హరి యురస్స్థలమందు ననిశంబు విలసిల్లు
శ్రీవత్సకౌస్తుభ శ్రీలఁ దలఁచి
బహువిధంబుల గోదాప్రభావమెంచి
భట్టనాథ సరోభూతభక్తిసార
ప్రముఖ ద్వాదశ సూరుల పాదపద్మ
ముల కనారతభక్తి నంజలిఘటించి॥ 3

క॥ కరుణానిధియై రాఘవ
శరణాగత జనములకు నజస్రము ప్రాపై
శరనిధి లంఘించిన సు
స్థిరబలు మారుతిని శిరియు తిరువడిఁ గొలుతున్॥ 4

చ॥ జననమునొందుటాది తలి ♦ చన్నుల దుగ్ధములైన గ్రోలక
ద్దనుజ విరోధిపాదములె ♦ ధారకపోషక భోగ్యపాళిగాఁ
గొని మునుతింత్రిణీవిటపి ♦ కోటరమందు వసించి ద్రావిడం
బున శ్రుతులుగ్గడించినసు♦పుణ్యుశఠారిని సన్నుతించెదన్॥

సీ॥ వేదాంతములలోని విష్ణుప్రభావమే
ధన్యుఁడాస్తోత్ర రత్నమునఁ దెలిపె
శైశవమందె శాస్త్రములెల్ల నేర్చి యే
వాగీశుఁడక్కియాళ్వానుగెలిచె
శ్రుతి విరుద్ధార్థసంయుత మతధ్వంసంబు
గావించి యే సూరిఘనత కెక్కెఁ

దన దయాభావమందటికిం గన్పడ నేమ
నీషివర్యుండు మారనేరి నేలెం

గంధిలోని మానికములట్లు రామాయ
ణాదులందుం గల మహారహస్య
విషయములను ప్రజకు వివరించె నే గురుం
డట్టి యామునార్యు నభినుతింతు॥ 6

సీ॥ జిహ్వాద్యదరాసక్తచిత్తులై వర్తించు
మానవావళికి సుజ్ఞాన మొసంగి
శ్రీభాష్యసరణిచేం జిదచిదీశ్వర తత్త్వ
విషయ మందటికిని విశదపరచి
కుమతవాదమునందు శ్రమ మొందు హాటికి వే *[వా.]*
దవిహిత రాజ పథంబుసూపి
నరతిర్యగాది నానాభూతములకు శా
శ్వత మోదమైన మోక్షంబొసంగి

శారదాదేవి ప్రబల సంశయము వాపి
భార్గవీ కేశవుల కీర్తి ప్రజకుం దెలిపి
ఘనన్నృపాలుర శిష్యులంగాంగ నేలి
యశముం గాంచిన రామానుజార్యుం దలంతు॥ 7

సీ॥ పెరలలోంగల తేనెం బిండినట్లద్రావి
డామ్నాయములకు వ్యాఖ్యలు రచించి
పూని మాణిక్యంబు సానంబట్టిన మాడ్కి
భాష్యకారమతంబు ప్రబలంజేసి

విష్ణుప్రభావంబు వినిపించి జనులకు
సంసారబంధంబు సడలఁజేసి
శేషాద్రికరిగిరి శ్రీరంగముఖ మహా
క్షేత్ర కైంకర్యముల్ చిక్కవాఁ

పూర్వగురువుల కీర్తులు పొదలఁజేసి
యతిపతి పదాంబుజములనారతముఁగొల్చి
యస్మదాదులకొక నిధియై చెలంగు
సౌమ్యజామాతృయోగీంద్రు సన్నుతింతు॥ 8

ఆ॥ భూతకాలమందుఁ బుట్టినకవుల కి
క్కాలమందుఁ గల సుకవివరులకు
భావికాలమందు వర్ధిల్లు కవులకు
విమలభక్తి వందనములొనర్తు॥ 9

ఆ॥ కవికృతంబులైన గ్రంథముల్కీర్తిఁ జెం
దింపవలయు నన్నదిక్కపండి
తాళిగానవారి యంఘ్రులు వినుతింతు
శిరమువంచి నుదుటఁ జేతులుంచి॥ 10

ఇబ్భంగి నిష్టదేవతా వందనంబును పూర్వాచార్య పరంపరా వైభవంబును స్తుతించి విద్వత్కవులకుఁ జిన్నిపూలు గావించి మదీయ వంశక్రమంబెఱింగించెద నెట్లనిన॥ 11

సీ॥ మురవైరి పదపద్మమున జనించిన వేల్పు
ఓటికిఁ దోఁబుట్టు వెద్దియయ్యెఁ

బంటలు నేలపైఁ బండించి యెల్లరఁ
గాచి కాపను పేరుఁ గాంచె నెద్ది
భూపాలురకు వేలుపులకుఁ గావలసిన
ధాన్యంబు గల్గె నెద్దానివలన
నైమిశాటవిఁ బురాణములు నిరాబార్ల
కెఱుఁగఁ జెప్పిన సూతుఁ డెందుఁ బొడమె

నట్టి బలిజకులమున మొవ్వాన్వయమునఁ
బైడిపాలగోత్రమునందు భవ్యయశుఁడు
సూరయార్యుండు పుట్టె యాధీరుఁడు కనె
సరవి భగవానులను బాలచంద్రు నెలమి॥ 12

క॥ వారిద్దఱు పండితులై
ధారాళముగాఁగ భారతము భాగవత
శ్రీరామాయణములు జన
వారమునకుఁ దెలిపి కీర్తివడసిరి పెలుచన్॥ 13

తే॥ మఱియు వారలు గుంటూరి మండలమునఁ
బూడివాడను వీటఁ గాఁపుర మొనర్చి
కాలమును ద్రోయుచుండంగ బాలచంద్రు
వీడుకొని భగవాను లవ్వీడు వదలి॥ 14

క॥ మామిళ్ళపల్లె పేరిటి
గ్రామంబున కేగి యచటఁ గడువేడుకతో
ధామంబుఁ గట్టుకొని శ్రీ
రాముని కృపచేతఁ గాఁపురంబు నడపుచున్॥ 15

ఆ॥ వంశవృద్ధిఁగాంచి వర్తించె నాతని
విషయ మట్టులుండ విమలచరితుఁ
డైన బాలచంద్రుఁ డప్పాడివాడలో
నిలిచి కాపురంబుఁ జలుపుచుండ॥ 16

తే॥ ఆతనికి రామయాహ్వయుం డవతరించె
రామయకుఁబుట్టె జానకిరామ యార్యుఁ
డమ్మహాధీరుఁ డొగి బాపమాంబతోడఁ
గాపుర మొనర్చి సుఖమొందు కాలమందు॥ 17
ఆ॥ రహి జనించిరోలి రాముని కరుణచే
ముత్తయార్యుఁడును బ్రమోద భరితుఁ
డైన లక్ష్మణార్యుఁడటుమీఁద రామయ్య
కృష్ణమార్యుఁ డనఁగఁ గీర్తిపరులు॥ 18
క॥ ఆ నల్వురునందనులు మ
హానందముతోడఁ బాపమాంబను జనకుం
గ్లానిఁగనకుండఁ బ్రోచిరి
పూనికతోఁ బుండరీకుఁ బోలినవారై॥ 19
వ॥ వారి యందు___ 20
సీ॥ పరులదోషములెన్న పలుగాకులనుఁ గన్నఁ
జెవుల లోపల వేళ్ళు సేర్చువాఁడు
పరవధూజనపాళి బాటలో నెదురైనఁ
బెడ మొగంబిడి దారి విడుచువాఁడు
పరధనంబన్న సర్పమునుఁ గాంచిన భంగి
భయమొంది యెపుడు లోఁబడనివాఁడు

తనశీలమునుఁ బరుల్ వినుతింపఁ జొచ్చిన
సిగ్గుచేఁ గేల్దమ్మి లొగ్గువాఁడు
నగుచు వర్ధిల్లి కృష్ణార్యుఁడంతమీఁద
వంశవృద్ధి నొనర్పంగ వాంఛఁ జేసి
వక్కపట్లాన్వయంబున వన్నెకెక్కి
నట్టి శ్రీకృష్ణమాంబఁ బెండ్లాడె నెలమి॥ 21

సీ॥ అనసూయ నిచ్చోటఁ గనఁగల్గె మాకని
సజ్జనాగ్రేసరుల్ సన్నుతింపఁ
జింతామణిని నిరీక్షించినామని సదా
బాంధవ యాచకుల్ ప్రస్తుతింప
మాకు యశంబు సంపాదించి నావని
తల్లిదండ్రులు సహోదరులు వొగడ
సంసారభారంబు నడలెఁ బోతనకని
నాయకుం డతిశయానంద మొంద

నిరుగు పొరుగువార లీమెరీతి నటింప
మనకు మేలుగల్గునని తలంప
వెలసెఁ గృష్ణమాంబ విష్ణుదేవునిపాద
పంకజములపైఁ బ్రపత్తిఁ జేసి॥ 22

క॥ సారగుణంబులు గలిగిన
యారామామణికిఁ గృష్ణమార్యునకును నే
నౌరసుఁడ వేంకటాఖ్యుఁడ
శ్రీరామానుజ మతమ్మునఁ జేరిన వాఁడన్॥ 23

సీ॥ పదియు రెండేడుల ప్రాయంబుగలనాఁడె
తనపాదసేవా నిధాన మొసఁగి
జ్ఞానమార్జవమనుష్ఠానంబుగల సదా
చార్యుల పాదకంజములఁ జేర్చి
పరమ వైదికమని ప్రఖ్యాతిఁ గన్నయ
తీంద్రసిద్ధాంతంబుఁ దెలియఁ జేసి
యేనుండ గురుశిక్షలేల నీకని సంస్కృ
తాంధ్రభాషా విషయముల నేర్పి
సదనసన్నిధిఁ గల్పవృక్షంబుపగిది
నాలయముతోడ గోపాలకాఖ్య వెలసి
నన్నుఁ బ్రోచిన శ్రీరమానాయకుని ఋ
ణంబుదీర్పంగఁ గోటిజన్మముల కగునె॥ 24

క॥ ప్రీతిగ వేదాలకులో
ద్భూతుంగాండిన్యగోత్రుఁ బుణ్యచరిత్రున్
సీతారామాచార్యునిఁ
జేతస్సునసన్నుతింతుఁ జిరకాలంబున్॥ 25

ఆ॥ సంజయునకుమున్ను సత్యవతీసూనుఁ
డెలమితోడ జ్ఞానమిచ్చిప్రోచు
మాడ్కిభాష్యకారమతముఁ దెల్పిన సము
ద్రాలలక్ష్మణార్యు రహినుతింతు॥ 26

వ॥ ఇట్లు మదన్వయక్రమంబెఱింగించి గురువందనంబుగావించి
నాయొనర్పంబూనిన గోపికావిలాసంబునకుఁ గథాక్రమం

బెట్టిదంటి రేని మునుప్రాయోపవిష్టుండైన పరిక్షన్నరేం ద్రుండు పరమభాగవతశిఖామణియైన శుకయోగీంద్రుని వలన భాగవత మహాపురాణంబు వినుచు నొక్కతటి నిట్లనియె మునీంద్రా! మహితాతపంబున డస్సినవాఁడు గంగాప్రవాహంబునఁ బ్రవేశించి తృప్తిఁగాననిచందం బున శ్రీకృష్ణ కథాప్రపంచంబు వక్కాణింపుచున్న దేవర వారి వాగమృతంబు జుఱ్ఱుచున్న నాకుం దనివి లేదయ్యె నది యట్లుండనిమ్ము గోపికాజనంబులు సర్వబంధు పరి త్యాగంబొనర్చి శ్రీకృష్ణునిఁ గామించి మోక్షంబుఁ జెంది రని చెప్పితి విది పరమాశ్చర్యకరంబుగానున్నది పాతి వ్రత్యంబు విడిచి జారభావంబున వాసుదేవునిఁ బొందిన గోపాలాంగన లెట్లు మోక్షంబుఁ జెందిరి లీలాగృహీత మానవదేహుండగు పరమేశ్వరుండు జారత్వంబెట్లు గావించె నీ సంశయంబు నివారింపవే యనిన వ్యాసనంద నుం డిట్లనియె. 26

సీ. నుడివినప్పుడె పాపమడఁగించి పుణ్యముల్
గలిగించు కృష్ణునాఖ్యల పవిత్రి
మాలకించినచో మహోవాంఛితము లిచ్చి
తనియించు కృష్ణగాధావిధంబు
స్మరియించినంత సంసారతాపము వాపి
లాలించు కృష్ణలీలాప్రసిద్ధి
సలిపినప్పుడె విరోధులఁ గూల్చి సుఖమీయఁ
జాలిన కృష్ణపూజావిధాన

మాత్మ నెఱింగిన వారికయ్యాదిపురుషు
సారచేష్టలయందు విశ్వాసమతిశ
యించు నేగాని సంశయ మెట్లుగలుగు
నైనఁదీర్తుఁ గొఱంత నీవాలకింపు. 27

సీ. నెరతాతయై మహాత్తరబ్రహ్మవిద్యాని
ధానమైనట్టి శాంతనవుఁజంపి
నిజగురుండై బ్రాహ్మణజనాగ్రగణ్యుఁడై
వినుతిఁగైకొన్న ద్రోణునివధించి
జాత్యంధు తనయులై స్వజ్ఞాతులై యున్న
దుర్యోధనాదులఁ ద్రుంగజేసి
నిఖిలలోక విరుద్ధ నీతిగాఁ బాంచాలిఁ
గైకొని విపుల భోగంబులంది

యైనఁ బాపంబుగాని దుర్యశముగాని
పొందరైరిగదా పాండుపుత్రులట్టి
వారిశుద్ధులఁజేసిన వారిజాక్షు
నందు సందేహమేటికయ్యా నరేంద్ర! . 28

సీ. ఆర్తినూసరవెల్లియై నూఁతిలోబడ్డ
నృగుశాపమడఁచి స్వర్గగతిఁగూర్చె
వేలబాలకుల దుర్వృత్తిచేఁ జంపిన
చెడుపూతనకు మోక్షసిద్ధి నొసఁగెఁ
గంసునిదాసి వక్రితలెల్ల గడియలో
మాయించి సమకూర్చె సోయగంబు

సోఁకుతేఁడైన ఘంటాకర్ణునకుఁ దదీ
యానుజునకు ముక్తి నందఁ జేసె
నట్టి వాసుదేవు నఖిలలోకేశ్వరుఁ
బతితపావనుని బ్రపన్నపోషు
నాశ్రయించు గోపికానీకములు శీల
వతులుగాక దుష్టసతులె రాజ!. 29

సీ. ధనము రత్నములు కుందనములు నగలు చీ
రలును సారెలునుఁ జంచలములనుచు
సుతులు కూఁతుండ్రు స్వపతులు భావలు మాతృ
పితలును హితు లశాశ్వతులటంచు
దిండ్లు పానుపులు లోగిండ్లు ముంగిండ్లు చా
వళ్ళు సస్యంబులు వ్యర్థమనుచు
బావులెద్దులు గేదెలావులు ధాన్యముల్
పూవుఁదోఁటలు నెండమావులనుచు
నెఱిఁగి వీని కెల్ల నెకిమీఁడు శ్రీకృష్ణుఁ
డని తలంచి యమ్మహానుభావు
నాశ్రయించి కొలిచినట్టి యువ్వల్లవీ
జనుల కెనయె మానిజనములైన. 30

వ. అది యట్టులుండ భగవత్సృష్టియందు నసురులనియు దేవతలనియు రెండువిధములుగా నుందురు. మఱియు సర్వ యుగంబులందును సర్వలోకంబులందునుఁ గలరు. వారిలో దేవతలు భగవదభిముఖులై భగవదవతార రహస్యం

బులు దెలిసికొని తదీయుల నారాధింపుచు భగవత్కథా ప్రపంచంబు నాకర్ణింపుచు నాయా సమయంబులందు గద్గదపాటు, శిరఃకంపము, నానంద బాష్పంబులు బద్ధాంజలి గలవారై వర్తింపుచుందురు. వారి కట్టిసమయంబున లోకాభిమానము, దేహాభిమానము గోచరింపదు. దేవతాసృష్టి మానవులయందేకాక సమస్త జంతువులయందు వర్తించు నెట్లంటివేని వానరులలో హనుమంతుఁడు, పక్షులలో జటాయువు, బోయలయందు శబరీగుహులు, పశువులలో గజేంద్రుఁడు, స్థావరంబులలో నహల్య, రాక్షసులలోఁ బ్రహ్లాద బలివిభీషణులు, మృగములలో జాంబవదాదులు, మానవులలో రుక్మాంగదార్జున భీష్మాదులు విష్ణుభక్తులగుటంజేసి దేవతలనంబడుదురు. గోపాలాంగనలట్టివారిలోఁ జేరినవారనియెఱుంగు మింతయేల హరిభక్తలును హరి కనుకూలురైనవారును దేవతలనియు విష్ణుద్వేషులు రాక్షసులనియు నెఱుంగుము. నీవు దేవతాసృష్టిలోఁ జేరిన పాండవవంశమునఁ బుట్టినవాఁడ వగుటంజేసి భగవత్తత్వంబు నీకు రుచించుననియెంచి వచించెద నాలకింపుము. భగవదవతారంబు లనంతంబు లందుఁ బది ప్రశస్తంబు లందులో రామకృష్ణావతారంబులు ముఖ్యంబులు. రామకథాసుధారసం బిదివరకు సంగ్రహంబుగా నీకు వివరించితిఁ గృష్ణకథ నుపక్రమింపఁగా దానినే నీవడిగితివి. తొల్లి బ్రహ్మరుద్రాదులచేఁ బ్రార్థితుండై శ్రీమన్నారాయణుండు దేవకీవసుదేవుల కవతరించి గోకులంబుఁ జేరి తద్దేశ

నివాసుల నానందింపఁ జేయుచుండె. నది యట్లుండఁగా
మున్ను రామావతారకాలంబున భగవంతుని మోహించిన
మునులు గొందఱును చిరకాలంబు భగవదారాధనంబొన
ర్చిన దివ్యాప్సరసలును గోలోకవాసులైన స్త్రీలును మంద
యందు జనించి కృష్ణావతారవిలాసంబు లనుభవించుటకై
వేచియుండి రందువలన గోపికలు జారిణులుగారు జగచ్ఛరీ
రుండైన శ్రీకృష్ణునకు స్వకీయ పరకీయ భేదంబు లేమిం జేసి
పరకాంతలు లేరుగాన నప్పరమేశ్వరుండు జారుండునుగాఁడు
విద్యాభ్యాసంబొనర్చు వాఁడు ఉపాధ్యాయునిచేఁ దోలు
తొత్తు దెబ్బలు దిని సభాపూజ్యుండైనట్లు ఘోషయందు
జనించిన గొల్లచానలు కొంతకాలంబు సంసారదుఃఖం
బనుభవించి శ్రీకృష్ణదర్శనమాత్రంబుచే బంధంబులూడ్చు
కొని గోవిందునితో నేకీభవించిరి. వల్లవభామల నేత్రం
బులు జ్ఞానంబు, వారి పాలిండ్లు భక్తి, వారి నడుములు
వైరాగ్యంబు, జ్ఞానభక్తి వైరాగ్యంబులు మూడును
మానవ స్త్రీ శరీరంబులు దాల్చి భగవంతునియం దిట్టి
పారతంత్ర్యంబువహించి ప్రేమించినంగాని జీవులకు శాశ్వ
తానందంబు కలుగనేరదని ప్రదర్శింపవచ్చిన లోకగురువు
లని గోపికల భావింపవలయు, దీనికి విరుద్ధాభిప్రాయంబు
గల మూఢులు నశింతురని మదీయ జనకుండైన వేదవ్యా
సుండు భాగవతంబురచించి నాచేఁబఠింపించెఁ గాన వల్లవీ
జనుల పవిత్రచరిత్రంబాకర్ణింపుము. మాధవుండు బలరామ
సహితుండై నందునింటం బెఱిగి యేడెనిమిది వర్షంబుల

వయస్సు గలవాఁడై గోవుల మేపుచు గోపార్భకుల గూడి యాడుచుఁ బాడుచు వేణువూదుచుఁ గాలంబు గడపు చుండ నొక్క సమయంబున నతని జగన్మోహనా కారంబుఁ గాంచి మోహించి వివాహంబు కాని గోపకన్యామణులు, పుష్పమంజరి, లతామంజరి, కన కాంగి, ప్రసవబాణము, మదనతంత్రి, మాలతీగంధి, గంధవతి, పద్మావతి, సరోజినీ, కమలినీ, వారాహి, త్రిలోకసుందరి, మిహిరప్రభ, కుముదినీ, దరహాసినీ, విలాసినీ నవలామిన్న, సుకుమారీ, పాటలగంధి, పద్మగంధి, కమలావతి, రాజీవగంధి, ప్రసూనమంజరి, కుముద్వతి, మరుద్వతి మొదలైన సహస్రసంఖ్యాకు లొక్కచోఁ జేరి వారిలోఁ బుష్పమంజరి యిట్లనియె. 31

మ. చెలులారా! వినుడీ వచించెదను నా చిత్తంబు శ్రీకృష్ణునం
ఘ్రులపైనూరులపై గటిస్థలముపైఁ గుక్షిప్రదేశంబుపై
లలితోరస్థలిపై గళంబుపయివాల్లభ్యాలయంబైన చే
తులపైనెక్కొని లెక్కచేయదితరోద్యోగంబులెల్లప్పుడున్.

సీ. అద్దంబుఁజూడ నేనాసించునపుడు శ్రీ
హరి కపోలములపైఁ బరువులెత్తు
సంపెంగననలవాసనఁ జూడఁగోరుచోఁ
గేశవునాసపైఁ గెరలియాడు
సరసీజములసొంపుఁ బరికింతునన్నచో
వెన్ను నికనుదోయి చెన్నుఁదలఁచు
దమ్మికెంపుల సోయగమ్మెంతుననయత్తో
డాపుత్రు రదనచ్ఛదములఁ జేరు

నాదుచిత్తపుట్లు నలినాక్షునవయవా
శ్రియముఁజెంది యుంట సర్వచేష్ట
లుడిగి జాడ్యమున బరుదోర్యగ్నై యుంటి
నేమి చిత్రమమ్మ భామలార. 33

ఉ. నింగినిఁ గాంచినప్పుడును, నీలవలాహకముం దమాలశా
ఖంగనినప్పు డంబునిధి, కింజని చూచినవేళ ఖంజనం
బుంగనువేళ నచ్చెరువు, మోదమునాకొదవున్ మురారిది
వ్యాంగసమానవర్ణమయి,నందునఁగాక హేతువున్న దే.

సీ. జలజాక్షు మందహాసంబిచ్చు సుఖమున్నె
పండువెన్నెలలోఁ బరుండియున్న
నందాత్మజుని కంఠనాదసమంబౌనె
కెంపుకంటుల పాటసొంపువిన్న
దేవకీసుతు దివ్యదేహ సౌరభమున
కెనయౌనె పూలెల్ల నేకమైన
సరసీజనాభుని సంభాషణములౌనె
గుడశర్కరలను మీఁగడనుదిన్న
నట్టిపుణ్యరాశి నాశ్రయింపనియాడు
దాని కేల చక్కఁదనము ధనము
ఘనము నేర్పుగలుగు మనము చందనము జ,
వ్వనము వనముగాదె వనితలార. 35

సీ. వనజాక్షుఁ డొంటిఁజేరినచోట్ల సారెసే
రితిఁగాని ననుఁ బల్కరింపఁడయ్యె

మురహరుం డెపు డైనఁ బరిహాసమాడితి
నైనను మాఱుమాటాడఁడయ్యె
హరిచేతిలో వేణువంది తీసితిఁగాని
తిరిగి కైకొనఁ బ్రయత్నింపఁడయ్యె
సరసీజనాభు పైఁ జాడీలు చెప్పితిఁ
దెలిసియు నన్ను గద్దింపఁడయ్యెఁ
బన్ని చూచియుంటి నెన్నో యుపాయంబు
లన్ని గతులఁ గృష్ణుఁ డందకుంటఁ
జింతఁ జెందియుంటి చెప్ప రేయతని వ
శీకరించు నేర్పు చెలువలార! 36

వ. అమ్మాటలాలకించి లతామంజరి యిట్లనియె. 37

క. నాకొక్క దానికే యిటు
శ్రీకృష్ణునియందు వలపు చేకురెననుచున్
వ్యాకుల మొందియు నేఁడిది
యాకర్ణించుటఁ బ్రమోదమయ్యెను సుదతీ! 38

క. ఏ యేవస్తువుఁ గాంచిన
నా యెడ వసుదేవ సూను నపఘున విధమే
నా యెదనుఁ దోఁచుచున్న ద
హా! యీయద్భుతము తెలియ దంగనలారా! 39

క. శ్రీకృష్ణుఁ డెపుడు నాకు వ
శీకృతుఁ డగునో యటంచుఁ జిత్తములో నెం
తో కాలమునుండి తదీ
యాకారప్రాప్తిఁ గోరు దంగనలారా! 40

క. మావారు సజ్జ చేసిం
గావఁగఁ బంపింప నేనుఁ గాచియును దినాం
తావసరమునం దింటికిఁ
బోవుతఱిఁ నందసుతుఁడు పొడకట్టెఁ జుమీ. 41

క. ఇదిరా లభించె నేటికి
హాదనని నేనుబ్బి రెండుహస్తంబులతోఁ
గదియంబట్టినఁ ద్రుటిలో
నదృశ్యుఁడై చనియె నా దినాది వివశనై. 42

సీ. చవులెన్నొ మావారు సమకూర్చిపెట్టిన
బువ్వ నోటికిఁబోదు పొలఁతులార
పొరుగిరుగిండ్లవా రొరసిన స్జీరిన
వినిపించదమ్మ యో వెలఁదులార
సోదరుల్ లాలింపఁజొచ్చిన బదులాడ
శక్తిచాలదు నాకుఁ జానలార
ధనవంతులగువారు మనవుకై రాగఁ జీ
వాట్లు కొట్టితినమ్మ వామలార
విందులైనవారు వెత్తిపట్టెనటంచు
మందులిచ్చిరమ్మ మగువలార!
యిన్నిగోల లిట్టులున్న వెన్నని వెన్నుఁ
డన్నుచున్న దేడఁద తల్లులార! 43

మ. దిగుఁ్రారోగ మొదయ్యెమో తెలుపరాదే యింత దీనత్వమే
వగఁగల్గెం దరుణీ! యటంచు నను మావారెల్ల గద్దింపగా
సగమైమ్రాన్పడియుంటి లోనఁగలవాంఛం దెల్పలేనైతి వీ

లగునో కాదు ప్రమాదమేమొ యని యెట్లానోగదే
ముందికన్. 44

మ. అరవిందాక్షుని దెచ్చి నాయెదుట బాహాటంబుగా నిల్పి
యి । ప్పురుషుం బొందుమటంచు నీయఁగల సత్పుణ్యాత్ము
లిచ్చోటు లేర్ । దొరకన్నేరరుగాని యట్లయిన సంతో
షించి నే వారికిన్ । వరహాల్ మాడలు మేడలిత్తునుగదా
వాంఛానుకూలంబుగన్. 45

వ. అవ్వాక్యంబుల కలరి కనకాంగి యిట్లనియె. 46

క. మందను జనియించిన మన
కందఱికిబ్భంగిఁ గృష్ణునమలాంగముపై
డిందని మోహముగలుగుట
ముందటిజన్మముల సుకృతమున నేమొగదా. 47

క. మానినినై మగవారికి
బానిసనై యుండనేల పరిణయమసలే
మానెదనని నామదిలోఁ
బూనితిఁగొన్నాళ్ళు వ్రతము పొలఁతుకలారా! 48

ఉ. కాని సరోజలోచనుఁ డొకానొకవేళ నొయారమొప్పమా
చేని సమీపమార్గమునఁ జిత్రగతింజనుచుండి చేసెఁ బో
గానము వేణువొత్తియది కర్ణపుటంబులఁబడ్డదాది నేఁ
బూనిన శాబ్ది యే దిశకుఁ బోయెనో కాముకినై తదాదిగా. 49

సీ. తలఁబ్రాలు నే యశోదా కుమారుని మీఁద
బోయుట కెద్దియుపాయమనుచుఁ

పాణిగ్రహణమేను పంకేరుహాక్షుతో
నందుట కెవరు సాహాయ్యులనుచు
నా మోహ మెఱిఁగించి నందపుత్రుని రహ
స్యముగఁ దెచ్చుట కెవ్వరర్హులనుచు
నేకాంతమున నాకు శ్రీకృష్ణుఁ డెప్పుడు
కఱవుదీఱ లభింపఁగలఁడటంచు
గరఁగుచున్నది చిత్త మంగార సవిధ
మందుఁగల నవనీతమట్లద్భుతముగ
నేమిచేయుదు నింక నా కెవరుదిక్కు
చెప్పరే చేడెలార! తోఁచిన విధంబు. 50

—♦ ప్రసవబాణ మను చిన్నది ♦—

తే. రెండువైపుల వాయింపుచుండ నఱుగు
డోలుతో మొఱవెట్టిన ఱోలు పగిది
నున్నది గదమ్మ నీవు నేడన్న మాట
నే నెవరితోడఁ జెప్పదునే లతాంగి! 51

క. ఇరువది దినముల క్రిందట
సరసికి నే జలకమాడఁజని చూడంగా
సరసీజాక్షుండచ్చట
నోరిమంద్రావింపుచుండె నుదకము పసులన్. 52

ఉ. ఒంటరిగా లభించెఁ బురుషోత్తముఁడీ సుకృతాంబురాశి నా
పంటలచేను యోగిజన భాగ్యము మన్మథ మన్మథుండు వే
గంటికిఁ బ్రాపు నెల్ల తెఱగంటులకున్నిధి యంచుఁ డాసి నే
నంటితి రెండుచేతుల నహా! యని గొబ్బున నుబ్బియాడుచున్.

వ. ఇట్లు రెండుకరంబులన్ బిగియఁబట్టి. 54

సీ. విరివియై కండచేఁ బెడగారు ఱొమ్మునా
గుత్తంపు బాలిండ్ల నొత్తియొత్తి
బాకినోటి మెకంబు బందుగా నడుమునా
హస్తయుగ్మంబుతో నదిమి యదిమి
ముకురంబులకుఁ జిన్నఱికమిచ్చు చెక్కులు
దంతక్షతములచేఁ దాఁకి తాఁకి
చెఱకడంబును గెల్చు చెంగావిమోవుల
పానకంబింపార నాని యాని
కాఁగిలించితిఁ గృష్ణు నక్కటిక మొప్పఁ
గాని యాతండు యోగిచందానఁ జిత్త
చంచలము మాని యొక నిమిషంబులోన
దృశ్యమయ్యెను నా వాంఛ దీఱకుండ. 55

ఉ. ఆనగుమోము నాపరిమళాధిక మాగమనంబుతీరు నా
మేనిమనోజ్ఞ మక్కనులు మేలము చాతురియావిలాసమా
గానము నాయొయారమును గంజదళాక్షునికొప్పఁగాక యే
మానవులందునైన సురమండలమందునఁ గానవచ్చునే.

ఉ. దేనికనిష్టసంచయముతీరునొ దేనికిఁ బూర్వపుణ్యపా
థోనిధులుబ్బివిఘ్నములఁ ద్రోసి ఫలించునొ దేనిచిత్తమ
జ్ఞానము రోసి ధ్యానమని శంబొనరించునొ దానికబ్బు ప్ర
జ్ఞానిధియైన మాధవుఁడు చప్పనిమాటలు వేయునేటికిన్. 57

మ. హరియెచ్చోట వసించునో యనుచు నే నారాటముం జెంది నే
ర్పరినై నందునియింటి కేగితిని యాపై గోవులన్ మేపు చో

టరయంబోయితిసూర్యపుత్రిఁగని బృందారణ్యముంగంటినా
సరసున్ డాయఁగవీలుగాక మఱి సంచారంబులేమానితిన్.

ఉ. తక్కినకోరికల్ మఱచి తామరసాక్షుని పాదపద్మముల్
చక్కని కన్నులుందొడలు సైకపు మధ్యముమందహాసమున్
నిక్కభుజంబులుం జెవులునిద్దపుఁజెక్కులమోఘపాణులున్
మ్రొక్కి నమోనమో యని నమోయని ధ్యానమొనర్చి
తిం జుమీ. 59

మ. బలునాళ్లీగతిఁ జేయ నొక్కతఱి స్వప్నంబందుఁ గన్పించియ
జలజాక్షుఁడు నన్నుడాసినిజహస్తస్పర్శమీయంగ మేల్
కలిగెన్ నాకని సంతసించిపులకల్గాఢంబుగా రేఁగఁ గ
న్నుల నానందజలంబులన్ విడిచి కృష్ణుం గానలేనైతిగా.

వ. అట్లులదృశ్యుండైన శ్రీకృష్ణుని పాణిస్పర్శంబు కలయందుఁ
బ్రాపించుటచేతఁ గలిగినసుఖంబు పరిమితిలేనిదై యున్నది
సరేగదా; తదాదిగ. 61

సీ. ఊధస్యమున గుడంబుంచి త్రావిననాటి
సుఖమంత గొప్పగాఁ జూడలేదు
సితలోన జున్నుంచి స్వీకరించిననాటి
చవి మిక్కుటముగ నెంచంగలేదు
మావిపండునుఁ దేనెలో వైచి తినునాటి
రుచి మంచిదనుచుఁ గోరుకొనలేదు
కదళి ద్రాక్షాఫలౌఘములు మెక్కిననాటి
తృప్తి హెచ్చనుచు నుతింపలేదు

నా మనంబు నందనందను మృదుకర
స్పర్శ మొందునాటి సౌఖ్యమెంచి
మరల వానిపొందు మన కబ్బు టెటులంచుఁ
దలఁచుచున్న దమ్మ తరుణులార! 62

—♦ మాలతీగంధియను కన్య ♦—

సీ. ఏసాధ్వి తపము తాఁ జేసియుండెనొగదా
హరి నమలిన విడెంబారగింప
నే చంద్రబింబాస్య నోచిపుట్టెనొగదా
మురవైరితోడఁ గాఁపుర మొనర్ప
నేచాన దానంబు లెంచిచేసెనొగదా
సరసీజనయనుఁ గుచముల నెత్త
నేరామ తీర్థంబు లెలమిమెట్టెనొగదా
లలిఁ జక్రితోడ సల్లాపమాడ
నట్టిపుణ్యంబులేమి లేనట్టిభామ
కెట్లుమగడగు శ్రీకృష్ణుఁడీహ లెల్లఁ
దీర మనకంత భాగ్యమిం దేరికైనఁ
గలదొ లేదొ గదమ్మ యో కాంతలార! 63

సీ. ప్రాణేశ! రమ్మని పద్మనాభుని బిల్చు
నధికారమున్నచో నబ్బమెద్ది
కంజాక్షుపదము లంకమునఁ జేర్చి యొత్తు
సౌభాగ్యమున్న నసాధ్యమెద్ది
కనుసైఁగచే నెల్లపనులు శౌరికిఁ దెల్పు
భాగ్యంబు గల్గుచో భారమెద్ది

ఏకశయ్యా సౌఖ్య మెనసి కృష్ణునిఁ గొల్చు
చనవున్న చో లేని సౌఖ్యమెద్ది

పూవుఁబోడికి సన్నియుఁ బొందినట్లు
కాని యా చక్రధరు నపాంగప్రసార
ప్రాప్తి సమకూడు నట్టి యుపాయమిప్పు
డరయవలెఁ జుమ్ము మనము నేఁ డతివలార! 64

సీ. దిరిసెనపూలు శోధించి కాంచితిఁగాని
దైత్యారివంటి మార్దవము లేదు
మొగలిరేకుల సొంపు నొగి నారసితిఁగాని
తమ్మికంటివలె నిద్దమ్ము లేదు
కలిగొట్టు ననలపొంకంబుఁ జూచితిఁగాని
గోవిందువంటి నెత్తావి లేదు
మల్లెపూవుల హారంగెల్లఁ జూచితిఁగాని
మరునయ్యవంటి నిర్మలము లేదు
పుడమిఁ బొడమినట్టి పూలెల్ల శ్రీకృష్ణ
గుణగణంబులందుఁ గొంచెమవ్వఁ
గొని జనించెనంచు మనమునఁ దలఁతు మో
జింపరమ్మ మీరు చెలువలార! 65

సీ. అతసీ సుమములు నిజాంగవర్ణంబయ్యె
నాసయ్యె సంపెంగ ననవెలింగ
పుండరీకములు విపుల లోచనములయ్యె
విరిమల్లెవిరులు పల్వరుసయయ్యె

మంకెనపూలు నైర్మల్యాధరములయ్యెఁ
గోరి గేదఁగినసల్ గోరులయ్యె
భవ్యరక్తాబ్జముల్ పాదతలములయ్యెఁ
గలువఱేకులు వ్రేళ్లుగా మెలంగె
సమ్మురాసురారి కాలీలఁ బుష్పమ
యంబుగాకయున్న నతనిమేని
సౌరభంబదభ్రసారమై యుండుట
కేమి హేతువమ్మ భామలార! 66

సీ. పవడంబులనుచు సంభావింతమంటిమా
కాఠిన్యభావంబు గానరాదు
చిగురాకులనుచు మచ్చికజూతుమంటిమా
కారాకులేనాడుఁగాక యొప్పఁ
గెందమ్మిఱేకు లిట్లుండెరూ పంటిమా
బురదలో నీటిలోఁ బుట్టలేదు
ముద్దశలాటువుల్ మొలిచెనిట్లంటిమా
శుష్కించి పగిలెడు చొప్పులేదు
వారిజాతాక్షునంగుళీ వార మిట్టు
లేపదార్థంబులోయసి యెంచరాని
సౌరు గలిగి వెలుంగుచు ధీరజనులఁ
దాఱుమాఱుగఁ జేసెనో తరుణులార. 67

—♦ గంధవతి ♦—

వ. కన్యామణులారా! మీరందఱన్ని విధంబుల వర్ణింపుచున్నను సరోజాక్షుని కళ్యాణగుణ పారావారంబునం దొక్కతుం

పుఱైనను తెలుఁగ నేరదైనను నాకుం దోచినట్లు వక్కా
ణించెద నాకర్ణింపుఁడు. 68

సీ. పద్మరాగంబులు పాదతలములయ్యె
నాడెంపు మగఱాలు నఖములయ్యె
లలిత ముక్తాఫలంబులు రదనములయ్యెఁ
బగడంబు లధరంబులుగ జనించెఁ
గళుకులీను కడాని క్రమాంశుకంబయ్యె
మాణిక్యవారము ల్మాటలయ్యెఁ
బులుదిండి ఱామెఱుంగులు శిరోజములయ్యె
వాసిఁగాంచిన వెండి హాసమయ్యెఁ

గాంతిఁగల్గియు మూల్యంబుగలిగి చేత
నములుగాకుంట కలిగి యీనాడు రత్న
పంక్తి మురవైరి దేహమై పరిఢవిల్లె
నని తలంచెద నామది నతివలార! 69

ఆ. మఱ్ఱియుఱ్ఱిగలిగి మచ్చలోపలఁగల్గి
హెచ్చులొచ్చుగలిగి నిచ్చమెలఁగు
చంద్రబింబమెట్లు సరసీరుహాక్షుని
మోముదమ్మిఁబోలు వామలార ! 70

సీ. గురువెందపేర్లే సుగుణముల మెలఁగెనో
హరియురంబున నిరంతరము వ్రేలెఁ
బిల్లనగ్రోవి యే బిరుదులార్జించెనో
దైత్యారి యధరామృతంబునాన

నల్లగలువలెంత నాడెంబులయ్యెనో
నందాత్మజుని వీనులందు నిలిచె
బర్హిపింఛం బే తపంబాచరించెనో
శౌరిశీర్షమున నిచ్చలువసించె
నవి యచేతనంబులయ్యుఁగృష్ణునితోడఁ
జెలిమిగలిగి మెలఁగెఁ జేతనత్వ
మొందిమనము కృష్ణునందలేమైతిమి
భాగ్యమేరిసామ్యము పడఁతులార. 71

పద్మావతి

వ. తలోదరులారా ! మీరు మురారికల్యాణగుణంబు లగ్గించిన కొలంది పులకలు గాఢంబుగా రేఁగుచున్నవి డగ్గుత్తిక పొడముచున్నది, యానందబాష్పంబులు ధారాపాతంబుగాఁ గురియుచున్నవి, విషయంబులన్నియుం జెప్పకొని సుఖింతమన్న గోవిందుండు దుర్లభుండుగానున్నాడు. 72

ఉ. చక్కని దానవంచు నరసంబులకున్నిధివంచు దానముల్
పెక్కునరించితంచు వలపించు గుణంబుల కిక్కవంచునన్
మిక్కిలి నన్నుతింతురుసుమీ పెరవారు మురారినాకౌగిన్
దక్కకయున్న నన్నియు వృథాగద జీవనమేల చెప్పుడీ.
శా. కాంతారత్నమనై నగల్ గలిగి శృంగారాది చేష్టల్ సదా
స్వాంతస్థంబులుగా నటించి విలసత్సౌందర్యముల్ మోహామ

త్యంతంబుంగలదాననై కౌమరుపా, యంబంది శ్రీకృష్ణుశు।
ద్ధాంతస్త్రీలనుఁ జేరకుండిన వృథా, దాంపత్యమిం కేటికిన్ 74

సీ॥ నైరతెమ్మెరసోకు వడగాల్పిమైతోఁచెఁ,
గోకిలారావంబు ఘోరమయ్యెఁ
జంద్రాతపము శిఖి స్పర్శమై తనరారె
రాయంచయానంబ రక్తి నోసఁగె
శుకచయాలాపంబులు కలంకమొనఁగూర్చెఁ,
గేకులనాట్యంబు ఖేదమిచ్చె। శారి
కాధ్వనిమహాశనిఁబోలె వేగటయ్యెఁ,
బరిమళద్రవ్య మాపదలొసంగె।
సరసిజాక్షునిదర్శన స్పర్శనములు,
లేక యిన్నివిధములఁ జీకాకుపడితి।
నమ్మహాత్మ్ముని సాంగత్యమమరునట్టి।
జాడజెప్పరె యోజించిచానలార ! 75

సీ॥ గోపాలసింహుఁడక్కునఁ జేర్చినంగదా,
తరుణిపాలిండ్లు సార్థకముఁ జెందు।
యాదవశేఖరుండాదరించినఁగదా
పొలతియొయ్యార మింపునఁ జెలంగు।
సుడిగాలిగొంగచే సోఁకినప్పుడుగదా,
పడఁతి నెమ్మేను సాఫల్యమొందు।
రామానుజుండు సురతముసల్పినఁగదా,
కలికిచక్కఁదనంబు ఘనతఁ జెందు

బిల్లవాలుదాల్పు ప్రేమించినంగదా।
చాన కాంపురము ప్రశస్తిగాంచుం।
గాని లేకయున్న గాంతాభవము రోంత।
తలచి చూడరమ్మ తరుణులార॥ 76

సరోజినీ

వ॥ స్వాతంత్ర్యంబు లేని స్త్రీ జన్మంబగుటచే శ్రీకృష్ణునియందుం జిర కాలమునుండి బద్ధానురాగనై యుండియు నతని సమీపించి మాట్లాడ నేరనైతిం జీచీ యిప్పుడీ జన్మంబీ జీవులకొసంగిన కమలాసను నేమని దూఱినను దోషంబు లేదని తోంచుచున్నది॥ 77

సీ॥ చలుదులు గుడువంగం జెలువుడా! రమ్మని,
పిలుతురమ్మ రవైరిం బ్రీతితోడం
బసులు దూరంబేగం బనియేమి మాకనిం
యడుగుదు రచ్యుతు నాశ్రయించి
చెడుగుడిలోన గెల్చితివి గండరగండ
వని నుతింతురు శౌరి నాదరించి
చిగురాకుశయ్య రచించినాము పరుండ
రమ్మందు రరిపాణిరక్తి మీఱ

జెలంగి హరిమీందం దమతమ చేతులుంచి
వడచెదరు మార్గమందు నానంద మొప్ప
వల్లవార్భకు లీదృశ వైభవంబు
నందియున్నారు మనకు శక్యంబుగాదు॥ 78

శా. డోలీల్ గట్టి మురారినందునిచియా, టోపంబుతో బాలకుల్
లేలెండీపరుగెత్తుడీ యనుచుఁ బా, ళీలై వనిన్ మోచుచున్
యాలల్పాడుచు సంచరింతురట భాగ్యాధిక్యమటీవధూ
జాలంబెన్నటికైనబొందవశమే, సంతోషముప్పొంగగన్ 79

ఉ. పల్లవశయ్యపైనొరఁగి. బాళిమురారి సమీపవర్తియా
పిల్లనియంకమందుఁదలఁ, బెట్టిపదాబ్జములొక్క బాలుపై
నల్లన మోపివేఱొకని, యందు గరంబులు మోపునంచునే
నెల్లరచేత వింటెనది, యెంతటిభాగ్యము బాలకాళికిన్. 80

కమలినీ

వ॥ బాలకృష్ణుని చెయ్వులమృతప్రాయంబులై యున్నవి మీర
వ్విలాసంబులు వర్ణించినకొలందిసంసార తాపంబుపశమిల్లు
చున్నది. 81

శా. నారీమన్మథుఁడౌ మురారిమురళీ, నాదంబుపున్నాగమం
దారంభం బొనరించి పిల్వగనుమా, హాసంఘమాలించియం
భారావంబులతోడ వచ్చవటఘు, ప్రాంతంబునందట్లుమా
పేరుల్ పేర్కొనిపిల్వరాదెసుకృత, స్ఫీతంబుప్రాప్తించదే 82

సీ॥ విపులపీఠంబునందుపవిష్టు గావించి,
యమునాజలములఁ బాదములు గడిగి
గిన్నియలో బెరుగన్నంబు వడ్డించి
చవిగలమంచిపచ్చళ్ళు వెట్టి,

చేతులు కడిగించి చెల్లనీడను మేలి
చిగురాకుతల్ప మింపుగ నొనర్చి
పండుకొన్నప్పుడు పాదపద్మములొత్తి
సుఖనిద్రఁబోవుచోఁ జుట్టునిలిచి
నిర్జరులువచ్చినను లేపనీకఁగాచి
బాలకృష్ణునిఁగొలుచు గోపాలబాల
కాళిదేసొమ్ముగాని యాలీల మనకు
భాగ్యమబ్బదుగద పద్మపాణులార! 83

ఆ॥ వె॥ చల్దులారగించి శౌరిలేచినచోట
రాలినట్టి మెతుకులోలిమెక్క
కాకిగములపాటి ఘనపుణ్యఫలములే
నట్టిదయ్యె మనకు నబలలార! 84

వారాహి

ఉ॥ నేనొకమాట సెప్పెదన,
నిందితమానసులై వినుండు మే
థానిధియైనకృష్ణుఁడు ము,
దంబున నన్నొక వత్సరంబులో
గా నిజభార్యగాఁదలఁచి,
కౌగిటఁజేర్చిన మేలు లేనిచో
మేనుదృణంబుగాఁ దలచి,
మిత్తికినర్పణఁజేసెదంజుమీ. 85

తే॥ దధి మథింపుచు నేనొకతరుణమందు
నందనందనుమీఁద మానసమునిల్పి

మేనుమఱవంగ పెరుగుండుబాన వగిలె
నంతలో నన్నుఁ గొట్టెమాయమ్మవచ్చి. 86

ఉ॥ బచ్చలికూరవండుమన్ని, పంచిమదంబ తృణార్థమేగి తా
వచ్చినదాఁక శాకమును, వండుటమాని మురారిపై మనం
బచ్చుగనిల్పి లౌకికము, నారయ నైతిని నట్టు లోనివా,
రెచ్చట నేమిసేసితని, యేడుచునట్టులఁ గొట్టిరందఱున్ 87

సీ॥ పిండివంటలోనర్పు పిల్లా యనుచుఁ దల్లి,
సెప్పంగనవియెల్లఁ జెఱచినాను,
తనమఱందికి నన్న మొనరింపుమని సహెూ
దరుఁడన్నఁ గుండపోఁ దట్టినాను
చేయవే పచ్చడి చెల్లెలాయని యక్క
నుడువఁగా లవణంబువిడిచినాను
నేయివడ్డింపరా వేయంచు జనకుండు
పిలువ దానిలో నీరుగలిపినాను

పిల్లవానికి నన్నంబు పెట్టుమనఁగ
గంచమునుమాని నేలపైనుంచినాను
వెన్నునందున్న మోహమే యిన్నిపాట్లు
పరచె నతఁడేల నన్నుఁ జేపట్టడయ్యె. 88

లోకసుందరి

మ॥ తొలుతంగాలువయై పయిన్ సరసియై, తోడ్తోడ
జీవాపగా, తులయై వే జలరాశియై పొలిచెనా, దుర్దాంత
మోహాంబహో, జలజాతాక్షుని మీఁదనాతఁడుదయా,

సంయుక్తుఁడై యేలయి, త్తలపుందీర్పఁగ రాఁడొ నేరఁడొ
వధూత్తంసావనంబెప్పుడున్. 89

సీ॥ వినుతశీలముగల మనువురాదనిగాదు
పాయంపుఁజేఁడు చొప్పడకగాదు
దూరదేశంబేగుదు నని కాదు వివాహ
మగునొ కాదో యని దిగులుగాదు
ధన ధాన్యములు లేని తహ తహచేఁగాదు
చీరలు నగలు రాఁగోరి కాదు
వాతాది ఘనరుజా వ్యాప్తిచేఁ గాదు భూ
త పిశాచకృత బాధ తలఁచి కాదు

నేనిపుడు దుఃఖమొందుట శ్రీనిధాన
మధిక సౌందర్య వంతుఁడత్యంత సాధు
మార్యఖని వన్నెలాడల మాధవుండు
మగడు గాఁడాయె ననిసుమీ! మగువలార! 90

సీ॥ హజ్జలు మధువైరి పజ్జఁజేరుటయుందె
లోచనంబులు హరిఁజూచు టందె
నాసిక కృష్ణాంగ వాసనాధిక మందె
వీనులచ్యుత కథల్ వినుటయందె
కరపద్మములు శౌరిఁగౌఁగి లించుటయందె
చర్మంబు కేశవస్పర్శమందె
రసన వెన్నుని యధరములు గ్రోలుటయందె
వాయి శౌరిని నుతిసేయుటందె

నిలిచి యుండిన కతసలాఁతులు వచించు
పలుకు వినరాదు పరులు గన్పడరునాకు
వెట్టిపట్టె నటంచు నా విందులెల్ల
గోలచేయుదు రేమందు గోలలార. 91

మిహిరప్రభ

వ॥ మానినీ మణులారా! నోటికివచ్చిన మాటలెల్ల నిరాఘాటంబుగా వచించుచుంటి మయ్యశోదా తనయుండు సమీపంబున లేడయ్యె నెవ్వ రాలింతు రితరు లాలకించి యుఁబ్రయోజనంబు లేదైనను సరోజాక్షుని బలసామర్థ్యంబులు దలంచినకొలఁది నాకుఁబరమాశ్చర్యంబుఁ గలుగుచున్నది. 92

సీ॥ కడిఁది చన్నుల విషంబిడి చంపవచ్చురా
కాసి ప్రాణంబులు దీసినాడు
సుడిగాలియై రక్కసుఁడురాఁగ నప్పాపు
వంతలో జమునింటికనిచినాడు
బండియై యొక పొలదిండి వచ్చినవాని
నోడక బలిమి జక్కాడినాడు
బలునాళ్ళనుండి కొండలరేవనుండు నిం
ద్రద్రుపులనుఁ గూలఁదన్నినాడు
బాలుఁడౌపునాటి బాల్యంబునందిట్టి
పనులొనర్చి కీర్తిఁగనినవాని

దొంటివారివలన వింటిమా కంటిమా
చెప్పరమ్మమీరు చెలువలార! 93

మ॥ మనుదిన్నావని మాతకోపపడఁ నమ్మా! నమ్మదో నమ్మవో
తినలేదేనని నోరుజూప నదులున్, దీవుల్ మలల్ కానలున్
వనధుల్ వేల్పులు పారికాంక్షులును సర్వంబా ముఖం బందు నం
ధునియిల్లాలికిఁ గానవచ్చెనటయెంతో చిత్రమా యెంగదా 94

మ॥ పాలిత్తుందమిరార కృష్ణమృదుతల్పంబందరా కృష్ణనీ
వాలంబుల్ సడలింతు కృష్ణ తినరా, వాయన్నముం గృష్ణ యీ
లిలల్ చాలు ముగింపు కృష్ణ యిటురా, లేవేమిరా కృష్ణ యం
చాలాపించు యశోద పుణ్యవతిగా, కన్యాంగనల్ ధన్య లే 95

ఉ॥ ముక్కునఁ బక్కుల్ సడుద, మోవులు చీమిడి గజ్జి పొక్కులుం
గ్రక్కులు పాసనాల్ రుజలు, గల్గినబిడ్డల బెంచునట్టియ
మ్మక్కలు కోటి జన్మములకైనను వత్తురె సాటి రేఁబవల్
సుక్కక కృష్ణునోమిన యశోదకుఁ బుణ్యసతీలలామకున్

సీ॥ లాలింతు నిద్ర నీలమ రారమామిడి
పండ్లు భుజింపరా పాపమిన్న
మీగడ మెక్కరా మేలిమి బంగార
బొసేయ రావచ్చి పూలగుత్తి
పొరుగిండ్ల కెన్నఁడు బోకు మాణిక్యమా
మనయావులివె చూడు మనుగుకుట్టి

రాత్రి బజారు జేరకుము నాపెన్నిధీ
శయనింపఁగారమ్ము ప్రియకుమార
యనుచుఁగృష్ణుని పరిచర్యయందు మునిగి.
లాలన మొనర్చునియ్యశోదాలతాంగి
పాదపద్మంబులకు మ్రొక్కి బ్రహ్మవిదుల
నాశ్రయించెద సకలవాంఛాప్తి కొఱకు.

కుముదినీ

క॥ మనకృష్ణుండీ మందను
జనియించిన నాటనుండి సకలాపత్తుల్
వినశించివాగగోచర
మనదగు సౌఖ్యంబులబ్బె నంగనలారా. 98

సీ॥ బక్కటిల్లిన ధేను వొక్కటి మునుపున్న
దొడ్డిలో వేయేసి తొడుకులుండె
నెన్నేండ్లు గొడ్డుపోయిన పసరములైన
నీనిముప్పూటఁ బాలీయఁదొడఁగె
సేరుపాలిచ్చు నైచికియైన దుగ్ధమ
పరిమితమిచ్చి కాఁపరులఁ బ్రోచె
దూడలు కోడెలెద్దులు శకటంబులా
పడ్డలుకోట్లు కన్పట్టుచుండె
బలునిదాఘవేళనిలువెత్తు ఘాసంబు
బీడులందునుంటఁ బీవరంబు

లయ్యె నెపుడు మేసి యర్జునీ సంఘంబు
నందసుతుఁడు పుట్టినందువలన. 99

చ॥ సెనగల్ రాగులు సజ్జలుం బెసలు వాసింగన్న మాషల్
తిలల్, ధనియాలులవ్వాలు రాజనాలు నలచందల్ కందు
లుఁ గోదుమల్, వినుతింగాంచిన శాలిధాన్యముల హా
విస్తారమై పండె నీ, వనజాక్షుండు జనించినందునఁ గదా
వర్ణింప నీయూరిలోఁ. 100

ఉ. బీరలు కాకరల్ సొరలు బెండలువంగలు పొట్లగుమ్మడుల్
తోరములైన చిక్కుడులు దోసలుబచ్చలితోటకూర గోం
గూరలపారమై పెరిగి కోట్లకొలంది ఫలింపుచుండె నీ
యూరమురారి తాజననమొందినదాదిగ నేమిచెప్పుదుఁ

మ. దధియుఁ మీఁగడ జున్ను చల్ల నవనీతంబుం బయస్సుల్
మహా, దధులై యొప్పుట విక్రయించి మనమందం
గల్గు గోపాలకా, ళిధనంబుఁ గడియించి భూమిధర భి
ల్లిలఁ సుఖంబొంది రీ, యధమస్థానమునందుఁ గృష్ణుఁడు
నికాయ్యంబొందివర్ధిల్లుటఁ. 102

దరహాసినీ

తే. రతిపతికిఁ దండ్రియైన యూర్జితవిలాసి
భారతీపతి నేలిన పండితుండు
కలిమి జవరాలు నేలు నిక్కపు వలంతి
యనుచుఁ గృష్ణుని వినియుంటి నబలలార! 103

వ॥ ఈవృత్తాంతంబు వల్లవకుల గురుండైన గర్గుండొక్కనాడు రహస్యంబుగా మాతండ్రితో జెప్పుచుండ నాకర్ణించితి. శ్రీకృష్ణుం డట్టివాఁడగుటకుఁ దార్కాణంబుఁ గనుం గొనుడు. 104

క॥ వనజాక్షుం డాబృందా
వనముఁ బ్రవేశించుటాది వాలు మగండై
దనుజులఁ జంపిన చరితము
వినువారలకెల్ల భూరి విస్మయ మొసఁగుఁ. 105

సీ॥ పెనుగాలి భూరుహంబునుఁ గూల్చు చందానఁ
బెనఁగిన వత్సాసురుని వధించె
బాకినోటి మెకం బిభమును జంపినరీతి
ధేనుకాసురుని ఛేదించి గెడపె
మగఱాఁతి వాలుగట్లగలించు నట్లఘు
క్షణదాచరాసు నాశంబొనర్చెఁ
గోల్పులి వృషము మార్కొని పరిమార్చి న
ట్లబ్బకాసురుని గీటడఁగఁజేసె

బలు ప్రలంబదనుజు బిలుకు మార్పించె నా
రాముచేత నిట్టి రాక్షసులను
దునిమినట్టి నందతనయుండు మర్త్యుఁడే
శ్రీధరుండుగాక చెలువలార ! 106

విలాసిని

తే॥ వావిరిఁబిపాసనార్ప నావరణజలము
స్నానమొనరింప దుగ్ధాబ్ధి సలిలములను
మానసంబున వాంఛించువాని పగిదిఁ
బెరిమఁ గృష్ణునిఁగోరు నా పిచ్చితలఁపు. 107

సీ॥ తనయింటి నిట్రాడుగ నొనర్పఁ జాలునే
వింధ్యాద్రిఁ దెచ్చి యేవీరుఁడైనఁ
దనదీపముగఁ జేసికొనఁ జాలునే రేయిఁ
జంద్రునిఁ బట్టి యే చతురుఁడైనఁ
గొంగున ముడివేసికొని పోవఁజాలునే
చొఁగంటి నెంతటి యోగియైన
గాదెలోఁబోసి యుక్కఱ నాటికుంచునే
మలయమారుతము నేమాన్యుఁడైన
నట్టి కార్యంబు లెబ్భంగినలవికావొ
యేనుకృష్ణుని మగనిగా నెంచుటల్లె
కానిపనియంచుఁ దెల్పిన మానసంబు
విడువదేమందునమ్మ యో వెలఁదులార. 108

తే॥ కాలము ప్రవాహమునుఁ బోలి కడురయమున
నరుగుచున్నదెల ప్రాయమంతరించు
నింతలోపలఁ గృష్ణుని చెంతఁ జేరు
తెరువు గన్పింపదేమందుఁ దెఱవలార. 109

సీ॥ క్రొత్తచీరలు మొన్నఁ గొనినారుగాని మా
వారు కట్టుకొనంగ వాంఛలేదు
బంగారుసొమ్ములు పంపించెఁగాని మా
యక్కవానిధరింప నాసలేదు
తేనెలెన్నియొ పిండి తెచ్చిరిగాని సో
దరులు వానినిఁ గ్రోలఁదలఁపులేదు
వీధినాటకములు వేసిరిగాని యా
స్థలము సమీపింప వలపులేదు

పనులొనర్చుచున్నఁ దినుచున్న వినుచున్నఁ
దాఁకుచున్న దేని నాకుచున్న
నెలమిఁజూచుచున్న వలమురితాలుపే
తోఁచుచున్నవాఁడు దొరకడెవుడు. 110

నవలామిన్న

సీ॥ కంజాతుఁడుమిసిన గండూషజలమైనఁ
బ్రాప్తించెనేని నా పాపమడఁగుఁ
గృష్ణుండునడువరేఁగినచోటిదుమ్మైనా
పైసోఁకెనేని విపత్తులాఱు
శౌరిద్రుంకిన చోట సలిలార్ద్రమగుమృత్తు
తిలకమౌనేని నా వలపుదీరు
నరిపాణి చర్వితంబైనేలఁ బడిన వి
డెము లభించినను నాడెందమలరు

వెన్నుఁడారగించు వేళ రాలినమంచి
మెతుకులాద వెనేని, గుతుకదీరుఁ
గానియవియు నేడు గగనంబులయ్యె నిం
కేమి సేతు నమ్మ రామలార! 111

సీ॥ భోగించి వాడిన పూమాల లెచ్చోట
బడవేయునో నందబాలకుండు
సరులలో దెగిపడ్డ గురివెందగింజలే
స్థలమందు వైచునో తమ్మికంటి
చెవినుంచు నల్లగలువలు గందినవాని
నెచ్చోట విసరునో లచ్చిమగఁడు
తలయందిడిన నూత్నతులసి యెండినబాఱ
వైచు టెక్కఁడో బిల్లవాలు తాల్పు
తెలిసికొనిరారె మనమట్టి నెలవుఁజేరి
తలఁపులోనఁగూడ నాయాపదార్థములు గ
డించి మేనులనుంచి సుఖించవచ్చు
మంచి సదుపాయమిది సుమీ మగువలార. 112

సీ॥ గొల్లపిల్లలఁగూడి యుల్లాసమున రేఁగి
యా నందసుతుఁడాట లాడుచోట
బసులనన్వేషింపఁ బాల్పడి వని నెమ్మి
పించెతాల్పరి గమసించుచోట
బాలుర నానందఁ బరుపనాలోచించి
మరునయ్య నృత్యంబు జరుపుచోట

సాయంతనమున భోజనపానములకు నై
పెరుమాళ్ళు తనయింటి కరుగుచోట

మట్టిగొని తెచ్చి నుదిటిపైఁ బొట్టువెట్టు
వారి కేటికి మేలిగంబూరభూరి
చందనంబును మృగనాభి సాంకవంబు
వాసన కెగాని యివియు బావనములగునె. 113

సుకుమారి

వ॥ సుందరీ మణులారా! రహస్యంబులకు రహస్యంబై పవిత్రంబులకుఁ బవిత్రంబై పుణ్యంబులకుఁ బుణ్యంబై లక్ష్మికి లక్ష్మియైన శ్రీకృష్ణుండు గొల్లపల్లెయందు జనించుట లత్యాశ్చర్యకరంబుగదా. 114

సీ॥ రాజాధి రాజు లురములఁ దలఁ దాల్చు
నెఱిముత్యానికము లుప్పు నీటియందు
వర సువాసినులు భావంబున సతత మ
పేక్షించు పునుఁగొక పిల్లియందు
ఘనధనాఢ్యుల యిండ్ల గౌరవంబు వహించు
కస్తూరి వన్యమృగంబునందు
లక్ష్మినివాసమై లాలిత్యమై సదా
పొలుచు రాజీవంబు బురదయందు

జనన మొందుభంగి సరసీజనాభుండు
పొడమినాడు కుడియు నెడము లెఱుఁగ

లేని గొల్లవారి లేమిడి పల్లెలో
నేమిభాగ్యమమ్మ వామలార ! 115

సీ. భవ్యరత్నము మన్నిపాంతలో ముడిచిన
ప్రటికైనఁ గాంతిఁ గోల్పడనియట్లు
వరచంపకము వెలివాడలోఁబూఁచిన
పరిమళాధిక మెడఁబాయనట్లు
చామీకరంబు హాసంతిలోనుంచిన
రూపఅకుండఁ బేరుగనినట్లు
ధన మొక హీనజన్ముని యింటఁ జేరిన
గౌరవహాని తాఁగాంచనట్లు
పంకజాతాక్షుఁడా భీరపల్లెలో జ
నించిననుఁ బూజ్యుఁడై ప్రకాశించుఁగాని
గోపకులతో సముడుగాడు కొలఁది వాఁడు
గాడు యోజింపుడీ మీరు కాంతలార ! 116

సీ. పాషాణచయములోపల నుండు రతనంబు
సానదీరినచోఁ బ్రశస్తకాంతి
నివులుగప్పంగలేని వగనుండిన వహ్ని
ప్రబలేంధనములచే బాఢశిఖలు
చిరజీవి గణములో చిన్నప్పుడున్నతా
ప్రమాణుంబు మధుర గీతాతిశయము
గొత్తెలలో గారు గొంగపిల్ల తనంబు
తలినుండి యటుపై నుదార శౌర్య

మద్భుతంబుగఁజూపించునట్లు కృష్ణుఁ
డిపుడు గొల్లలలోనున్న నేమిగాని యంత
గాని యిఁకమీఁద సర్వజగత్ప్రభుండ
గుట నెఱిఁగింపఁగలఁడు పో గోలరార! 117

చ॥ వలపులదీవి జవ్వనుల; పాలిటిచక్కెర యాచకాళికిన్
వెలిపసరంబు లిబ్బులకు, వేలుపుహాస నిధానమున్ రసం
బులకుఁ బయోధియందములప్రోవుగదావసుదేవుసూనుఁడ
వ్వలఁతిఁగుఱంగలించి తెఱవల్ రతిసేసినఁగాదెమేలగున్ 118

సీ॥ గురివెంద పేర్లుగైకొనిన వక్షమునందు
ముత్యాలసరము లిమ్ముల ధరించి
పున్నాగ కుజముఁదుఁ బొల్చెడుపిఱుదులా
సింహాసనమున నిశ్చింత మోపి
నెమ్మిపించెముదాల్చు నిర్మల శిరమందుఁ
జారుమాణిక్య కోటీరముంచి
వల్లవాగారంబు లెల్లఁ ద్రొక్కుపదంబు
లమరు రాజుల కిరీటములనుంచి
పరిజనంబులతో రాజ్యపదవినేలు
వేళ శ్రీకృష్ణుఁడెంతటి విభవమొంది
యుండునోగద నేఁడిట్టులున్నవాఁడు
చూచువారికిఁ దెలియునా సోయగంబు. 119

సీ॥ పగలైనఁ జంద్రికా ప్రభలు గన్పడుచుండు
నగధారి ఫళఫళ నవ్వెనేని

రేలైన నిరులఁ బోదోలి కాంతులొసంగు
గోపాలకుఁడు మేనుసూపెనేని
వేసఁగినైనఁ గావించు శైత్యమునంద
తనయుని మేగాలి తగిలెనేనిఁ
గఱవులోనైన నాకలి పిపాసలడంగు
శ్రీకృష్ణుఁడెలమి భాషించెనేని

వెన్నునోగిఁ గన్నవారికి విన్నవారి
కొదవ సౌఖ్యంబు భూరిసంపదలు వివిధ
పదవులొందిన రాదు దబ్బఱయుగాఁదు
తెలియవచ్చును మీరైన నెలతలార! 120

సీ॥ పలశరీరములిట్లు మాయింతుననుభంగిఁ
గొరలి భాండములు పగిల్చినాడు
దురభిమానములిట్లు తొలఁగింతు ననురీతి
దధిఘృతోధస్యము ల్త్రావినాడు
సంసారబంధముల్ సడలింతునన్న మా
దిరిశిక్యరజ్జువుల్ త్రెంచినాడు
తనకంటె మించిన దైవంబు లేదని
చెప్పవేల్పుల యిండ్లు చెఱచినాఁడు

గొల్లపల్లెయందు నుల్లాసమున రేఁగి
దేవకీసుతుండు దీనిగుట్టు
తెలివిలేని కతనఁ దెలియుట మనవార
లరయరమ్మ సుందరాంగులార!

సీ॥ వలమురి తాల్పు చేతులు దలంచితి నేని
వలుదచాచులు చోలములఁ బగుల్చు
లీలామనుజుఁ గౌఁగిలింపఁ గోరితి నేని
ముంజేతికంకణమ్ము బిగఁబట్టు
కటివేల్పు కడకేగఁ గడఁగితి నేని యా
మంజీరములు చీలమండలొరయుఁ
బసిఁడిపుట్టము వానిఁ బ్రస్తుతించితి నేని
బడికంత భూషలు పట్టకుండు

నెందుకిట్టు లనంగనయ్యుందగాడు
స్మృతికివచ్చిన వేళలో మితములేని
సంతసముగల్గి దేహమత్యంతమ్ముబ్బు ము
కారణంబున ననుకొండు కాంతలార ! 122

సీ॥ కూడు మెక్కెడు వేళఁ, గూరని చల్లంచుఁ
దెలియఁజాలక రెండుగలిపినాను
పాడియావుండఁగఁ గోడెను దామెన
గట్టి యాదుత్తఁ బోగొట్టినాను
స్నానమొనర్చి వస్త్రము ధరింపక దిస
మొలతోడ మాయింట మెలఁగినాను
బంచదారకు మాఱు బందుగులకు నాకు
లుంచి సున్నంబు వడ్డించినాను

పంకజాత నయను పైనుండు మోహమ
ట్లాకులంబుఁగాంచు నట్లొనర్చె

మది నెఱుంగలేక మావారు దండింప
సాగిరమ్మ నన్ను సకియలారం. 123

సీ॥ ఇల్లాలి నెత్తిపై నెక్కించు కొమ్మని
కలిపి భర్గునికంటఁగట్టినాడు
భార్యను నోటిలోపల నుంచి మాట్లాడ
రాయని బమ్మ కేర్పరచినాడు
జాయ నెల్లపుడు వక్షముననుంచు మటంచు
శ్రీహరి నెలమి శాసించినాడు
మునిపత్నిపై మోహమునుఁ గలిపించి వ
జ్రిని వేగనులవానిఁ జేసినాడు

మన్మథుండట్టి భూరిసామర్థ్యఖాని
మననిటుల నేడిపించి జవ్వనులపాలు
సేయఁ డేటికో శ్రీకృష్ణుడాయ లేడో
మందభాగ్యల మైతిమో మగువలార. 124

కమలావతి

సీ॥ అలవసంతుండు నన్నలయించు నేగాని
శ్రీకృష్ణుఁ డాయవీక్షింపఁడయ్యె
మలయమారుతము నాముచ్చ మాపునుగాని
లీలామనుజుఁ గదలింపఁదయ్యెఁ
గొదమ తేటులు నన్ను బెదరించు గాని గో
పాలకృష్ణునదల్పఁ జాలవయ్యె

శుకపికంబులు నాకలువుఁ గూరుచునుగాని
గోవిందుజోలికిఁ బోవవయ్యెఁ

బాటిపోవువారిఁ బాటిఁదోలుదురుగా
కెంత ధీరు లైన నెదిరినిలుచు
వారి నోర్వలేరు వసుధలో నిదిసహ
జంబుగాదె తలపఁ జానలార 125

మ॥ హరిసౌందర్యమె స్వాపతేయముగ నేడార్జించి పుష్పాస్త్రుడి, న్నరలోకంబునఁ జేరి మాదృశలసన్నారీమతల్లీపరం, పర వేటాడఁ దొడంగినాడతఁడు పాపంబంచు మోజింపఁడ, ద్ధరణీభృద్ధరుఁడైనఁ బోవఁడెటులీ తాపంబు చల్లారునో. 126

మ. అనుభూతంబగు నప్పుడే యెఱుఁగ శక్యంబౌగదా యెరికే పసిలోనుండెడు దోషముల్ గుణము నిప్పం కేజపత్రాక్షుఁడే జననంబందున నాతిగాక మగఁడై, జన్మించుటం జేసి భామినికష్టంబు లెఱుంగఁజాలఁడిఁక నామేలెట్టులూహించెదుల్

రాజీవగంధి

మ. మగజాపల్కులఁ గేరి రిక్కలజిగుల్ మాయించి గేదంగిపూఁ, దెగలంజీయని ముత్తియంబుల రుచు ల్దీలొందఁగాఁ జేసి సొం, పుగ వెల్గొందు మురారి దివ్యనఖరంబు ల్గుబ్బపాలిండ్ల మీఁ, దగరీయంబుగ నిల్పుకొన్నఁగద సంతాపంబు నాకాఱెడుల్. 128

సీ॥ పగడాల రాశియంచు గణించితినిగాని
కాఠిన్యభావంబు కానరాదు
లాక్షారసంబని వీక్షించితినిగాని
కరుగదేన్నాళ్లకే కారణమునఁ
కుంకుమంబని లోన శంకించితినిగాని
పొడిపొడియై రాలిపోవదెపుడు
చిగురుటాకుల కూటువుగ నెంచితినిగాని
ముదిరివై వర్ణ్యంబు మోపకుండు
రాధికా కాంతుపదతల రమ్యకాంతి
వస్తునిర్ణయ మొనరింప వల్లగాక
తోఁచుచున్నది వాచామగోచరమయి
దానిపై నెక్కొనియె నాదుమానసంబు. 129

మ. సరసీజేక్షణ లస్వతంత్రలబలల్ సాధింప లేరింగితో
త్తరమంచుంగృపయుంచినాకడకునాకంజాక్షుఁడే తెంచినన్
గరముల్ సాచిపయోధరంబులొరయంగాఁగింటలాలించియు
స్మరుచెయ్వుల్ పచరించిసౌఖ్యమిడ నేమూయింప నేకష్టముల్

సీ॥ విమల పాదాంగుళుల్ వేరుల గుమిగాఁగ
బాహులు శాఖా విభవములుగాఁగ
లలిఁగరాంగుళులు పలతలుగాఁగ గటిస్థ
లంబుపై మేఁప్రకాండంబుగాఁగ
శ్రవణ పుటములు భాస్వర పత్రములుగాఁగ
రమ్యశీర్షము శిఖరంబుగాఁగ

ప్రబలశౌర్యము శక్తి బలముసారముగాగ
గ్రమాంశుకంబు వల్కలముగాగ
భవ్యకల్యాణ గుణములే పండ్లుగాగ
వితత మణిహార పంక్తి ప్రతతులుగాగ
వెలసె శ్రీకృష్ణ తాపింఛ వృక్షమొకటి
దాని నీడను బోదము తరుణులార. 111

చ. వెలవెలబాఱెమున్ను పృథివీస్థలి కొందఱికీవు లిచ్చిక
ల్పలత యిసీయటంచు బహుభంగులదూఱిజనార్దనాఖ్యచే
వెలయుమహీరుహంబుప్రభవించెవలాహకవర్ణమొందియుం
జలిఘటియించి పేరుకొనసాధులకిచ్చునమోఘసౌఖ్యముల్. 

తే. సరసిజాతాక్షుడనెడు వృక్షంబునందు
దయయనెడు పైరగాలి క్రోధమను వడయుఁ
గలిగి యనుకూలురనుబ్రోచు ఖలురద్రుంచు
దద్ధరాజము నాశ్రయింతమిఁకమీఁద. 133

ప్రసూనమంజరి

వ. లతకూనలారా! నందనందనుని శిరోజంబుల మనోజ్ఞంబు
దలంచినదాది మదీయచిత్తం బానందవారాశి నోలాడు 134
చున్నది వినుండు.

ఆ. నిడుపుగలిగి చాల నిద్దంబుగలిగి దీ
ర్ఘంబు గలిగి నలుపుగలిగి చూచు

వారినేత్రములకపార నిధానమై
తోఁచు హరిశిరోజ తోయదములు. 135

సీ॥ పులుదిండితాలుగాఁ దలచెద మంటిమా
కర్కశభావంబు కానరాదు
జలదంబులనుచు విచారింతమంటిమా
పిడుగులుఉఱుములు కన్పింపబడవు
చంచరీకములంచుఁ జర్చింత మంటిమా
ఝుంకారములును పక్షములు లేవు
నాచుతీవియలుగా యోచింతమంటిమా
నీరంబునందు జనించలేదు

చక్రధరు శిరోజ సంఘంబులే వస్తు
వోయటంచు నెన్నవాయిరాక
మ్రొక్కుచున్నవారు మోహితులై కోవి
దప్రథానులెల్లఁ దన్వులార. 136

సీ॥ నిగనిగయను జగాజిగినొందియున్నచో
వారివాహంబు లీవాలములకు
సాగితుంపెసలాడు చాతుర్యమొందుచో
జీకువాలందమీ చికురములకు
గమనీయ సారదీర్ఘత్వంబు గన్నచో
రోలంబచయ మీ శిరోజములకు
మార్దవభావ మేమఱక ప్రాపించుచో
నాశక్రనీల మీ కేశములకు

సాటియౌనటంచు జాటింపగావచ్చు
గాని కొంతతలట్లుగాంచుకతన
దేనిబోల్తుమనుచు ధీరులాలోచించు
శౌరికురుల నెన్న సాధ్యమగునె. 137

సీ॥ పల్లవెండ్రుకలచే బ్రభవించుమగవాని
లాలించునొక్క రోలంబవేణి
కడిదిజుంజురుకురుల్ కలిగిన మనుజుని
గూర్మిగైకొను నొక్క కోమలాంగి
యింద్రలుప్తకముచే హీనుండయినవాని
జేరిమేకొను నొక్క చిన్నెలాడి
సితకుంతలములచేఁ జీకుజెందినవాని
సేవించు నొక్కొక్క పావనాంగి

యట్టిరోతవారి నంభోజపాణులా
సించికొలుచుచుండ మంచినలుపు
వన్నెకురులవాని వెన్నుని వాంఛింప
రాదె మనము వరపురంధ్రులార. 138

సీ॥ నట్టువారనుచు గంధర్వవర్యులరోసి
గానంబు మురవైరిలోనఁ జేరె
దుర్మార్గులనుచు దైత్యులనెడఁబాసి మా
యావిలాసము కృష్ణునందె నిలిచె
బలహీనులనుచు వేల్పులవిడనాడి సౌం
దర్యంబు నందనందనుని గొలిచె

భోగులుగారంచు యోగులవిడిచి ప్ర
భావంబు గోపాలబాలుఁబొందె

ధనము లేనివారలని సూరివరుల వీ
డ్కొని వరించె నేర్పు గుడుసువాలు
జోదునట్లు గానిచో నింత వైభవ
మందుటెట్లు కృష్ణు డతివలార ! 139

సీ. అధరపానామోద విధమెఱింగిన లేమ
శ్రీకృష్ణు నెటుల వాంఛింపకుండు
పరిరంభ సుఖపరిపాకమారయుచాన
గోపాలపతి నెట్లు గోరకుండు
జుంబనానందరుచులు దెలిసినగోల
దనుజారి నెందాక దలపకుండు
సురతకేళీ సౌఖ్యమరసిచూచిన నాతి
కఱివేల్పు నెన్నాళ్లు మఱచియుండు
బ్రాయమొదవి నపుడు ప్రాపింప దగిన వై
భవమెఱింగినట్టి పద్మగంధి
సోయగంపుగని యశోదాకుమారు మో
హింప కెట్టులుండు నింతులార. 140

సీ. బంగారువంటి గోపాలకృష్ణునిమాని
వలుదకుచంబు లే ఖలునకిత్తు
రత్నంబువంటి నీరజనాభు విడిచి నా
చెక్కులముద్దు లే చెనటికిత్తు

వెన్నధీవంటి యాపించెతాల్పరినేది
మరుపన్నికై యేస్థవిరునిగొలుతు
గల్పవృక్షమువంటి కటివేల్పు వదలి కా
పురమునకై యేబధిరు వరింతు

నక్కటాయని దుఃఖింతు నహరహంబు
శ్రీనివాసుండు ప్రాణేశుడైన సౌఖ్య
మటులగాకున్న మే బాయుటైనమేలు
గాని యన్యుని గైకొందునే నుతించి. 141

సీ॥ అరిపాణి పేరురంబగ్రంబయినగాక
బహుభూషలొందు సాఫల్యమేమి
గోవిందు తొడలపై గూరుచుండినగాక
లావణ్యమొందిన లాభమేమి
దైత్యారిదంతక్షతంబులందినగాక
నవయౌవనముగాంచు నాడెమేమి
సారసాక్షుని నఖక్షత లబ్ధిగనుదాక
సౌందర్యవతినైన సౌఖ్యమేమి

నెయ్యమున హరితో నేకశయ్యయందు
బడినంగాక విదుషినై భాగ్యమేమి
మించుబోడికటంచు దలంచినల్ల
వన్నెగలమేటి మోహించియున్నదాన. 142

మఱద్వాతి

క॥ గోపాల శిరోమణిపై
నా పొందిన మోహమింతసంగ వశంబే
పాపంబులడచునాతని
బ్రాపించు నుపాయమున్న బలుకుడు చెలువల్. 143

ఉ॥ అన్నులమిన్నలార! విన రమ్మ వచింతుమురారిపైకి నా
కన్నులువీనులుందొడలు కౌనును జేతులు వ్రేళ్ళునాసయుం
జన్నులురంబువాయిమృదుచర్మమునాలుక మోము మోవులుం
జన్నవిమానసాంబుజముసాయముగాగమరల్పరానివై 144

ఉ. వెన్నునిగోళ్లునాళ్లు గురివెందలపేరులు హాజ్జలూరువుల్
కన్నులురంబు పించెము ముఖంబుదరంబధరంబులుంగురుల్
సన్నని కౌను వీనులు రసజ్ఞ ముకుస్మితమెల్ల గావి నా
కన్నులజొచ్చి నెల్వడ వొకానొక వస్తువు జూడనీవొగిన్.

ఉ. అమ్మను బంధువర్గముల సక్కల నన్నల నీసడించి పె
ద్దమ్మల చిన్నయమ్మల ననాదరణం బొనరించి చీరలన్
సొమ్ములబాఱదన్ని రవిమూడిక్కకి దోచుటక్రుంకగా నిరుల్
క్రమ్మటెఱుంగ దీ హృదయకంజము వెన్నుని జేరి మగ్నమై.

చ. గరిమ వహింపవచ్చు బరకాయప్రవేశము సేయవచ్చు సా
గరము దరింపవచ్చు గిరికాననము లక్కనవచ్చు నేగి వే
గిరమున యోగియై ప్రజలొగిన్ మహిమంబులుసూపవచ్చు శ్రీ
కరుడగు నందపుత్రు ననుకంపగడించుట దుష్కరంబగున్.

చ. మదనుడు డీల్పడేక మలయమారుతమా దిగులొందె
మాధవుం, డిది మనవల్లగాదని యెంచె వధూజనపాళి
చూపులుం, బెదరితొలంగె శౌరి వలపించి మదంతిక
మందుజేర్చియా, పదదొలగించువారు కనుపట్టరి కేమను
దాన నకటా. 148

సీ. ప్రాయంబుగలవాని బ్రాపింతమన్నచో
లేదు సౌందర్యఁబు లేశమైన
సౌందర్యఖాని విశ్వసనీయుఁడన్నచో
నవరసోదార జ్ఞానంబు సున్న
రసికుఁడౌవానిఁ జేరందగునన్నచో
సిరులకు దూరమ న్నరుని బ్రతుకు
సిరిగల్గువాని నాసించెదమన్నచో
లోభియై యతడు కల్లోల మొందు
దానగుణమున్న రాదు విద్యాబలంబు
విద్యయున్నఁ జిరాయువై వెలయుటరుదు
కాని శ్రీకృష్ణునందివి కలిగిచెప్ప
నలవిగాని మహాగుణంబులు వెలుంగు. 149

మ. మలినాంగంబుఁ జొల్లుచెమ్మట మనోమాంద్యంబు శిం
ఘాణ । మె, మ్ములుకఁడూత బలీయరోగములు దుర్మో
హంబు దాహంబు నా । కలియున్ నిద్దురలేమి దుఃఖము
తిరస్కారాప్తి యుంగల్గి చం । చలుఁడౌదుర్నరుఁ బొందనేల
మన కృష్ణస్వామిపొరుండగన్. 150

సీ॥ అల భగీరథు కాలమందు నాకాశగం
గానీరములు భూమిపైనఁ బాఱె
వాల్మీకి ప్రతిభచే బ్రహ్మలోకస్థ స
రస్వతి మనుజవారముల కందె
బలిదానమహిమచే బరమ పూరుషుపాద
జలజమశేష దేహులకు దొరకె
రఘుపతి దండకారణ్య మేగినవేళ
గలమునీంద్రుకెల్ల సులభుడయ్యె

నల్లె నందుడొనర్చు పుణ్యంబువలన
మనకు సాక్షాత్కరించె నామాధవుండు
కృష్ణుడై వీనిబొంది సత్కీర్తి లోక
మందుఁబరమున నపవర్గమందవలదె? 151

వ. అని యిట్లు గోపకన్యాసహస్రంబులు శ్రీకృష్ణమగ్న మానసాబ్జలై పరస్పర సల్లాపంబులచే గొన్ని దినంబులు కాలక్షేపం బొనరించి ఫలంబుగానక యెట్టకేలకొక్క యుపాయంబువన్ని యొకానొక పుణ్యదివసంబున వేకువను లేచి యమునానది కరిగి కృతస్నానలై సైకతంబుచే దుర్గావిగ్రహంబు నిర్మించి యద్దేవి నారాధించి స్తుతించి ప్రణామంబు లొనరించి వేలువేలుగా నిట్లనిరి. 152

వీ ణా వా ది నీ

చ. కొలిచిన వారికోర్కులొనగూర్చెదవంచు ననేకపండితుల్
పలుకుటలాలకించి నినుభక్తినుతించెదమమ్మ యాడు పి

ల్లలనుచు నస్వతంత్ర లబలల్ గదయంచు బహూకరించిమా
తలపులనుండు వాంఛితవిధానము జేకుఱజేయు మంబికా.

విద్వద్రంజనీ

సీ. మంగళస్నాన మియ్యంగ మొందిననాడు
పుట్టికుండుమమ్ము నీ పూజకిత్తు
నాతులు నను బెండ్లికూతు జేసిననాడు
పందుము గుగ్గిలం బంద జేతు
నెలతుకలై రేని సీల్లువోసిననాడు
తమిబుట్టి నూనెదీపములకిత్తు
దల్ప్రాలు నే నొందగలనాడు బోనంపు
రాశి నీయెదుట నర్పణ మొనర్తు
నేను గోరినట్టు లానందసూనుండు
దయితుడైననాడు తప్పకుండ
సేతునిన్ని పనులు జాతరనాడహో
వనదకుంతలాళి భద్రకాళి. 154

విలాసగేహినీ

మ॥ అరిసెల్ బూరెలు గారెలప్పములు బొబ్బట్లుండ్రముల్
దోసెలుం, బరమాన్నంబులు లడ్డుకంబులును సూపంబుల్
సమృద్ధాన్నమం, బరముల్ భూషలు నేయి పానకము నీ
పజ్జ సమర్పించి సు, స్థిరభక్తి భజియింతు గేశవుడు
నన్జేపట్టిలాలించినన్. 155

మనోరంజనీ

ఉ॥ బూనలకళ్లు మాంసములుపండ్లును బెల్లముపంచదారయుక్
సూనములున్ విశేషముగ జొప్పడజేసి భజింతునిన్ను నా
సూనశరాసకోటినిభ సుందరుఁడౌ మురవైరి జేరి నా
పైనఁగరంబు మోపిన విభావరియందుఁబురారిసుందరీ. 156

మ॥ పటహంబుల్ పరివాదినీచయములున్ బాకాలు భేరీయశ
చ్ఛటలున్ మద్దెలకాహళంబులుజగాసన్నాయిలున్ డోళ్లుగు
మ్మెటలున్ వీణలువేణువుల్ మొదలుగామేళాలు నేనీకుఁ బం
గటసేయింతుమురారినాకుమగఁడౌకాలంబునందంబికా 157

వ॥ ఇవ్విధంబునం బరమభక్తియుక్తలై స్తుతింపుచుండం గా
త్యాయనీ భగవతి తదీయానురాగంబునకు మెచ్చి యశ
రీరవాణితో నిట్లనియె. 158

ఆ. కోమలాంగులార! కొలదిదినము లోర్చు
కొనుడు మార్గశీర్షమున మురారి
మీకుగానిపించి మృదువాక్యములువల్కి
కోర్కెలొసగు నింకఁ గొఱతలేదు. 159

వ. అనిన నబ్బాలికామణు లమందానంద ప్రవాహంబున
నోలలాడుచు నిండ్లకుంజని మాసోపవాసంబుఁ జలిపి
హవిస్సు భుజించి యొక్కనాటి వేకువలేచి యమునానది
కిం జని రేవుకడ వస్త్రంబులూడ్చియుంచి స్నానంబొనర్చు
చుండ వారి వ్రతంబునకు ఫలంబుగా శ్రీకృష్ణుండ త్తీరం

బునకుం జని తోడిబాలకుల దూరంబున నునిచి యేకాం
తంబున తదీయాంబరంబు లపహరించె. 160

పరిక్షిత్తు

వ. యోగిజనాగ్రగణ్యా! సందేహంబు వొడముచున్నదెందు
కంటివేని యోగీశ్వరేశ్వరుండై యస్ఖలితబ్రహ్మచారియగు
శ్రీకృష్ణుం డకన్యామణుల వస్త్రంబు లపహరించుట
దోషంబుగాదా! 161

శుకయోగి

వ. రాజేంద్రా! సందేహింప నవసరములేదు శ్రీకృష్ణుండు
జగచ్ఛరీరుం డగుటచే నతనికి స్వకీయ పరకీయులు
లేరు నింగియుం దెట్టి జిడ్డుగలపదార్థంబైన నంటని తెఱం
గున నమ్మహాత్ము నే దోషంబు లాక్రమింపవు కృష్ణుండు
సర్వేశ్వరుండై సర్వనియంతయైనను భక్తపరాధీనుం
డగుట నిక్కవంబు. 162

పరిక్షిత్తు

వ॥ భక్తపరాధీనుండైనచోఁ గానిమ్ము గోపికా మానభంగం
బొనర్ప నేల. 163

శుకయోగి

వ॥ అది మానభంగంబుకాదు మూఢులకట్లు తోఁచినను పం
డితులకు నుత్తమ ధర్మంబుగా దోచు. 164

సీ॥ అన్నంబుపై మూగినట్టి యీగలఁదోలి
తినుగాదె క్షుద్బాధ నెనయువాడు

తనయూననము జూచుకొనగోడువా డద్ద
మును బాగుసేసి కైకొనునుగాడె
బలుపిపాసార్తుండు కొలనిలో దెట్టువ
గొట్టి గాదె జలంబు గ్రోలునెలమి
పైనుండు నూరుగెల్ల బోనూదిగాదె మ
ద్యంబాన నెంచు దదాతురుండు

నల్లె శ్రీనాయకుడు భక్తులైనవారి
చిత్తశుద్ధి పరీక్షించి స్వీకరించు
గాన నవ్వల్లవీజన మానసాభి
మానముఁదొలంచుటధిక ధర్మంబుకాదె . 165

పరిక్షిత్తు

వ॥ ఆర్యజనాగ్రేసరుండగు శ్రీకృష్ణుండు కన్యకా మర్మస్థానం
బులు వీక్షింపవచ్చునా. 166

శుకయోగి

వ॥ శ్రీకృష్ణదేవుండు సర్వాంతర్యామి యమ్మహా పురుషున
కంతరంగ బహిరంగంబులు లేవు సమస్తంబును సర్వకాలం
బును వీక్షింపుచుండు నతండెప్పుడు కటాక్షింపడో యా
క్షణమే చేతనంబు లచేతనంబులగు గారడిచేయునప్పుడు
చూచువారి కాశ్చర్యంబ కానిచేయు వానికి మఱుంగు
లేదుగదా. 167

మ॥ మరుబాణంబులకోడి గాదురు జగన్మర్యాదదూలించుపో
కిరిభావంబునగాదు కామసుఖరక్తింగాదు స్త్రీయేంద్రియో

త్కరచాంచల్యముచేతఁగాదు పటముల్గొంజాతుఁడవ్వల్లవీ
సరసీజాతులఁబొంగఁజేయుటకునా చందానఁ జేసెంజుమీ. 168

మ. హరిహస్తంబులఁ జేరనప్పటను లెట్ల్వారంబులయ్యెం దదం
బరముల్త్రాల్చిన వల్లవీజన లసద్భాగ్యప్రభావం బహో!
తరమా సన్నుతి జేయనంచు విబుధుల్త్రిక్కొంతు రేగాని మో
పరు నేరంబుమురారిమీఁద నదిపాపస్వాంతులందొప్పెడున్.

మ. చలిపందిళ్లొనరించువారలు తపస్స్వాధ్యాయముల్సేయువా
రలు సత్రంబులుగట్టువారలును, తీర్థస్నానముల్ దానముల్
సలుపంగోరెడువారు యాగనిరతుల్, సన్యాసులున్ సర్వయో
గులు గోపీజనపాళిఁబోలరు సుమీ గోవిందసద్భక్తికిన్.

పరిక్షిత్తు

వ॥ మునీంద్రా! మదీయసందేహములు పూర్ణముగా నశించుట
యేకాక పరమభాగవతులైన వల్లవీజన ప్రభావంబు సహి
తమెఱింగితిఁ దదుపరి కథాభాగంబునకుఁ జనుఁడు 171

శుకయోగి

వ॥ రాజేంద్రా! శ్రీకృష్ణుండట్లు యమునానదీ తీరంబునకువచ్చి
యతిత్వరితగమనంబున గన్యాజనాంబరంబులన్నియుం బ్రో
వుసేసి పుచ్చుకొని పున్నాగభూరుహంబారోహించియుండె
నింతలో నారీజనంబు మజ్జనంబు ముగించి వస్త్రంబుల న్వే
షింప నయ్యంబరంబులు గానరావయ్యె నప్పుడిదేమి
చిత్రమా యని నానా దిశలంబరికింపుచుండ భూరుహస్థుం
డైన శ్రీకృష్ణుండు వారలంగని మీ మీయంబరంబులిమ్మ
హీరుహంబుననుంచితి వెలుపలకువచ్చి పుచ్చుకొమ్మనుట

యు, నక్కొమ్మలు వ్రీడాసమేతలై జలంబులలో గుత్తుక
బంటిగా దిగి కిలకిల నవ్వుచుండ జనార్దనుండిట్లనియె. 172

క. తరుణీమణులారా! యీ
సరస్వతీజలములందు స్నానము చలిలోఁ
గరమనురాగముతోనిటు
నెరపెద రే కారణంబొ నిజముపలుకుడీ! 173

గోపకన్యలు.

క. పులకలతో డగ్గుత్తిక
గల మాటలతోడ మూర్ధకంపంబులతో
విలసన్మృదాశ్రులోచన
ములతో నగ్గోపికాసమూహంబనియెన్. 174

ఆ. ఆడఁబోవుతీర్థ మయానమందెదురైన
యట్లు వెదుకఁ బోయినటి తీవ
కాలఁదగిలినట్లు కంజాతనయనుండ
ధీమఁడయ్యెమనకు దిగులులేదు॥ 175

వ. కాని సత్యముగా యశోదానందనుఁడేనా తదీయ వేష
ధారియగు మఱియొకఁడా యని వితర్కించి శ్రీకృష్ణుండని
నిశ్చయపరచుకొని వారిలో వారిట్లనిరి. 176

సీ. విరహామా నీకింక వెఱపించు పనిలేదు
పందుకొనుము కాళ్ళు పాఱఁజాచి
మోహామా నీకు మనుష్యులనేచు రంధ్రంబు
దొరకదట్లుండవే దొరగిల్లి

కామమా నీకు వికారపెట్టెడు మార్గ
మించుకలేదు చాలించుకొమ్ము
ప్రబలవిచారమా పాటింపమిఁక నిన్నుఁ
దొలఁగి పొమ్ము మాతలఁపులేది
సొగసుకాఁడు మించిజగములేలెడుఱేఁడు
వన్నెలాఁడు నలువవన్నెవాఁడు
తమ్మికనులవాఁడు దగ్గఱకొసఁగు లో
సంగబూనినాఁడు లోఁగమింక. 178

సీ. ఆమని జోద! నీయాటోపమికమీఁదఁ
బ్రకటించి చూపు మేపాటిగలదొ
వైరపయ్యెర! నీదు పాటవంబేమాత్ర
మున్నదో కనిపింపు మూర్జితముగఁ
దొవ చెలికాడ! నీదోర్బలంబెల్లఁ బ్ర
దర్శింపవచ్చు మార్దవము విడిచి
తుంటవిల్కాఁడ! నీ తూపులబారు ప్ర
యోగింపు మాలస్యమొందకుండ
నండలేనివేళ నాయాస పెట్టితి
రింతెగాని మిముగణించు నవస
రంబు లేకయుండ రాధికానాథుండు
డాసినాఁడు మేలు సేసినాఁడు. 179

సీ. దొరతనంబుడుగరే తూఁడు మేపుడులార
గరువమేదుడు కెంపుకంటులార

కేరల నేమిటికి చక్కెరతిండులార యం
పిల్లవలదు గుండుపిట్టలార
రవళి సేయకుడు నట్టువపిట్టలార కా
వరముడుగుడు గోరువంకలార
దుండగం బిఁక నేల పండువెన్నెలలార
పాటలుమానుఁడీ తేటులార
మామనోహరుండు రామా కుసుమధన్వ
పుండరీకలోచనుండు డాసి
కావఁబూనినాఁడు మీవల్లఁగాదు మ
మ్మలమటింపఁజేయ నలఁతులార. 180

మ॥ మనసా తొల్లిఁటి పాపముల్ గెడసె సామాన్యవ్రతంబు ల్తపం । బునుపండెన్ మొదలౌ విఘ్నములు సత్పుణ్యాంబువర్ధిల్లె న । ట్లనుకూలింపకయున్న లోకగురుఁ డయ్యాంభోరుహాక్షుండు కై । కొనునే మా మలినాంగంబులను యోగుల్ విస్మయంబందఁగన్. 181

వ॥ అని యిట్లు బహువిధంబుల విచారించి తమ భాగ్యంబున కంతంబుఁగానక పరస్పరాలింగనాదులొనర్చి పరుషంబు లాడినఁ గృష్ణుండు తమ్మువిడనాడునను భయంబున మంద హాసోపేతలై మృదుమధురాలాపంబుల నిట్లనిరి. 182

సీ. చెలువలు స్నానంబు సేయుచో మగవాఁడు
డాయుట ధర్మమే తోయజాక్ష
డాసినప్పటికి మిటారులకోక ల
పహరింపవచ్చునే ప్రాణనాథ

పరిహాసమునకు ట్లపహరించినను బూని
పైఁజేర్చుటొప్పునే వన్నెకాఁడ
చెట్టుకొమ్మలమీఁదఁ జేర్చి మమ్మిటు బిల్వఁ
దగునయ్య దయమాలి సొగసుకాఁడ
యాడుపుట్టువె సిగ్గనునట్టిమాట
లారసిమెఱుంగవె రసికాగ్రగణ్య!
నీకుఁ జెప్పెడువారమే నీవు లఖిల
లోకరక్షక! మాకు మాకోకలిమ్ము. 183

మ. తరుణీక్రీడాసివిలాసవంతుఁడునగల్ ద్రవ్యంబునర్పించుటో
పరిహాసంబులువల్కుటో కదిసి కేల్వాలిండ్లపై నుంచుటో
సరులందిచ్చుటొ చెక్కులంబుడికి హాసంబొందఁగా జేయుటో
సరియాగానిపటంబులంగొనిపగల్ సాధించుటల్ న్యాయమే 184

మ. చలికాలంబిది గాక వేకువగదా స్నానార్థమై నీటిలో
పలమేముంటిమి వేఱువస్త్రములు సంపాదింప వీల్గాదు యో
గులమా కాముసహింపఁ జెట్టుదిగియా కోపంబుచాలించి కో
కలు మాకిచ్చితివేనిఁ బుణ్యమొదవుంగంజాతపత్రేక్షణా 185

క. నందుండు మాకు రాజై
నందున నీ వతని సుతుఁడవై యుండుట మా
కందఱికిఁ బూజ్యుఁడవుగద
నిందింపఁగజాలమెద్ది నీవు సలిపినన్. 186

శ్రీకృష్ణుఁడు

క. చెప్పితిరెన్నియొ వాక్యము
లొప్పఁగ నీవ్రతము మాసమొనరించితి రీ

చొప్పునఁ గాళింగూరిచి
చెప్పుడు కారణము దేమొ చేడియలారా. 187

గోపకన్యలు

ఉ॥ చక్కఁదనాలరాసివి రసంబులకున్ జలరాశివంచు ని
న్నక్కననుంచి మేము ముదమారఁగఁ గౌఁగిటఁ జేర్చి ని
ద్దపుం జెక్కులు ముద్దువెట్టి మరుచెయ్వులచేఁ గరఁగిం
చువాంఛని, ట్లొక్కమనస్సుతో వ్రతమునూని యొన
ర్చితి మంబుజేక్షణా. 188

క. దాసీలము స్వగ్రామని
వాసినులము నీకులంబువారము విరహా
యాసముఁ గాంచినవారము
దాసీనతమాని మాకు దయితుఁడవగుమా. 189

శ్రీకృష్ణుఁడు

ఉ. దాసులమన్న మాటలు యథార్థము లేని బిఱాన నీటిలో
వాసము మాని వేవెలికివచ్చి కరంబులు రెండు మోడ్చియు
ల్లాసముతోడ మ్రొక్కుఁడబలామణులార! పటంబులిత్తు లే
దా సమకూడదీపని వృథావ్యధలేటికి మాటిమాటికిన్ 190

గోపకన్యలు

శా. చాలుంజాలు భళీ భళీ వెఱవకీచందాన భాషించి వా
చాలత్వంబును జూపనేమిటికి వస్త్రంబుల్ విసర్జించి జే
జే లర్పింతురె మానినుల్ మగలకిస్సీ ప్రాణమున్ ద్రవ్యమున్
మేలే మానముకంటె నీ వెఱుగవే మేధానిధీ శ్రీనిధీ 191

శ్రీకృష్ణుఁడు

ఉ. నీతు లెఱుంగఁ జెప్పెదరు నీరజలోచన లింతమంది మీ
చాతురి మెచ్చితిన్ వ్రతము సల్పెడు వేళ దిగంబరత్వ మే
రీతి వహించి స్నాన మొనరించితి రీపని మేలె కాళి మీ
చేతల నాదరించునె యిసీ యిది శాస్త్రవిరుద్ధమౌఁగదా.

గోపకన్యలు

వ. ప్రాణనాథా! సర్వజ్ఞుండవగు నీకు సమాధానంబుఁ జెప్పఁ బూనితిమి గాని మాదోషంబు నెఱుంగమైతిమి మదీయాపరాధంబులు క్షమింపుమని తీరంబు జేరి కరంబులు దోయిలించి యబ్బాలికామణు లిట్లనిరి. 193

సీ. చిన్నిపూవులు నీకుఁ జిగురువిల్తుని తండ్రి
జేజేలులిబ్బుల చెలువమగఁడ
గిడిగిండ్లు నీకు పసిఁడిసాలు తాల్పరి
టెంకణాలో జగాసంతుదారి
జోహారులివె నీకు సుడివాలుగల జోద
చాఁగిలింతలు సోఁకు చాల్పుమిత్తి
నేరెడల్లలుః నిరాబారిబారులమేల
చెంగనాల్ నెమ్మిమించెగలమేటి
జోతలివె నీకు నాడెంపు సొగసుకాఁడ
దండములు నీకు వేయువేల్తుమ్మిరంటి
యనుచు మ్రొక్కంగ వారి కుయ్యాలకించి
చీరలీయంగ నా గొల్లచెలువలెల్ల. 194

వ. మహానందంబున నాచేలంబులు ధరించి శీతబాధ నివారించుకొని నందపుత్రుని సౌందర్యాదిగుణంబులకొండి తెప్పవాల్పక తెలుఁగంటుల తేవంగనుచుండిరి. 195

శ్రీకృష్ణుఁడు

వ. పల్లవాధరలారా! చలివలనఁ గలిగిన బాధతొలంగెనా సుఖంబుఁ గైకొంటిరా. 196

గోపకన్యలు

వ. చలివోయెంగాని వలపుదీరలేదు వలరాచవాఁడు కారింపుచున్నాఁడు. 197

శ్రీకృష్ణుఁడు

వ. మీ యభిప్రాయమేమో నిర్భయంబుగా నానతిండు. 198

గోపకన్యలు

సీ. సభలోఁ బ్రసంగించు సామిఁ బండితునైన
బాధించు భూరికంపమును దూఱి
తనలోఁగల రహస్యమును జెప్పఁతటిఁ దల్లి
చెంతనైనఁ గలంచు సిగ్గుమాఱి
తనకు సాధ్యముగాని పనిఁజేయుచో జనా
ధిపునైన నేఁచు సందేహముడిగ
తన్నైన నిచ్చెడు దాతను గోరుచోఁ
గలవరమిచ్చు చంచలమువిడిచి,
యడుగుచున్నవార మాదరణంబుఁజేసి
చేసితేని మేలుసేయవేని

బ్రతుకువలనమాకు ఫలమించుకయు లేదు
మగఁడవగుము భార్యలగుదు మేము. 199

శ్రీకృష్ణుఁడు

క. మగవాఁడ నేను మీరో
మగువలు ననుఁగోరుటొప్పు మగనిగ నైనన్
మగువయొకతె మగవానికిఁ
దగుఁగా కిందఱికి నెట్లు దయితుఁడ నగుదున్. 200

గోపకన్యలు

సీ. సస్యసంఘంబులఁ జాతకాండజముల
నియతిచే రక్షించు నీరదాల్పు
తామరసముల రథాంగవారంబుల
సొరిది రంజిలఁ జేయు ఖరగభస్తి
కువలయావళులఁ జకోరచ్ఛటలను సం
తోషింపఁ జేయు పీయూషకరుఁడు
సరసిజాక్షులఁ బూరుషగ్రామణుల వినో
దముఁ జెందఁ జేయు లతాంతధన్వి
యొక్కఁడొక్కఁడయ్యుఁ బెక్కుమందినిఁ బ్రోచు
చుండలేదె భారమొందినారె
మాకు నీవునట్లె మగఁడవై పాలింప
వచ్చు దీన రాదు లోచ్చు నీకు. 201

మ. ఘనశయ్యల్ ధ్వనులున్ విభక్తులును బాకంబుల్ సమా
సఁబుల ర్థనిగూఢం బురుభావరీతులు ప్రసాదంబున్

లసద్వృత్తులా ! దిననేకంబు లెఱుంగలేనికవిరక్తిం గావ్య
నిర్మాణమూ ! నినచందాన వచించు మా నుడులు మన్నిం
పందగుం గేశవా. 202

తే. రవికి దీపము శశికి దారంబగస్త్య
మునికిఁ జేరెడు జలము లిచ్చినవిధమున
సారిది నర్పించితిమి వాక్యసుమములోలి
వీనిఁ గైకొనిప్రోవు మీచానగముల. 203

శ్రీకృష్ణుఁడు

క. వేగిరపడవలదు సుమీ
రాగలశరదాగమమున రాతిరియందుఁ
భోగించెద మీతో నను
రాగంబున నేఁగుఁడని మురహరుఁ డరిగినఁ. 204

వ. కోమలాంగులందఱేకీభవించి సరోజాక్షుం డదృశ్యుం డైనందులకు దుఃఖంబునుఁ గతిపయకాలంబునకైన నమ్మహాపురుషునితో సంభోగంబు లభించుంగదా యను సంతోషంబును గోవిందుని వాక్యస్వారస్యంబుచేఁ గల్గిన యాశ్చర్యంబును మనంబున ముప్పిరిఁగొనఁ బరస్పరంబుగా నిట్లనిరి. 205

సీ. సౌలభ్యమితని నీస్థలి కీడ్చుకొనివచ్చి
మనకుఁ జూపించె సేమంబు దనర
వాత్సల్యమితనిపైఁ గ్రాలి వస్త్రంబు ల
పహరింపఁ జేసి యుగ్రంబుఁ గూర్చ

సౌశీల్యమితనిపైఁ జయ్యనసిలిచి మా
ట్లాడించె మనతో రహస్యరీతిఁ
గారుణ్యమితనిపైఁ బోరాడి మనసొంత
చేలంబు లిప్పించి చింతలడఁచె
రసికభావంబితని వేకరించి మనకు
వరములిప్పించెఁ గోరిన వానినెల్ల
నటులఁ గాకున్న జగదీశుఁడైన కృష్ణుఁ
డెచట గొల్లెత లెక్కడే యింతులార! 206

సీ. ఈ రేయిగద నేను హిమవారిమిశ్రిత
జలములయందు మజ్జనమొనర్తు
నీ నిశగద నే నహీన శిగ్రువులతో
సమకూర్చి శాల్యోదనము భుజింతు
నీ రాత్రిగద నే శరీరంబు శ్రీఖండ
మృగమదాదులచేతఁ దగ భజింతు
నీ తమిఁగద నేను ధూతవ్యథాప్తిచే
మేను మెత్తనిసెజ్జపైనఁ జేర్తు
నీ విభావరిఁగద నేను భావకల్మ
షములు వర్జించి సుఖనిద్ర సలుపగలుగు
నని వచింపుచు నాత్మసదనములందుఁ
జేరియుండిరి కృతకార్యసిద్ధులగుచు 207

వ. వీరి సమాచారంబిట్లుండ గోకుల నివాసులగు బక్కనాగు, పొట్టిగంగు, గుజ్జుమామిడి గున్నచింత, జుంటివాతెఱ, సూ

రసేని, నీలకేశిని, పూలగుత్తి, పొన్నాచ్చి, పిన్నక్క యను పేరులుగల గోపికలు దధిఘృత గోరసంబులు విక్రయించుటకనేక గ్రామంబులు దిరుగుచుండి యొక్కనాడు నిగమార్థంబను నామంబుగల యగ్రహారంబుఁ జేరి ఘృతాదులమ్మి సాయంకాలము తిరిగి గోకులంబున కేగుచుండఁ దదీయ గ్రామవాసినులగు బ్రాహ్మణస్త్రీ లనేక లొక్కచోట నిలిచి గ్రంథపారాయణం బొనర్చుచు గోపికలంగని యిట్లనిరి. 208

ఉ. మీనగలంబరంబులును మీవదనంబులు మీవిలాసముల్
మీనగవుల్ నుడుల్ చెవులు మీకనుబొమ్మలు లోచ
నంబులున్। మీనడుముల్ నడల్ తొడలు మేకొనిచూచిన
వారికెల్ల సా। రై నృపకామినీమణుల యట్టులఁదోచె ని
దేమిచిత్రమో.

సీ. వాయెత్తి మీ రెట్టి వాక్యంబు నుడివిన
నవరసంబులలోని చవులనీనుఁ
బ్రమదంబుతో మీరు గమనింపఁ దొడఁగిన
రాజహంసల విహారగతిపొల్చుఁ
గనులుదెఱచి మీరు కాంచుచోటుల నెల్లఁ
దొగలతేకులు సల్లుపగిదిఁ దోఁచుఁ
జేచాచి మీ రేదిచేయఁబూనిన నది
శాస్త్రీయమై ప్రశస్తముగ వెలయు
నెంతసేపుమిమ్ము నీక్షించినను దృప్తి
చనక విడిచిపెట్టఁజాలమైతి

మేమియద్భుతంబో తామసింపక మాకుఁ
జెప్పరమ్మ గొల్లచెలువలార. 210

గోపికలు

వ. తమలో నొకరా శ్రీకృష్ణసాన్నిధ్యం బియ్యాభీరాంగనల కెంత గౌరవం బొనఁగూర్చెనని యానంద ప్రవాహం బునఁ దేలుచు బ్రాహ్మణీజనంబులతో విదుషీమణులారా! యిచ్చటికి యోజనదూరంబున బృందావన సమీపంబున గోకులం బను గ్రామంబు మానివాసంబు దానియందుఁ బూర్వము దుర్భిక్షుంబధికంబై యుండెఁ గాని పదిసంవత్స రములనుండి యొక భాగ్యదేవత ప్రత్యక్షంబై సుభిక్షంబు గల్పించినది యా దేవత బ్రహ్మాండములయం దేకచ్ఛత్రాధి పత్యంబు వహించియున్నది మఱియు. 211

సీ. పంచభూతములఁ గనఁ్పడకుండ మాయింపఁ
జెలఁగి తామరల సృజింపఁజాలు
వేవెలుంగునుఁ జలివెలుఁగును గక్కలఁ,
బడఁగూల్చి పిదప నేర్పరుపఁజాలుఁ
దుదిరేయి పెంపొందు దొడ్డసంద్రముల నిం
కింపించి కెరలి కల్పింపఁజాలుఁ
జతురాననాండ సంతతులు రూపఱఁజేసి
మెలఁకువతోడ నిర్మింపఁజాలు
వనజభవశూలధర శచీవరులకొదవు
నంగదలఁబాపి కూర్మిఁ బ్రోవంగఁ జాలు

నట్టిదేవత నేడు కృష్ణాఖ్యతోడ
నెలసియున్నది సుమ్ము గోకులమునందు. 212

సీ. దధిఘృతాదులచే వివిధభాండములుఁ నిండఁ
దొడుకు మొత్తములచే దొడ్లునిండఁ
గొలుచులచే గరిసెలునిండె ద్రవ్య సం
చయములచే మందసములునిండఁ
దేనిచేఁ బండ్లచే మాన్యులునిండె స
గలచే వధూజనాంగములునిండె
బాలికార్భకులచే నాలయంబులుఁ నిండె
నుత్సవాదులచేత నూరునిండె
సకలభూతహృదయ సరసీజములు విక
సించి సంతసంబుచేత నిండె
నందు నింటిలో సనాతనుండగు కృష్ణుఁ
డవతరించి పెరుగుటాదిగాఁగ. 213

బ్రాహ్మణ స్త్రీలు

వ. ఆహా చెలువలారా! శ్రీకృష్ణ ప్రభావామృతంబు శబ్దగ్రహాంజలులచేఁ గ్రోలుచున్నది మొదలు భావతరంగంబు లపారంబుగా రేఁగుచున్నవి మీరమ్మహాపురుషుని నిరంతరంబు దర్శించుటవలన భాగ్యవతులు, మీ దర్శనంబుచే మేము నట్టివారమైతి మది యట్లుండనిండు శ్రీకృష్ణుఁ డెట్లునడచు నెంతపొడవుండు నెట్లునవ్వు నేమిచేయుచుండును మాకీ జన్మంబునఁ గానవచ్చునా? వచింపుడు. 214

సీ. అగిసెపూవన్నె చేఁదగు మేనిజిగివాఁడు
నిగనిగలాడు సొలుగలవాఁడు
నెలఁతుకమిన్న లెదలఁ గరంచెడువాఁడు
మొలకనవ్వుల మోము తలుకువాఁడు
కవిసి చక్కెరనేలు చవుల మాటలవాఁడు
సేవింపఁ దన్నిచ్చు నీవివాఁడు
పసమీఱు మేలివయసుచేఁ బొసఁగువాఁడు
దెసలెల్ల మలయు పేరసమువాఁడు
తలపులలరించు మంచి మేతావివాఁడు
చూపఱకు నచ్చెరువుఁగూర్చు చూపువాఁడు
మగఱనూరించు కడిఁది సోయగమువాఁడు
మమ్ములనుఁ బ్రోచు కృష్ణుఁ డోయమ్మలార. 215

గోపికలు

వ. వినుఁడీమణులారా! కృతయుగంబున నిరువదెనిమిది మూరలునుఁ ద్రేతయందుఁ బదునాలుగుమూరలును ద్వాపరంబున నేడుమూరలునుఁ గలియుగంబున నేడుజానలును పొడవు గలిగి మానవదేహప్రమాణంబు లొప్పుచుండు నని శాస్త్రంబులు వక్కాణింపుచున్నవి యిది ద్వాపరంబు గావున శ్రీకృష్ణుని శరీరం బేడుమూరలు పొడవుగలిగి యున్నది కాని సాముద్రికోక్త లక్షణంబు లన్నియుఁ గొఱంతలేక యా శరీరంబునఁ జూడఁదగు నన్యశరీరంబుల నొకటిరెండు సులక్షణంబులుండుంగాని కృష్ణునివలె నుండఁ జాలవని పండితులవల్ల విందుము. 216

సీ. హరిపాదతల లోహితాంబుజమ్ములయందుఁ
ప్రపద కచ్ఛపము లేపగిదిఁబుట్టెఁ
ప్రపద కచ్ఛపములపై నూరు కరిహస్త
యుగళ మేచందాన నుద్భవించె
నా కరిహస్తంబులందు నెట్లుదయించె
నవలగ్నమనెడి విహాయసంబు
నానింగిమీఁద బ్రహ్మాండనివాసమా
జఠర మే మర్యాదసంభవించె

దానిపై సనె ట్లుదయమయ్యె వక్షఃక
వాటమార దాని ప్రక్క బాహు
పన్నగంబులెట్లు ప్రభవించె వానిపైఁ
గంఠ శంఖమెట్లు గలిగియొప్పె. 217

సీ. కంఠశంఖంబుపైఁ గమనీయమగు చిబు
క వటఫలంబెట్లు కలిగిపొదలె
నావటఫలముపై నధరబంధూకంబు
లేరీతి నుదయించె నింపుమీఱ
నధరబంధూకంబునందు నాసాచంప
క ప్రసూనంబెట్లుగలిగె దాని
నొరసి భ్రూయుగ గుణులుదయించె నెట్టులా
వలఁజెవులనెడు చక్కిలములెట్టు
లుద్భవించెనో యన్నిటికుపరిశీర్ష
కేసరకలాటువెటుపుట్టెఁ గీర్తనీయ

మగుచు నని పండితులు గాంతురధిక విస్మ
యంబు కృష్ణాంగములు సూచినప్పుడెల్ల. 128

సి. శ్రీకృష్ణు నెలమి వీక్షించినవారికి
నాదిఁ దద్దివ్య దేహంబు దోఁచు
నద్దివ్య దేహసమావలోకన మొందు
సావి వలాహకచ్ఛాయదోఁచు
నామేచకచ్ఛాయ నరసి విలోకించు
తఱినెన్నరాని నిద్దంబుదోఁచు
నానిద్దమీక్షించు నాసదీరకము న్నె
కమలాప్తు నిరసించు కాంతిదోఁచుఁ
గాంతులందు బాళికలిగి చూచెడు వేళ
లలిత భూరిపరిమళంబుదోఁచు
నాసుగంధ లాభమందినచో మోహ
మొందఁగలరు యోగిబృందమైన. 219

సీ. కమలాక్షు పాద రేఖలు గాంచినంతలోఁ
జాలులెమ్మనిపించు సంతసింపఁ
దరువాతఁ దత్పాదతలరక్తిమము దోఁపఁ
బ్రబలాశ దానిపైఁ బరువులెత్తు
నటుమీఁద జానువులగపడినంతలో
వానిపై మితి లేని వలపుగలుగు
రుచిరోరుయుగము నిరూఢి నిరీక్షింప
గాఢానురాగ మక్కడనె నిలుచు

మధ్యమును గాంచినంత విస్మయముదోఁచు
భవ్యజఠరంబుసూడ విభ్రాంతిపొడలు
నేయవయవంబు వీక్షింప నెట్టివారి
కైన నానందమచ్చోట నంకురించు. 220

సీ. అమవసరేయిఁ జంద్రముఁడు లేడనులోచ్చు
గలుగదు కృష్ణుమొగంబుదోఁప
దుర్దినంబైనఁ బ్రభ్నుఁడు గానఁబడని కొ
అంతలేదరిపాణి కాంతిదోఁప
బంగారులేని లోపము గానిపించద
కమలదళాక్షాంశుకంబుదోఁప
నవమణుల్ లేని హైన్యమురాదు మురవైరి
మార్దవాలాప సామగ్రిదోఁప
నింత కొలఁదివాఁడు సిట్టినేరుపుగల
వాఁడుగద యటంచు వాకొనంగ
రానివన్నెకాఁడు శ్రీనిధానము యశో
దాకుమారుఁ డధికధన్యశీలి. 221

సీ. ఆకలి బాధించునపుడు కృష్ణునిఁగన్న
జఠరంబు భోజనాసక్తిఁ గనదు
దాహమగ్గలమైనతటి యశోదాపుత్రుఁ
గన మంచినీరడగదు రసజ్ఞ
నిద్రపైకొను వేళ నీరజాక్షునిఁగన్న
మేనుగోరదు సెజ్జపైనఁజేర

వ్యసనంబుఁగనువేళ వనజనాభునిఁగన్నఁ
గంపంబునొంద వంగములు డస్సి
గోపబాలుఁ డప్రాకృతాంగుండుగాన
నతని దర్శించు మేతాల్పులందఱికి న
ప్రాకృతానందమొదవు మాపల్కు లనృత
మనకధ్యానింప మీకబ్బునట్టిమేలు. 222

తే. అవయవము లెల్లవారికి నమరియుండుఁ
గాని యందంబొకటరెంటఁ గలిగియొప్పు
నట్లుగాక మురారి సర్వాంగసమితి
భూరిసౌందర్యమునఁ బొల్చుఁ బొలఁతులార. 223

వ. అని వచించిన గోపాలాంగనల ననేకవిధంబుల బహూక
రించి విప్రవరారోహ లిట్లనిరి. 224

శా. మీరాభీరకులంబునం బొడమినన్ మీవంటిపుణ్యాత్ములు
న్నారే సర్వజగంబులందున మరున్నారీమణుల్గాంచిరే
శ్రీరమ్యుండగు కృష్ణసఖ్యమునుమీ చిత్తంబులేచిత్తముల్
మీరేరామలుమీవెపుట్టువులుసుమ్మీమాటలింకేటికిన్.

తే. వేలకొలఁదిగ నావిర్భవించినాము
విప్రకులమందు మేము యే వెలఁదియైన
జేసియుండదు తపమట్టిసిద్ధియున్న
నీరజాక్షునియూర జన్మింపగాదె. 226

సీ. తామ్రాక్షతుల్యమార్దవ గళధ్వనివాఁడు
పలుకునే మాతోడ బాళిమీఱ

సుమధన్విపసదూల్పు సుందరాకారుఁ డీ
జన్మమందిడునె దర్శనముమాకు
జేజేలరంజిల్లఁజేయు వేణువునాఁడు
పాడునే మామొ్రల వేడుకలర
గంధసింధురమట్లు గమనించు నెఱజాణ
నిలుచునే మాచెంత నిమిషమైన
నీరజాక్షుండు మాకు సాన్నిధ్యమైన
మేలటులఁ గాకయున్న నిమ్మేనులెల్లఁ
విడిచి యాతనిఁ బొందుకే విమలమార్గ
మని తలంచెదమమ్మ లతాంగులార. 227

వ. మీకు శ్రీకృష్ణునియం దిట్టి యనురాగం బుద్భవించెం గదా గోకులంబునకు వచ్చి దర్శింపరాదా. 228

బ్రాహ్మణ స్త్రీలు

తే. ఆడువారికంటె హైన్యంబుఁజెందిన
జన్మమొకటిలేదు జగతియందు
బ్రహ్మ వీరినేల ప్రభవింపఁజేసెనో
పారతంత్ర్యమొంది బ్రతుకుఁడనుచు. 229

సీ. పదియురెండేడుల పాయమొందినదాఁక
తల్లిదండ్రులమాట దాఁటరాదు
పుట్టినిల్లెడఁబాసి పోయినప్పటినుండి
యత్తమామలకు మాటాడరాదు

పొందుగా సొంతకాఁపుర మొనర్చెడు వేళఁ
పాణేశునుడి వృథాపరుపరాదు
ప్రబల వార్ధక్యంబు పైకొన్న సావిఁ గు
మారులయాన కేమఱఁగరాదు
చానలని చెప్పఁబడియె శాస్త్రములయందు
నట్టి పరతంత్రిలెట్లు గాత్రిమాంతరముల
కరిగిచూతురు మహనీయులైన వారి
విమలతీర్థంబులెట్లు సేవింతురమ్మ. 230

సీ. రెండుపూఁటలయందు వండు టేభరమన్నఁ
బిల్లలాపై నేడిపింపుచుండు
రయ్యర్భకుల గోల కారాటపడుచుండఁ
బరిచర్యకై మగం డొరసిలాగు
నతనితో నట్టిట్టులగుచుండ బికిరాల
మారులెందఱో చెంతఁజేరి వాఁగు
వారి నావలి కంపవలయు నన్నప్పుడే
చుట్టాలువచ్చిరి చూచిపోవ
వారి మర్యాదఁజేయు నవసరమందు
వచ్చె ఋతుకాల మియ్యాడువారి కెట్లు
పొసఁగుఁ బెద్దలసేవింపఁ బుణ్యతీర్థ
ముల కరిగి చూడఁ దెలుప్పుడీ పొలఁతులార. 231

ఉ. అట్టనిమానరాదు పరమార్థము మానవజన్మమందుఁ గా
కెట్టి భవంబులందున గడింప నసాధ్యముగానఁ బెద్దలే
పట్టుననున్న నచ్చటి కుపాయముతోఁజని ముక్తిమార్గము

న్నట్టి తెలుంగులఁ వినుటలందదటేకద శుభహాంగదా సదా.

వ. ఏది యెట్లులుండినను గోకులంబునకైన వచ్చి కృష్ణుని దర్శింపగోరుచుంటి మతఁడు లోకోత్తర పురుషుండగుటం జేసి మాతో సంభాషించునో లేదో గదా. 233

గోపికలు

వ. సందియంబేమియు వలదు శ్రీకృష్ణుండు జగన్నాయకుండైనను భక్తపరాధీనుండు. 234

సీ. చేసాచి గిడిగిండ్లు చేసిన వానికం
గదలుపోగొట్టి సౌఖ్యంబులిచ్చు
వాయెత్తి తనపేరువల్లించువాని దా
రిద్ర్యంబులెల్ల హరించివైచుఁ
గనుఱెప్పలెత్తి దర్శనమొనర్చినవాని
కోరికలడిగి చేకూర్చుచుండుఁ
జెవులొగ్గి తనకథల్పవిఁగొన్నవాని క
ద్భుత విద్యలిడి సభాపూజ్యుఁ జేయుఁ
బురుషవరులకంటెఁ బరతంత్రలని వధూ
జనులపాలఁజాల కనికరంబు
కలిగిప్రోచుచుండు నలయశోదాపుత్రుఁ
డొందవలదు మీరు సందియంబు. 235

సీ. గర్వంబులేని చక్కందనంబన్న మా
శ్రీకృష్ణునందె వీక్షింపవలయుఁ
బరవధూవాంఛఁ దాల్పని యౌవనంబన్న
నందసూనునిదె యనంగవలయు

నిచ్చి దెప్పని విహాయితమున్న దేవకీ
సుతునందె నిరతంబుఁ జూడవలయు
నాడితప్పని సూనృతాధిక్యమున్న వం
శీధరునందె లక్షింపవలయు

నాశ్రితుల తప్పులెన్న కత్యంతకరుణఁ
గాచుపనియున్న హరియందె కాంచవలయుఁ
గాని లోఁతులయం దిన్ని ఘనగుణములు
పోడమి నిలువవు సుమ్ము పూఁబోఁడులార. 236

మ. వినియుం జూచియు వస్తుతత్త్వమెఱుఁగన్ వీల్గాదు సుమ్మెం
తజ్ఞా | ననిరూఢాత్ములకైన స్వానుభవము న్నంగాక
మీరల్లెపా | యనిభక్తిన్ మురవైరి పాదయుగమున్
ధ్యానించి దర్శింపఁ దోఁ | చును తద్వైభవమెల్ల మా
నుడులచే శోభిల్లునే చిత్తముల్. 237

వ. అని వెండియు బహువిధంబుల శ్రీకృష్ణప్రభావం బెఱింగించి గోపవధూమణులు గోకులంబునకుఁజని రంతమీఁద ద్విజ పురంధ్రులు నిగంతర కృష్ణానురాగసహితాశయలై. 238

సీ. జోలపాటలు పాడువేళఁ గృష్ణుని నామ
ముల నుచ్చరించి రమోఘఫణితి
లాలిపాటలు పాడుకాలంబున మురారి
కథలు వచించి రొక్కరికినొకరు
బలుమంది యొకచోటఁ గలసి కూర్చుండిన
వేళఁ బాడిరి కృష్ణలీలలోలి

నుత్సవంబులు సాగుచుండినప్పుడు కృష్ణు
నీలాంగమహిమ వర్ణించి రెలమిఁ
దిండిదినువేళ నలసి కూర్చుండుతఱి న
టించువేళల రాత్రి నిద్రించువేళఁ
బనులోనర్చెడువేళ మజ్జన మొనర్చు
నపుడు కృష్ణవిలీనాత్మలైరి చెలులు. 239

మ. పసులందుం బసులందు నాత్మగృహ భూభాగంబులందు న్మహా । నసమందుం బలిలంబులందు మఱి నానావస్తు పూగంబునం । దసమానాధ్వర శాలలందు ద్విజవంశాంభోజగంధుల్ మహో । హొ । ల్లసలై కృష్ణుని రూపమే కనిరి ఫాలన్యస్త హస్తాబ్జలై. 240

సీ. చీఁకటిమాత్రఁకు నా చెలియను నొకభామ
రున్నారి వెన్ను మేపన్న నెన్ని
పండువెన్నెలనాడు బాంధవంబను నొక్క
సతి నందసుతు దరస్మితముఁదలఁచి
శిఖిసంచయములు నా సఖులను నొకనెలం
తుక దరారిశ్రీరు చంద్రకము నెంచి
నాఁచుతీవలగుంపు నాచేటియను నొక్క
హరిణాక్షి మురవైరి కురులనరసి
సరసమాఁడునొకతె చాఁగిలఁబడి మ్రొక్కు
చుండునొకతె కృష్ణుఁడున్నయట్లు
రార కృష్ణ నీదు రమణీయపదము ల
ర్చింతు ననుచు లలి వచించునొకటి. 241

సీ. సగముబోసే సెడుసావిఁ గృష్ణుఁడు తలం
పునకురా నానాతి బువ్వమానుఁ
బాలిచ్చువేళ గోపాలుండు స్మృతికి రా
బిసజాక్షి తనపసిబిడ్డ విడుచుఁ
బరిచర్యఁ జేయుచో హరిమనంబునఁ జేర
నింతిస్వపతినైన నీసడించు
భాషించుచోఁ జక్రిపాణి సన్నిధిమైనఁ
జెలి చెలికత్తెతోఁ బలుకమఱచుఁ

గలను సంకుదారి కనిపింప నారేయి
గోల నిదురమాని మేలుకాంచు
ద్విజవధూటులిట్లు దేవాదిదేవుఁడౌ
నందసుతునిపై మనములు నిలిపి. 242

సీ. ఈకుంకుమముఁజూడు మిందీవరాక్షి నం
దుసపట్టి కెమ్మోవి నెనయునేమొ
కాంచు మీమల్లెమొగ్గలు చాన కృష్ణు ప
ల్వరుసతో సరిపోల్పవచ్చునేమొ
తమ్మిఁగను మీచందనముచెలీ కటివేల్పు
కాయసౌరభతుల్య మాయెనేమొ
కొమ్మ వీక్షింపుమీ కమ్మనూనియ పూత
నారికుంతలముల కర్హమేమొ

యట్లుగాకయున్న నంభోరుహాక్షి యీ
కుంకుమంబు మల్లెకుసుమ చంద

నములు కమ్మనూని నాకేటికని చెప్ప
చుందు రొకరి కొక్కరొకటఁగలిసి. 243

సీ. ఈయధ్వరంబు నాఁడా యదూత్తముఁడున్న
నగ్రితాంబూల మీఁయఁగవచ్చు
నీపెండ్లి సావినాగోపాలవిభుఁడున్నఁ
బ్రియపదార్థముల నర్పింపవచ్చు
నీసదస్యము వేళ నాసీర్యనుజుఁడున్న
నెనలేని బహుమతు లీయవచ్చు
నీమహోత్సవము నాఁడా మురాంతకుఁడున్న
స్థిరభక్తిఁ బూలఁ బూజింపవచ్చుఁ
గాని లేఁడాయె నా జగత్కాంతుఁడిచట
మన కొఱంతలుదీర్ప సమర్థులెవ్వ
రనుచు దిగులొందుదురు మంచిపనులు జరుగు
నప్పుడెల్ల ద్విజాంగనల్ హరిఁదలంచి. 244

సీ. పెనిమిటి మాట్లాడఁడను లోపముండునే
హరికటాక్షంబు నాకబ్బెనేని
సంతులేద నెడు కొఱంత నాకుండునే
సుడివాలు దారికన్పడియెనేని
సిరులింటలేవను పరితాపముండునే
పసిఁడిగింజెము వాఁడు పలికెనేని
గోడండ్రుదెప్పు జుగుప్స నాకుండునే
దరిజేరి కృష్ణుఁడు తాఁకెనేని

దన్ను మనమిన్నిగతులఁ జిత్తములయందుఁ
దలఁచి దిగులొందుచుండ నే తరుణమందు
నైనఁ బొడచూపడా శ్రీనిధానముని ప
రస్పరము సెప్పుకొందురా రమణులెల్ల. 245

సీ. తిర్యగ్భవంబుఁ జెందినఁ జెందియుండెఁబో
మాహాసమూహంబు మహిమఁ గాంచె
నటవీసమాఖ్య తానందిన నందెఁబో
బృందావనము పుణ్యబృందమయ్యె
మీలతో నాఁచుతో మెలఁగిన మెలఁగెఁబో
యమునానదీజలం బనఘమయ్యె
నవరవర్ణోద్భూతమందిన నందెఁబో
వేపల్లె గోపకుల్ విమలులైరి
కృష్ణసంబంధమెనసి వరిష్ఠులైన
కారణంబున నట్టి భాగ్యంబు మనకుఁ
గలుగదాయెను ముందైనఁ గలదొ లేదొ
యని విచారముఁ జెందిరవ్వనితలోలి. 246

చ. గరళము చన్నులందిడి వికారశరీరముఁ దాల్చి వాడలం
బరగునిసుంగులందునిమి పాపమొనర్చిన పూతనా నిశా
చరిమురవైరిఁ డాసి మునిసంచయముల్ వెఱగందిచూడ న
పరమపదంబుఁ జేరె నటు భాగ్యము మాకొనఁగూడ
దేటికో. 247

సీ. పాత్రశోధనచేయుపని సెప్ప మగవార
లింటింటఁ గలరు మమ్మేడిపింపఁ

జిఱుదిండికోఱకు యాచించు పిల్లలగుంపు
లంతటఁగలవు మాఁగొంతులొత్త
వేళాయెఁ బాళెఁబు కాలేద దేమను
ముదుసళ్ళుగలరు మమ్ముల నదల్పఁ
దాము కోరినదిచ్చుదాఁక నల్లరిఁజేయు
బిచ్చగాండ్రెటనైనఁ బెచ్చుగలరు
కాని కృష్ణునిఁగొల్వడీ చానలార
యని వచింపుచుఁ దత్కథావనధిలోఁ బ్రి
వేళపెట్టెడువారు పృథ్వీస్థలంబు
నందులేరామె జిత్రమో యమ్మలార. 248

సీ. పట్టాంబరములు సంపాదించుకొనవచ్చుఁ
జెలఁగిరత్నంబు లార్జింపవచ్చు
స్వాపతేయంబులక్షలు గూర్పఁగావచ్చు
మంచిసీత్యములు గడించవచ్చు
నారామసమితిఁ జేకూరుచుకొనవచ్చు
నెన్నియో నగలు సేయింపవచ్చు
స్తంబేరమంబుల సాధించుకొనవచ్చు
ఘోటకంబుల సమకూర్పవచ్చు
విద్య లార్జింపవచ్చు వివేకమొప్పఁ
గాని కృష్ణపదాంబుజధ్యాననిరతు
లైవిరాగంబుఁ జెందు మహానుభావు
లను గడించుటలరిది నెలంతలార. 249

మ. ధనమప్పిచ్చెదు వా రమూల్యమగు వస్త్రంబుల్సమర్పించు
వా, రనిశంబోరె మొసంగువారు గృహ కన్యాదానము
ల్సేసి చ, య్యనఁ బూజించెదువారలుం గలరు పో యా
చింపఁగా నందనం, దను దివ్యాంఘ్రి విశేషముత్తెలుపు
భక్తగ్రామణుల్ లేరయో. 250

వ. అని యిట్లు విప్రాంగనలు బహుజన్మసహస్రసంచిత పుణ్య
పరిపాకంబువలనఁ గలిగిన భక్తిచే శ్రీకృష్ణుని ధ్యానిం
చుచు నన్యంబు మఱచిరని చెప్పిన శుకయోగీంద్రునితో
రాజిట్లనియె. 251

పరిక్షిత్తు

వ. వారలట్లు సంసారవిఘ్నంబగు భక్తియోగం బవలంబించి
యన్యంబు విసర్జించిరని పలికితివి తదీయ పతి పుత్ర బాం
ధవాదులు బద్ధసంసారులుగదా సహించి యూరకుండిరా.

శుకయోగి

వ. మంచిప్రశ్న మొనరించితివి సలిలాగ్నులవలెఁ గౌముదీ
ధ్వాంతంబులవలె భగవద్భక్తికిని విషయకృత్యంబులకును
విరోధంబు సహజంబైనను. 253

మ. గతకాలంబున వేలజన్మముల యాగంబుల్ తపంబుల్
మహా, వ్రతముల్దానము లాచరించి సుకృతా వాప్తిన్
విజృంభించి దు, ష్కృత నాశంబొనరించువారలకు శ్రీకృ
ష్ణాంఘ్రియుగ్మంబు పై, నతిరాగంబుదయించి మాయది
తర వ్యాపారవారంబుచేన్. 254

వ॥ కర్మబద్ధులైన జీవులందఱు స్త్రీప్రాయులనియు నారాయణుం డొక్కండె పురుషుండనియుఁ బరాశర మునీంద్రుండు వక్కాణించెఁ గావున భక్తికాంతా మతల్లి పుణ్యానుగుణముగా శరీరులను స్త్రీలయం దావేశించి పునీతులం జేసి శ్రీహరి కర్పింపుచుండు. 255

పరిక్షిత్తు

వ॥ లోకంబున నాడువార లెందఱు గలరో మగవారు సహితమంత మందికానం బడుచుండిరి మీారందఱిని స్త్రీలని చెప్పుట చాలా విపర్యాసముగా నున్న దే. 256

శుకయోగి

వ॥ విపర్యాసమేమియు లేదు లోకంబునంగల దేహులందఱు స్త్రీప్రాయులని చెప్పితినిగాని స్త్రీలని చెప్పలేదుగదా. 257

పరిక్షిత్తు

వ॥ దాని యథార్థమేమో నిక్కముగా సెలవిండు. 258

శుకయోగి

వ॥ రాజేంద్రా! యవధరింపుడు కర్మానుసారంబుగా ఫలంబులార్జించుకొను వారందఱు స్త్రీప్రాయులు స్వేచ్ఛానుగుణముగాఁ గోరికలు పొందువాఁడు పురుషుండట్టివాఁడు విష్ణుండే వానికిఁ పురుషోత్తముండనియు నామంబుగలదు దీని కుదాహరణం బిత్తు నాలకింపుము. 259

సీ॥ ధనమునకై సమస్తజనంబు యత్నింప
దొరకునే నూటికొక్కరునికైన
నారోగ్యమందటి కవసరంబనియెన్న
వివిధరోగులు లేరె వేతలఁ జెంది
కీర్తికై యెందఱో కృత్యముల్ సలుపంగ
వచ్చునే కోరినవారికెల్ల
ఘనవిద్యలార్జింపఁగా నెంచి పఠియింప
విద్వాంసులైరె వేవేలమంది

ఫలము కర్మవశంబయి మెలఁగుకతన
జీవకోటికి రాదు వాంఛించునట్లు
మధువిరోధికి సంకల్పమాత్రమున ఫ
లించుఁ గార్యంబు కర్మంబు లేదతనికి. 290

వ॥ సర్వకాలంబులందునుఁ గర్మంబున కధికారి ప్రకృతి ప్రకృతిచేఁ బ్రేరింపబడి దేహి సుకృత దుష్కృతరూపంబులైన కర్మంబు లొనరించుఁ దదీయకర్మంబులకు ఫలంబిచ్చువాఁడు శ్రీమన్నారాయణుండు భగవదనుగ్రహంబు పొందువరకు దేహికి దుఃఖంబు నశింపదు భగవదనుగ్రహంబు సంపాదించి యిచ్చునది భక్తియోగంబు భక్తియోగంబు భాగవత జనసాంగత్యంబుచే లభించు నట్లే గోపికా జనసంసర్గంబున బ్రాహ్మణీజనంబు లన్యంబురోసి వాసుదేవ పరాయణలై పతిపుత్రాది బాంధవ జనశాసనంబతిక్రమించిరి. 261

సీ॥ అర్భకుండైన ప్రహ్లాదుఁడష్టాపద
కశిపుబాధలకు దుఃఖంబుగనెనె
షట్సమాప్రాయుఁడై చని యరణ్యమున సా
ధ్వస మొందినాడె యౌత్తానపాది
కనలిరహూగణుండను రాజు తర్జింప
భయమొందినాడె యబ్భరతయోగి
హనుమంతుఁ డొక్కఁడై యా రావణాదుల
నిరసింపలేదె హానిఁగనకుండ

నగ్ని యెవరింటిలోపల నడఁగియున్న
బట్టలోఁగట్టుటకు సాధ్యపడనియట్లు
విష్ణుభక్తులు మగలైన వెలఁదులైనఁ
బరులకెప్పుడైన లొంగరు పార్థివేంద్ర. 262

సీ. తనియకాలమున గంధర్వకోటులఁజంపె
నౌత్తానపాది బాహాటమొప్పఁ
బురుహూతయుత నిలింపులఁదోలి పీయూష
మార్జించె నీడోద్భవాధిపుండు
జానకీరాముల సంతోషమునకునై
సామీరి రాక్షసచ్ఛటలఁగూల్చె
ముల్లోకములనుండు బల్లిదు లెదిరింప
సరవి నోర్చి కిరీటి జయముఁగాంచె

నొక్కరొక్కరుఁడీభంగిఁ బెక్కుబలురఁ
గీటడంగించి భూరిసత్కీర్తిఁగనుట

విష్ణుపాదారవిందముల్ విపులభక్తి
మానసంబున నిల్పిగదా నరేంద్ర! 263

మ. చెడిపోవుం దపముల్ జపంబులును విస్తీర్ణాగ్నిహోత్ర
క్రియల్, చెడిపోవుᳲ మహనీయ దానవ్రతముల్ స్ఫీతా
ధ్వరోద్యోగముల్. చెడిపోవుᳲ బహుళోపవాసఫలముల్
క్షీణించుఁబుణ్యంబులుం, జెడిపోదెన్నఁడు విష్ణుభక్తిఫల
ము త్సేకించి దుర్వారమై. 264

ఆ. భరతయోగి హరిణ భవమొందినను మహా
రాజుదంతియైన రగిలివారి
కోర్కెలిచ్చెఁగాని కొఅవడనే విష్ణు
భక్తిమున్ను వినవె పార్థివేంద్ర. 265

మ. మునియై యింద్రియముల్ జయించి వేస దుర్మోహంబు
వర్జించి స, న్మనుసిద్ధుల్ సమయోగసిద్ధులును సంపాదించి
త్రైలోక్య పా, వనుఁడై కీర్తివహించినట్టి యల దుర్వా
సుᳲ జయించెంగదా, జనపాలుండగు నంబరీషుఁ డరిభృ
త్సద్భక్తివర్ధిష్ణుఁడై. 266

సీ॥ స్వీయసంసారకార్యాయత్తుఁడై యప్పు
డపుడు చేయునది మహాల్పభక్తి
సంస్కృతి(క్రియలతో సమముగా నెంచితాఁ
గావించునేని జఘన్యభక్తి
నిఖిలకార్యంబులు నిరసించి సతత మ
నుష్ఠించువానిది శ్రేష్ఠభక్తి

తన ప్రాణములకంటె ఘనముగాఁ దలఁచిను
స్థిరబుద్ధిఁ జేయుచో సిద్ధభక్తి

ముక్తియైననుఁ గోరకాసక్తితోడఁ
జేయుచున్నంత నదియద్వితీయ భక్తి
యనఁగఁ బేరొందునివి యెల్లహరినిఁ జేరి
శాశ్వతానంద మొసఁగు సజ్జనుల కెపుడు. 267

సీ॥ బ్రహ్మహత్యాది పాపధ్వాంత సమితికి
దినకర ప్రభవాసుదేవ భక్తి
వివిధామయారణ్య విస్తారమునకుఁ బా
వక శిఖాచ్ఛటమధువైరి భక్తి
సాంద్రదారిద్ర్య వైశ్వానర జ్వాలకు
నాసారము నిశాచరారిభక్తి
సత్కార్యవిఘ్న ద్విషద్వారిదములకు
ఝుంఝూనిలము శేషశాయిభక్తి

సకలభూత భయాధిక శైలములకు
విపుల వజ్రాయుధము మహావిష్ణుభక్తి
యట్టిభక్తులకే లోకమందునైనఁ
గలుగనేరదు లోపంబు ఘనగుణాఢ్య. 268

మ॥ ధనమిచ్చున్ ఘనమిచ్చు మోక్షమును విద్యాసుందరీ ధాన్యయా
వనసౌందర్యములిచ్చు సౌఖ్యమునులావణ్యంబు ధైర్యంబుపా

వసశీలంబుమహాంగవారణములుఁ జార్వంబులిచ్చుఁ సనా
తనుఁడౌ విష్ణుపదానురాగమలభక్తశ్రేణికిఁ భూవరా. 279

సీ. వివిధయోగులకంటె విడువక నను సదా
సేవించువాఁ డతిశ్రేష్ఠుఁడనుచు
మును దురాచారుఁడైనను నన్ను భజియింప
నతఁడు ధర్మాత్ముఁడై యలరుననుచు
నాభక్తుఁడగువాఁడు నాశమెన్నటికైనఁ
జెందఁడంచుఁ బ్రతిజ్ఞఁ జేయుమనుచు
నిష్కాముఁడగు భక్తునికి నాకు భేదమే
ర్పడదు వాఁడెపుడు నాప్రాణమనుచు

గీతలందు మురారి మీ తాతయైన
ఫల్గుననితోడఁ జెప్పెనా ఫణితివిన్న
భక్తికంటెను మిగిలిన పదవిలేద
టంచుఁ దోచునుగాదె ధరాధినాథ. 280

సీ. రవికిరణప్రసారముఁ గన్న కమలంబు
హానిఁ గైకొను నె నీహారలబ్ధి
సింగంబు నోటఁ జిక్కిన మాంసంబు
వశమౌనె పరమృగావళికిఁ దీయఁ
గింపచానుని యింటఁ గెంలెడు ద్రవ్యంబు
తరమౌనె యాచకోత్కరము పొంద
జన్యశూరుని హస్తశస్త్రము హరింప
నలవియే యెంతవారలకు నైన

నల్లై సర్వేశ్వరుండౌ రమాధినాథ
పాదపద్మానురాగ సంప్రాప్తులైన
భాగవతజను లితర ప్రభావములకు
లొంగ రెన్నడు భయముచే భంగపడరు. 271

క. గాలికి వానకు లొంగని
శైలంబుల పగిది శేషశాయి పదము లే
వేళ భజియించు సాధులు
తూలరితర బాధలకుఁ గుతూహలమతులై 272

వ. తదుపరిఁ గథాభాగం బాకర్ణింపు మట్లు బ్రాహ్మణీజనంబులు శ్రీకృష్ణ పాదదర్శనోత్కంఠా పీడితులై కృశింపుచున్నంత నొక్కనాడు దేవకీనందనుం డనేక బాలక పరివృతుండై గోవుల మేపుచు నిగమార్థ నామంబుగల నల్లిండ్లకుఁ గటంగల కానయందుండు నప్పుడు గోపార్భకులు కృష్ణున కిట్లనిరి. 273

క॥ గోకులమునకు దవీయం
బౌ కానకు వచ్చితిమి మహత్తరమై మ
మ్మాకలి బాధించెను సుగు
ణాకర మృష్టాన్నమిప్పు డవసరముసుమీ. 274

క॥ ఎట్టైన నెచటనైనను
బెట్టింపుము భోనమటులఁ బెట్టనిచో
మా పొట్టలకు సమాధానము
గట్టిగవచియించి కూర్మిఁగావు మనంగన్. 275

వ॥ బలసహితుండగు మాధవుండు సవ్వి బాలకులారా! యిచ్చ
టికి ననతిదూరంబున నొక్క యగ్రహారంబుగల దచ్చోటి
కరిగి యన్నంబడుగుఁడనిన వార లట్లరిగి సౌత్రామణి
యను యాగం బొనర్చుచున్న బ్రాహ్మణులంగని నమస్క
రించి యిట్లనిరి. 276

మ॥ బలరాముండును గృష్ణుఁడల్ల దేవనప్రాంతంబునందుండిమ
మ్ములఁబంపించిరి మీసమీపమున కే మాకుద్భరాక్రాంతచి
త్తులమైవచ్చితిమన్న శాకములు సంతోషంబుతో నిచ్చియా
కలిఁబోగొట్టుడు శీఘ్రమన్న వినిమూర్ఖస్వాంతులై బ్రాహ్మణుల్.

తే. దేశకాలంబులును బురోడాశముఖ ప
దార్థములు ఋత్విజులు మంత్రతంత్రముఖము
లగ్నిధర్మము యజమానుఁ డమ్మురారి
మయములని కానలేక యమ్మాన్యునందు. 278

తే. మనుజభావంబు నేసి లేదనక యన్న
మున్నదని చెప్పకున్న నహో యటంచు
బాలకులు పోయి చెప్ప గోపాలమౌళి
వారలకు నిట్టులనియె సొంపారు నుడుల. 279

తే. అర్థపంచక జ్ఞాన మింతైన లేని
బాడబుల వేడినందున ఫలము లేని
దమ్యె యాచకు లవమాన మందుటరుదె
మైనఁ దద్భార్యలనుఁ గాంచి యడుగఁ బొండు॥ 280

వ. అని యిబ్భంగి బ్రాహ్మణీజనంబుల ననుగ్రహించుచుపొంటె శ్రీకృష్ణుఁడు వచింప నబ్బాలకు లగ్రహారంబు డాయంజని యొక్కచోట గుమిగూడి కృష్ణలీలావిశేషంబులు వర్ణింపుచున్న విప్రాంగనలం గని నమస్కరించి తల్లులారా! యిచ్చటి కనతిదూరంబున నందనందనుండు గోవుల మేపుచుండి మమ్ములఁ బనుప నన్నార్థులమై వచ్చితిమనుటయు నప్పుణ్యాంగన లయ్యమృతోపమానంబగు వాక్యంబులు విని యానందాతిశయంబుచే శరీరంబులు మఱచి యెట్టకేలకుం దెలివొంది యానందాశ్రుపూరితలోచనలై గోపాలార్భకులఁ గూర్చుండఁబెట్టి పరస్పరాలాపంబుల నిట్లనిరి.

సీ॥ గంగాకళిందజా కావేరిముఖసర్వ
నదులొక్కతటివచ్చి కదిసినట్లు
కాశికావంతికా కాంచ్యయోధ్యాదిక్షే
త్రాళులొక్కట నేకమైనయట్లు
శివరాత్రి శ్రీరామనవమి వర్షాదిప
ర్వదినంబు లొకమాఱె వచ్చినట్లు
గృహికొక్కనికి నవగ్రహము లేకాదశ
స్థానమందుండి మేల్తలఁచినట్లు
భాసమానాంగుడ య్యశోదాసుతుండు
మనకుఁ బ్రత్యక్షమై వీరి ననిచినాడు
బువ్వనెపమొకఁ డూనిపూఁబోఁడులార
మన పురాకృతసుకృతమేమనఁగ వచ్చు. 282

సీ॥ అలకాపురముఁ బాసి లలి నేకమైయిట్లు
కవిసివచ్చిన నిధి నవకమనఁగ
సత్యలోకము మాని సరవి నేకాకృతి
వచ్చినశ్రుతిశాస్త్ర వారమనఁగ
వననిధిరోసి చయ్యన నొక్కరూపుతో
వచ్చునానారత్న వారమనఁగఁ
కైలాసమెడఁబాసిలీల నొక్కటిగ వ
చ్చిన లసదణిమాది సిద్ధులనఁగ

నాకవాసమేది యేకమైవచ్చిన
తలఁపుమిన్న వేలిమొదవునిలింప
ధరణిజంబులనఁగ సరసీజనయనుండు
వచ్చినాడు మన నివాసమునకు. 283

సీ. భానుమతీ రావె పంకేరుహాక్షుని
సౌందర్య లావణ్య సరణిఁజూడ
వసుమతీ రావె యా రసికాగ్రగణ్యుఁడౌ
మధుసూదనునితోడ మాటలాడ
భ్రమరాంబ రావె యబ్బాల గోపాలకాం
ఘ్రిద్వయి కొగి గిడిగిండ్లొనర్ప
దుర్గాంబ రావె మాధుర్య వాగ్ఝరిమైన
కనకాంబరుని యనుగ్రహముఁజెంద
రావె సావిత్రి భారతీ రావె చిద్వి
లాసుఁడైనట్టి కృష్ణలీలాప్రభావ

మరయుటకటంచు నొకరి కొకరు వచించు
కొనిరి బ్రాహ్మణ భామినుల్ కూర్మితోడ. 284

సీ. పాడుసంసార మెప్పటికున్న దేగదా
యని నిరసింపవే కనకవల్లి
పసిబిడ్డలొగి నడ్డపడుదు రేమోయని
శంకింపఁబోవకే శ్యామలాంబ
పెనిమిటి దుడ్డుగె కొని మోదుననుచు సం
కోచింప వలదమ్మ కుముదవల్లి
మామగా రెదిరించి తామసించు నటంచుఁ
జాలింపవల దల మేలుమంగ

మానసపట్కమునుండి యేమాన్యుఁగూర్చి
మనము విలపించినామొ యావ్వనజనాభుఁ
డన్నమను నెపమిడి కబురంపినాడు
వాని సేవింపకున్న భవంబులేల. 285

సీ. స్వప్నలబ్ధధనంబు చాడ్పు న మోఘంబు
గానున్న సంపన్ని కరముఁగాంచి
ప్రాయంబురాగానె జాయానుకూలుఁడై
తలిదండ్రి విడుచు నందనులఁగాంచి
రోగిష్ఠి యగు భార్యరోసి వేఱొకదాని
లాలింపఁ దలఁచు వల్లభునిఁగాంచి
దారిద్ర్యమొదవిన తటిఁ దనపేరెత్తఁ
జీకొట్టు చుట్టాల మూఁకఁ గాంచి

సంతసించి పిదప సంతాప మొందుట
కంటెనన్ని దశల గారవించి
యువనియందు భోగమామీఁద శాశ్వతా
నందమిచ్చు కృష్ణునమ్మరాదె. 286

మ॥ మగనిన్ దేవునిఁగాఁదలంచి లలి సన్మానించు నిల్లాలుస్వ
ర్గగతింగాంచియ నేకవర్షములు సౌఖ్యంబొంది పుణ్యంబుమా
యఁగభూలోకమునందుఁబుట్టు హరిపాదాంభోజముల్ నమ్మిపొం
దుఁగదా శాశ్వతముక్తిమంచి ఫలమేదో మీఁరు యోజింపుడీ.

సీ॥ నలిననాభుని మజ్జనమునకై కొనిరండు
హిమవారిమిశ్రిత విమలజలము
వలమురిదారి మేనలఁదుటకై తెండు
సాంకవ కస్తూరి చందనములు
చక్రాయుధుని శిరోజములఁ బూయఁగఁదెండు
పూనూనె కమ్రప్రసబోధనములు
యాదవాధీశుని పాదపూజకుఁదెండు
తులసీ హరిద్రాక్షతలు వరంబు
విలువగల చేలములు దెండు వృష్ణిపతికిఁ
బూలదండలు దెండు గోపాలమణికి
ననుచు విప్రాంగనలు కేశవునిఁదలంచి
పలికిరొక్కరికొకరు సద్భక్తితోడ. 288

సీ॥ తద్దినార్థము నిజ ధామంబుఁ జేరిన
భోక్తలకైన సద్భక్తమిడక

నెటిఁగూఁతు గ్రొత్తకోడటికంబునకుఁబంపఁ
జలిపిన యత్నంబు తలఁచుకొనక
కన్నెనిచ్చెదము నీకన్నపుత్రునకంచు
యాచించు చుట్టాలఁజూచుకొనక
దేవతాపూజకై తెమ్ము పూలని భర్త
వాఁగుచున్నఁదదీయ వాక్కువినక
యెన్నియో గృహకార్యముల్ సున్నసేసి
బ్రాహ్మణీజనులెల్ల గోపాలమౌళి
యందుఁ జిత్తంబు నిలిపి లోకాభిమాన
మును శరీరాభిమానంబు నెనయకైరి. 289

సీ॥ నిద్రవోయెడు మన సిసుఁగు లేద్వకమున్న
చెడునిమిత్తము లెదుర్పడకమున్న
తొయ్యలుల్ మగవారు తుమ్మిచీదకమున్న
బంధువారములు పైఁబడకమున్న
కూటికై ముదుసళ్ళు గోలపెట్టకమున్న
తోలుచూలు దూడల దలకమున్న
నింటికుక్కలు బువ్వకేడ్పించుటకుమున్న
చటులాతపము ముదురుటకుమున్న
నడచిపోదమురండు వెన్నుఁడు ముకుందుఁ
డఖిలలోకేశ్వరుఁడు యాదవాన్వయుండు
నిలిచి యున్నట్టి కోనకోనెలఁతలార
యని ప్రయాణము సేసిర య్యనఘమతులు. 290

వ॥ అని యిట్లు విప్రవధూలలామలు పరస్పరసల్లాపంబులతో
భక్ష్యభోజ్యచోష్య లేహ్యపానీయాది పదార్థంబులు
చితపాత్రల నింపుకొని గోపార్భకులు మార్గంబు సూపిం
పం గృష్ణ సందర్శనార్థ మేగుచుండం దదీయ పతిపుత్ర
సహోదరాదుల త్యంతకోపావిష్టులై యడ్డగించి దండింప
నారంభించిన నబ్భాగవత జనంబు లిట్లనిరి. 291

శా. ఈయాయాసముఁ జెంద నేమిటికి మీ రెబ్భంగి దండించినం
బాయం జూచిన వెళ్లఁగొట్టినను మా ప్రాణంబులే తీసినన్
మీయాజ్ఞల్ గణియింపఁబోము హరిసామీప్యంబునం జేరిత
చ్ఛ్రేయోదాయకుఁ గాంచుదాఁక నితరస్వీకారమర్థింతుమే.

మ. బలవంతంబున నడ్డగించినను యీ పాపిష్ఠకాయంబులే
నిలుచున్ మీకడ జీవముల్ వెడలియా నిర్వాణనాథున్ రమా
నిలయుం జేరు యథార్థ మీ వచనముల్ నిర్జీవదేహంబులా
వలనేమైననుఁ జేసికొండనిన సర్వబ్రాహ్మణుల్ దీనులై.

క. విడిచిన పిమ్మట బాపన
పడఁతుక లక్కడలి కేగు వాహినులగతిం
దడఁబడు నడలం జని హరి
కడ నిల్చి హృదబ్జములు వికాసముఁ జెందన్. 294

సీ. నిగనిగ తలుకారు నీలదేహంబుతోఁ
గళుకులీనుకడాని వలువతోడ
వనమాలతో శిఖావలమేచకంబుతో
గైరికధాతు వర్ణంబుతోడఁ

జిగురుటాకులతోడఁ జెవిఁజెఱుకు నీలోత్ప
లంబుతో మందహాసంబుతోడఁ
దమిఁ గేల నాడించు తామరపువ్వుతోఁ
బ్రక్కను గొలుచు నర్భకునితోడ
నిద్దముల కిక్కయై తమ బుద్ధిలేని
గురుకపోలంబు లొరయు ముంగురులతోడ
ధరణిజ చ్ఛాయఁగూర్చుండి తనదు నంద
నందనునిఁగాంచి రంగనా బృందమెల్ల. 295

సీ॥ లంకలో వెదకి డిల్లపడిన సామీరి
చెలఁగి భూమిజను దర్శించినగతి
సాధ్వసంబున విభీషణుఁడడలుచు నేగి
శ్రీరామవిభుని వీక్షించుమాడ్కిఁ
గపు లాంజనేయుని కతనసంజీవ్యాది
దివ్యౌషధములు ప్రీతిఁగనురీతి
వనజాసనుని వరంబునఁగుబేరుఁడు నవ
సేవధుల్ స్వపురి వీక్షించుపోల్కి
జేరి సిరుపేద ధనము నీక్షించుపగిది
పద్మనేత్రలు గోపాలపతి పదాంబు
జములుగాంచి స్వకీయహస్తములు మోడ్చి
పలికి రిట్లని గంభీర భాషణముల. 296

శా. రామామన్మథ యోగిరంజన సురారాతిచ్ఛటాహార్యసు
త్రామా సంగరభీమ కేశవ పరం ధామా రమాకామినీ

క్షేమస్తోమనిధాన దాన గుణ నిక్షేపా కృపాపూర ని
ష్కామాయాదవవంశవారినిధిరాకాసోమ తుభ్యంనమో

ఆ. అని నమస్కరింప నంభోరుహాక్షుల
నాదరించి సేమమా యటంచుఁ
గుశలమడిగి పిదపఁ గూర్చుండఁ బెట్టిన
వారిజాక్షుతోడ వారలనిరి. 298

మ. మున్నాభీరవధూలలామలు మహామోదంబుతోఁ దెల్పఁగా
విన్నా మెల్లరమున్ భవన్మహిమలా వేళాదిగా నన్యమం
దెన్నండున్ జనకీహృదబ్జములు సిన్నే కోరుచుండంగ నా
సన్నస్థానముఁ జేరఁ బ్రోచితివి నీసౌలభ్యమే పారఁగన్ 299

మ॥ ఉపవాసంబులచేఁ గృశించి సకలోద్యోగంబులన్ మాని య
న్యపదార్థంబులు సూడనొల్లని మదీయాక్షిద్వయంబుల్ భవ
త్కృపచే నేటికి మేలుగాంచిన వినీదివ్యాంగసౌందర్యమున్
విపులప్రాభవలక్షణంబుగనుటన్ వేయేల శ్రేయోనిధీ. 300

ఉ॥ మన్మథ మన్మథుండని సమస్తశరీరులు మోహమొందు నీ
చిన్మయరూపమున్ గుణవిశేషములున్ మహనీయచేష్టలీ
జన్మమునందుఁ జూడఁగల శక్తి లభించునొ లేదొ యంచు మే
మున్మనులై కృశింపఁగఁ దదూహ ఫలింపఁగఁ జేసితచ్యుతా.

సీ॥ ఏభక్తజనునిలో నేవాంఛయున్నదో
యని యెఱింగెదు జ్ఞానివగుటఁ జేసి
తెలిసినప్పుడె వాని కొలలడంచి సుఖంబు
లోగినిచ్చెదు దయాబ్ధివగుటఁ జేసి

దయగల్గినప్పుడెంత పన్నిదమైన నుఁ జేయఁ
దగిన సమర్థుండవగుటఁ జేసి
దాసులకిచ్చెదు తటిఁ దృప్తిలేనిభూ
ర్యౌదార్యసేవధి వగుటఁ జేసి
వచ్చినావుమా నివాసంబునకుఁ గోర్కు
లిచ్చినావు నేడహీనభంగి
వరద తావకీన వాత్సల్య సౌశీల్య
ములు నుతింపఁ దరమె నలువకైన. 302

మ॥ చను శ్రుత్యంతములందుఁ జేయఁగలసంచారంబువర్జించి పా
వనలక్ష్మీకుచకుంకుమాంకిత లసద్వ్యాలభ్యముల్ మానియి
వ్వనభూమింజరియింపవచ్చుటఁగదా వారేయనీపాదముల్
కనిమాకన్నులుధన్యమయ్యెనటులం గాకున్న ప్రాప్తించునే.

మ. తొలిదుగ్ధాంబుధిఁ బాయుటచ్చెగువుగాఁ దోఁచున్ ధరం
బుట్టుటా, వలనాశ్చర్యము మందకుంజనుట గోవర్గంబులన్
మేపి పి, ల్లలతో నాడుటవింత మాకడకు సౌలభ్యంబుతో
వచ్చి బు, వ్వ లలింగోరుట యెంత యున్నిటికిమా వాత్సల్య
మే పాదగున్. 304

సీ. బహుజన్మములకు నుపాయశతములఁ బొం
దఁగరాని నీ దివ్యదర్శనంబు
జప తపో వ్రత దాన స్వాధ్యాయములచేత
నైనఁ జేపడని త్వత్పదమల కరుణ

ఘన యోగిజనులు తాఁకఁగ దుర్లభంబయి
విలసిల్లు భవదీయ విగ్రహంబు
భవవిధి వృష్ణులైనఁ బ్రాపింపరాని నీ
లాలిత్య దివ్యసల్లాపసుఖము
చేసి పొంది తాఁకి వాసిగాననుభవిం
చితిమిగాని యొక్క చింతగలద
దేమియన్న నిత్య మేము నీ సన్నిధి
వదలకుండునట్టి వరమునిమ్ము. 305

మ. చటులద్వంద్వ పరంపరాసహితమై సౌఖ్యచ్ఛటాభావమై
కటువై దుఃఖపరీతమై వితతమై, కన్పట్టు సంసార లం
పటలోఁజిక్కి స్వతంత్రదూరులగు నీభామావరండంబు నీ
పటుకారుణ్యముచేతఁగాక సుఖముం బ్రాపింపఁగా నర్హమే.

శా. సౌలభ్యంబులకిక్కయై ప్రబలవాత్సల్యాలయంబై దయా
వాలంబై స్మితమాధురీ మిళితమై వాల్లభ్య జ్ఞానార్జ వో
ద్వేలంబై విలసిల్లునీవు మముఁ బ్రీతిం బ్రోవలేకున్న నే
లీలన్ సౌఖ్యముఁ జెందనేరము మొఱాలింపంగదే కేశవా.

వ॥ అని యిట్లు బ్రాహ్మణీజనంబు లమోఘభక్తిరసపూరి
తలై శ్రీకృష్ణుని నుతించి భుజింపుమనుటయు నమ్మహా
పురుషుండు భక్తపరాధీనుండుగావున గోపార్భకసహితుం
డై విప్రాంగనాదత్తంబులైన భక్ష్యభోజ్యాది పదార్థంబు
లారగించి తృప్తివహించె నటుపిమ్మట నవ్వధూమణులు
గోవిందునకు నమస్కరించి తదీయ దివ్యమంగళ విగ్ర

హంబు మానసంబులఁ బరిరంభించి దేహేంద్రియ ప్రపంచంబులు మఱచియుండి తెలివొందిన పిమ్మట మాధవుండిట్లనియె. 308

క॥ మీ యిచ్చు సమృద్ధాన్నము
నీయర్భకులెల్లఁదిని మహిత సాహిత్యం
బీ యెడఁగాంచిరి యట్లె మ
దీయాశయ మొందెఁ దృప్తిఁ దెలుపఁగ నేలా. 309

క॥ వచ్చిన కార్యంబాయెనుఁ
దెచ్చిన పాత్రలనుఁ గొనియథేచ్ఛఁ జనుఁడనన్
నొచ్చిన తలఁపులతో నా
సచ్చరితలు పలికిరిట్లు శౌరి కెరఁగుచున్. 310

మ. సకలాశల్ నిరసించి మావిభుల యాజ్ఞల్ దాఁటి వెన్నంటు
న, ర్భకులం గూఁతులనీసడించి వివిధోపాయంబుల న్మాని
మా, మకనిక్షేపమువంచు నొక్కొకతె ప్రేమన్ రాఁగ
బొమ్మంటివే, యకటా! యేమని యిండ్లకేగుదుము డా
యుంజూతురే బందుగుల్ 311

ఆ. జ్ఞాని నాకుఁ బ్రియుడు జ్ఞానికే నత్యంత
ప్రియుఁడనంచు నీవు ప్రీతితో వ
చించినట్టిమాటఁ జెల్లింపవలెనన్న
విని మురారి వల్కె వెలఁదిగమికి. 312

వ. విదుషీమణులారా! మీ భావంబు దెలిసికొంటి శరీరం
బులకు మనోబుద్ధిప్రాణాత్మాంగనాపత్యంబులు నా సంబం

ధంబువల్లనే ప్రియంబు లగుచున్నవి. నేను సర్వాత్మల యందు నంతర్యామినై యుండువాఁడ వారికి స్మృతియు నూహయు జ్ఞానంబును నావల్లనే కలుగుచుండు సూత్రధారి ప్రయత్నంబులేక బొమ్మలు నాట్యమాడనట్లు మదీయావేశంబులేక జీవులొక్క పనినైనం గావింపఁ జాలరు. గనుక మదీయ సాన్నిధ్యంబునకువచ్చినట్టి మిమ్ముల దేవతలైనను మీవారలైననుఁ దిరస్కరింపఁజాలరు. మామకీనాంగ సంగంబున కంటె దూరంబునందుండి మత్కథాశ్రవణ పూజనాదులచేఁ గాలంబు పుచ్చుట లానందకరంబై యుండు మీ రిండ్లకుంబోయి నప్పుడు మీవారు మునుపటికంటె నెక్కువ ప్రీతితో గారవింతు రదియునుంగాక మీపెనిమిటులు మీతోఁ గూడినంగాని మఖంబు సాంతము చేయఁ జాలరు. యిది కర్మభూమి యగుటం జేసికశరీరులు లోక మర్యాదననుసరింప వలయుఁ గావున మీరు సదనస్థలై నిరంతర భక్తియోగంబుననన్ను భజింపుచుండుడు శరీరాంతంబునఁ బరమ పదంబుఁ జేరి పంచోపనిషన్మయ శరీరులై నాతో నిత్యసంబంధంబుఁ బ్రాపింప వచ్చునటు మీఁద మీకు జన్మ జరా మరణ క్షుత్పిపాసాదులు లేవని యనేక విధంబుల నూఱడించిన కృష్ణునకు దండవత్ప్రణామంబు లాచరించి యా సరసిజాక్షులు తిరిగి తిరిగి చూచుచుం జని స్వనివాసంబుల కరుగు నప్పుడు తదీయ భర్తృసుతాదు లత్యంత గౌరవంబుతోఁ జూచిరి వారిలో నొక్క భామామణి మగనిచే నిరోధిం

పడిబడి శ్రీకృష్ణునిం జూడ నైతినే యని దుఃఖించి శరీరంబు
విడిచి మోక్షంబుఁ జెందెనటు పిమ్మట సుఖంబు ముగించి
బ్రాహ్మణు లొక్కచోట సభఁ జేసి పరబ్రహ్మంబు యదు
కులంబునఁ గృష్ణరూపంబుతో నవతరించునని వినియున్న
విషయంబు స్మృతికి వచ్చుటం జేసి పశ్చాత్తాపంబు జెందు
చుండ వారిలో నొక్క పండితుం డిట్లనియె. 313

సీ॥ వల్లించితిమి వేదవారముల్ స్ఫుటముగాఁ
చదువుచుంటి మశేష శాస్త్రములనుఁ
గావించితిమి మహా క్రతువుల నేకంబు
సమకూర్చితిమి శిష్య సంఘములను
బోధించితిమి జనంబులకుఁ బురాణంబు
లార్జించితిమి సూరుల నెడుకీర్తి
జరుపుచుంటిమి సదాచారంబు శౌచంబు
నిలుపుకొంటిమి సత్యమలఘుకీర్తి
దేశికులనంగ నిలనెల్ల దేశములఁ బ్ర
సిద్ధిఁగంటిమిగాని లచ్చిమగఁడైన
నందనందను మహిమఁ గానంగలేక
విఫలమొందితి మేమిందు విప్రులార!

తే॥ వేదవేదాంగ విదుఁడయ్యు విప్రవరుఁడు
విష్ణుదేవుని భక్తి సేవింపఁడేని
జంద నేంధనముల మోచు నైరిభంబు
కరణి నీచాత్ముఁ డగువని కలను నీతి. 315

సీ॥ విష్ణుప్రభావంబు వివరించినందునఁ
గాదె వేదములొందె గౌరవంబు
హరికర్పణముగఁ గ్రియలు సేయుఁడని చెప్పి,
గద ధర్మశాస్త్రములకు నెఁ బ్రసిద్ధిఁ
జక్రిగాథాప్రపంచంబౌటఁ గాదె రా
మాయణాదులుగాంచె నతియశంబు
శౌరిలీలావిశేషము లెంచిగాదె పు
రాణంబులొందె విరాజమహిమ
జలజలోచను తత్త్వంబు జనులకెల్లఁ
దెలిపిగద బ్రాహ్మణులు సర్వదేశములకు
గురువులై పూజఁ జెందిరీ గుట్టు మనమె
ఱింగియునుఁ బొరపడితిమెఱుంగనట్లు. 316

మ. క్రతువుల్చేసినఁ గుండలంబు లిడి ప్రాగల్భ్యంబుతో శా
స్త్ర సం, తతివల్లించిన నన్యవాదుల సభాస్థానంబు. నం
దోర్చినన్, మతిమంతుండని పేరుఁగాంచినను బ్రహ్మత్వంబు
రాఁబోదు శ్రీ, పతినర్చింపని దుష్టబుద్ధికిది మీ భావం
బునందుంచుడీ.

మ. హరిసంబంధము లేనివానికి సదాచారమున్ సత్యముల్
వరశీలంబును శౌచమార్జవము భావప్రౌఢి వైరాగ్య సం
కరచిత్తంబతులాభిజాత్యమును మోక్షంబొందునామీఁదను
స్థిరమై దుఃఖమొసంగునని చెఱఁగు డీ సిద్ధాంత మీవా
క్యముల్ 318

మ. చదువా లేదు విరాగమా యెఱుఁగ రాచారంబులా లేవు
బల్లిదులా కారు స్మృతులెఱింగిరి యుగ్రలీలావతుల్ తెంపుతోఁ
గదియంబోయి మురారి కన్నమిడి, యా తత్కారుణ్యప్రాప్తి కా
మహాభ్యుదయం బొందిరి లేదు గాదె మనకప్పుణ్యాంబ కా
న్యాంబుగాక 319

వ. ఇట్లు బహువిధంబుల విచారించి తత్వం బారసిరి గాని కంసభ
యంబునఁ గృష్ణసందర్శనమునం బొనర్ప నేరరైరి. ప్రార
బ్ధంబును ద్రోసిపుచ్చుట సులభంబుగాదు గదా యని శుక
యోగీంద్రుం డభిమన్యు నందనున కెఱింగించె నంత 320

ఉ. సీరధరానుజన్మ సరసీరుహగంధిసుమాంబకాదర
స్మేరయుతానానాంబుజ వశీకృత సర్వజగచ్ఛయాశ్రితో
ద్ధార సమీరవహ్నిజల ధారుణిపుష్కరనామ పంచకా
ధారకులాద్రి ధీరహిమధామ కులాగ్రణి కేశినాశనా 321

క॥ పరమాత్మ పరమపూరుష
పురాణముని వినుతసుగుణ పూర్ణాశ్రయశ్రీ
కరగంగోద్భవ కారణ
చరణారుణ తరణి తేజ సౌభాగ్యనిధీ. 322

ఇది శ్రీసీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితా ప్రవీణ వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్రరత్నానుసంధాన పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయ దంభోళీ భూత సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ బోధిత విశిష్టాద్వైత రహస్యార్థధురంధర శఠగోపయతిరాడ్వర వరయోగి ప్రభృతి పూర్వాచార్య చరణసరోజ భ్రమరాయమాణ మొవ్వవంశతిలక కృష్ణాంబాకృష్ణార్య తనూజ శ్రీవైష్ణవ విధేయ వేంకటదాస నామధేయప్రణీతంబైన గోపికా విలాసంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

సంపూర్ణము

332

# గోపికావిలాసము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీ కారణ కల్యాణ గు
ణాకరహృదయాంబుజాయురారోగ్యనిధా
నా కుటిలాశర మారణ
నాకావనిజాపహారణ నరసవ్యేష్టా 1

అవధరింపుము 2

వ. పరిక్షిద్భూవరుండు వ్యాసనందనున కిట్లనియె. 3

సీ. హరికథా పీయూష మానుచుండగలేని
చెవులున్న నేమి నశింపనేమి
విష్ణుపూజనముఁ గావింప నేరనిపాణి
యుగమున్న నేమి లేమిఁగననేమి
పుండరీకాక్షునిఁబొగడంగలేని నో
రుండిన నేమి లేకున్న నేమి
వనజనాభునకు వందనము సేయని శిరం
బురువైన నేమి చేటొంద నేమి
శౌరి విగ్రహంబుఁగోరి చూడనికన్ను
లలర నేమి చీకులైన నేమి
యెట్టులైన నొక్కఁడే యనఁదగుఁగాని
వాసిగానరాదు వశివరేణ్య! 4

సీ. నీరేజనయనువర్ణింప నేరనికవి
ప్రబలచాతురి విధవా స్తనములు
దైత్యారి మృదుపద ధ్యానంబొనర్పని
సంయమితపము త్రిశంకుదివము
సుమశరజనకార్పణముగ మనని జనా
ధిపుని ధనంబు కుందేటికొమ్ము
వాసుదేవ ప్రభావముఁ దెలుపని దేశి
కాతిశయంబు వంధ్యాసుతుండు
నైన పగిది మోఘమగుఁగాని సార్థక
మొందలేవుగాన నిందిరేశు
గాథలెల్లఁ దెలుప గదవె నాకింత యో
శుకమునీంద్ర భూరిసుగుణసాంద్ర.

సీ. ఆభాస బాంధవులగువారి నెడబాసి
విష్ణుదాసుల గారవించుదాఁక
భగవద్విముఖుల సంబంధంబు విడనాడి
శ్రీశాశ్రితులను భజించుదాఁక
సంసారి జనుల వాచాప్రసంగము మాని
కృష్ణగాథల నాలకించుదాఁక
శబ్దాదివిషయవాంఛలు విసర్జించి వి
రాగుల సేవచేఁ గ్రాలుదాఁక
విడువ వజ్ఞానదుఃఖముల్ పుడమిలో శ
రీరులకుఁ గాన నమ్మధువైరికథలు
సెప్పి నన్నుఁ గృతార్థునిఁ జేయు మయ్య
మానసీయగుణస్థైర్య మౌనివర్య !

శుకయోగి

మ. బలుశాస్త్రంబులు నేర్చి కోవిదుఁడు శ్రీభామా మనో
నాయకో, జ్జ్వలకల్యాణగుణంబు లారసి ప్రపంచంబందు
విన్పింపగాఁ, దలఁపఁగ శ్రోతలు దుర్లభంబగుటచేతన్
వ్యర్థులైరట్టి వే, ళల నీప్రశ్నము నాకొసంగెను మహా
లాభంబు భూమీశ్వరా! 8

చ. పలుకు లనేకముల్గలవు పల్కెడువారలు వేలు కోటులుం
గలరు జగంబునందున నొకానొక కాలములో మురారి గా
థలు వినిపించువారు ప్రమదంబున నూఁకొనువారు లేరు నీ
పలికిన ప్రశ్నచేత మనబాములు రెండునుధన్యమయ్యెఁబో॥

పరిక్షిత్తు

ఉ. అప్పరమేశ్వరుండు దనుజారి జగన్నిలయుండు మర్త్యుఁడై
యెప్పుగిదిన్ జనించె జనియింప జనించెనుగాక నాలనే
చొప్పునఁగాచె గోపకుల సుందరులందమిఁ బొందెనెట్లు నే
డిప్పను లాలకింపఁదరివించుకగల్గదయా దయామయా. 9

వ॥ బ్రాహ్మణీ జనంబుల ననుగ్రహించిన పిమ్మట గోవిందుఁ
డెట్లు ప్రవర్తించె వచింపుము. 10

శుకయోగి

వ॥ లీలామనుష్యుండైన శ్రీకృష్ణుండు గోవర్ధనోద్ధరణాద్యనేకా
ద్భుత కృత్యంబులు గావించి శరత్కాలంబు ప్రవేశించిన
పిదప నొక్క రాత్రియందుఁ బున్నాగ మహీరుహంబా
రోహించి వేణువొత్తి యొక్క గీతంబు ప్రకటించె నట్టి
యవసరంబున. 11

సీ॥ గాలిమేపరులు దిగ్గనలేచి యూఁడెఁ బూ
హాసంఘము పొంగి ఘూసమసేగ
నల్లాడె నానావిధానోకహంబులు
లోలమై కరఁగె శిలోచ్చయములు
మునిజనంబులు భళీయని తలలూచిరి
లజ్జ గంధర్వ జాలములు గాంచి
రమరీజనుల హాహాయని పరవశులైరి
మేనులు మఱచె వైమానికాళి

సరవి సరిగమ పధనియన్ స్వరచయంబు
స్పష్టమై మ్రోసె శిశుపాళి సంతసించెఁ
బరమపూరుషుఁడైన గోపాలమౌళి
వేణునాదము వేడ్కఁ గావించినపుడు. 12

ఉ. నెమ్ములు కౌశికమ్ములు గణింపఁగరాని బకంబులెల్లఁ గీ
రమ్ములు చక్రవాక భ్రమరమ్ములు కోకిల కాకముల్ మరా
ళమ్ములు చాతకమ్ములు బలాకక రేటు కపోత ఖంజరీ
టమ్ములు సొక్కెఁ గృష్ణుఁడు తటాలునఁ జేసిన వేణు
గీతిచేఁ. 13

మ. శలభంబుల్ గిరికర్ణనాభ కృకలాసంబుల్ లతామూషికా
వళులుం గర్ణజలూకలాఖు ముసలీవారంబులుం బభ్రువుల్
బలుమృత్కీటచుచుంధరీనకులముల్ శ్వానంబులుం మ
త్కుణం | బులు దోమల్ సరఘుచ్చటల్ సొలసె నంభో
జాక్షు గీతంబుచేఁ. 14

మ. ప్లవగంబుల్ పులులున్ మృగాదనములున్ భల్లూకమా
ర్జాల సిం। హావరండంబులు కాసరంబులు వరాహంబుల్
వృకేభాశ్వఖే। రవముల్ శల్యములుం గురంగ శలవారం
బుల్ మురారాతి వే। ణువునం బుట్టిన గీతిచే సొలసె
ధన్యోస్మీతి యంచున్ రహిన్. 15

మ. సలిలం బగ్నియు భూవిహాయస నభస్వంతుల్ దిశాధీశు
లున్। జలధుల్ మేఘము లాపగాతతులు భాస్వంతుండు
చంద్రుండు గ। క్కులు సంధ్యల్ దివసంబులున్ ఋతు
వులుం గాలంబులున్ వత్సముల్। బళిరేయంచు ముదా
ప్తిచే సొలసె గోపాలోగ్రగీతంబుచేన్. 16

సీ. గమకముల్ వెలయు రాగంబు లాలాపించు
సామర్థ్యమెన్ని నిర్జరతపస్వి
లయను గుర్తెఱిఁగి తాళము వేయవలెనన్న
చో నోపలేక గజాననుండు
తానముల్ మూర్ఛనల్ తలఁగని యగ్గీతి
మాధుర్య మరసి కమలభవుండు
నాస్తనమైన గానమున కద్భుతనూత
నాకారమబ్బెఁ జుమ్మనుచు వాణి

చిత్రపుత్రికలట్లు నిల్చిమితిలేని
సంతసంబునఁ బొదలి రజ్జాణలట్టు
లైననన్యుల చంద మేమనఁగవచ్చు
నలినలోచను వంశీ నినాద వేళ. 17

ఉ॥ ఈరసమీ రుచిస్ఫుటము నీస్వరకల్పన మిట్టిమార్దవం
బీరమణీయ మూర్ఛనల హీనపృథగ్విధరాగవర్ధనం
బీరుచిరోరుతానములు, నెన్నఁడెఱుంగమహో యటంచుఁగం
సారిముఖేరితారవము, హోయని మెచ్చిరి దేవతాంగనల్ 18

మ॥ మనవీణల్ మనలాస్యముల్ మనలసన్మాధుర్యయుక్కంఠని
స్వనముల్ చిత్రలయ ప్రమాణములు భా, స్వద్గర్వముల్ రాగమూ
ర్ఛన సామర్థ్యములున్న శించెనఁగియా, సల్మానిగంధర్వులో
య్యనవాలించిరి కృష్ణవేణుజనితంబై యొప్పుగానధ్వనిన్. 19

శా॥ వర్ణింపఁగ నేల వీరలనుచున్, వారంచు వేర్వేర స
మ్యక్కౌతూహల మొప్ప వేణువును దైత్యారాతి వాయింపఁగా
నక్కాలంబున గద్గదస్వరములో, మాంచంబు లేనట్టివాఁ
డొక్కండైనను లేదు భూతగణము, ట్లొందెన్ మహానందమున్ 20

సీ. అట్లుండవలె గానమనుచు వసంతుండు
నానాలతాంతముల్ పైనఁజిమ్మె
బళిరే హారీయని మలయమారుతము స
ల్లని తాఁకుచే వీచె లక్ష్యమడరఁ
గృష్ణా! సెబాసని కీర్తించి వేల్పులు
పూసోన గురిసి రద్భుతము వెలయ
నయ్యారె! యని తారకాధీశుఁ డుప్పొంగి
యమృతబిందువులు సయ్యన స్రవించెఁ
జేసిరిబ్భంగి సన్మానచేష్టలెల్ల
నందనందను వంశీనినదము మెచ్చి

పండితుని విద్యచే మహా ప్రమద మొంది
సరవిఁ గానకళలిచ్చు రసజ్ఞుపోల్కి. 21

పరీక్షిత్తు

వ. యోగిజనాగ్రగణ్యా! యశోదానందనుండు వేణువూఁదునట్టి
కాలంబునందుండి విన్నవారిదే జన్మంబుగదా నావంటి
దౌర్భాగ్యున కది లభింపదయ్యె మీరు నట్టి వంశీనినాద
మాలకించిన వారలేగదా తదుపరి నేమిజరిగెనో విన్న
వింపుడు. 22

శుకయోగి

వ. రాజేంద్రా! నీవువచించినదానియందు సందేహ మేమాత్ర
మును లేదు తదీయాద్భుతం బాకర్ణించి యానందించినం
దున నీవును ధన్యుండవుగదా యది యట్లుండనిమ్ము శ్రీ
కృష్ణుని వేణుగానంబుచే ముల్లోకము లుప్పొంగుచుండ న
మ్మహనీయనాదంబు గోపాలాంగన లాకర్ణించి రయ్యవ
సరంబున. 23

మ. విలుచేనందిగుణస్వనంబులొలయన్ విఖ్యాతపుష్పాశుగా
వళిమాలిన్యములెల్లఁబో దుడిచి భావప్రౌఢి నాభీర భా
మలపై నేసెలలింబరంపరలుగా మారుండు తద్బాధచే
నిలువంజాలక నందనందనుని ధ్యానించెన్ సతీజాలముల్.

ఉ. వింటివె కృష్ణుఁ డిప్పుడు స్రవించిన వేణురవామృతంబు వా
ల్గంటిరో డాసెనే హృదయకంజము వెన్నునిలాంతికార్యముల్

వెంట నెత్రో చిపుచ్చి యదువీరునిఁ జేరు తలంపులోనఁ గై
కొంటివె యంచు వాకొనిరి కూరిమి నొక్కరి కొక్కరా సతుల్

శా. మారుండి త్తటి నేయు నమ్ములకుఁ దా ర్మాత్రైతి సంగంబుల
య్యారేడ స్సెమనస్సరోజములు డీలం దెంగ దాయీవ్యథా
భారంబుం దోలఁగింపలేని యలతిం బ్రార్థింపఁగా నేల దై
త్యారింగృష్ణునిఁ బొందినట్లయిన సంతాపంబు నాశంబగున్.

వ. అని వచింపుచు. 27

సీ. చనుఁబ్రాలు ద్రాఘు బిడ్డను ద్రోసి యొక్కర్తు
కుడిచెడు బోనంబు విడిచి యొకతె
విభుని శుశ్రూష వే విడనాడి యొకచాన
పాలుకాఁగిన నుడింపకొకలేమ
కదుపుకుడువనాఁకఁ బిడుకమాని యొకర్తు
నుద్ధానమందన్నముంచి యొకతె
స్నాన మొనర్చి వస్త్రముఁ దాల్చుచు నొకర్తు
నత్తమామలయాజ్ఞ నడచి యొకతె
వెండియు ననేకవిధముల వేనవేల
గోపికలు మన్మథార్తిచే కూడఁ గృష్ణ
కృష్ణయను వాక్యములచేతఁ గృష్ణుఁడుండు
వనికిఁ జని రంబునిధికిఁ బోవు నదులట్లు. 28

సీ॥ బడిఁ గాళ్ళబందాలు పడెడు పుట్టములతోఁ
గరఁగిపాఱెడు తిలకములతోడఁ

బలుమాఱు తడఁబడు పాదాంబుజములతో
సరసిఁదుంపెసలాడు కురులతోడ
రహిఁబుట్టుచుండు శిరఃకంపములతోడఁ
బ్రమదాశ్రుయుక్తనేత్రములతోడఁ
గంచుకంబులు వ్రక్కలించు కుచములతోఁ
బ్రబలమై తగు గగుర్పాటుతోడఁ
దలఁచి చెప్పంగరాని యుత్కంఠతోడ
క్షణము నొక్కెడ నిలువని శ్రద్ధతోడ
వల్లవాంగన లరిగి సంపుల్లపద్మ
నేత్రుఁ గాంచిరి నిరుపేద నిధినిఁ బోలె. 29

సీ॥ అలసప్తకోటి మంత్రార్థమో వేదవే
దాంగాదిసార నీరాకరంబో
స్మృతిరహస్యము లేక యితిహాసతత్త్వమో
నానాప్రబంధస్థ నవ్యరసమొ
సంగీతసాహితీస్థానమో సత్పుణ్య
రాశియో భూరి వైరాగ్యసుఖమొ
కవితావిలాసనికాయ్యమో యష్టాద
శపురాణసిద్ధ విస్తారఫలమొ

పారికాంక్షిజన తపఃఫలంబో నిలింప
భాగ్యరాశియో శుభముల తావో
యనఁగ నొప్పుచున్న వనజాక్షు నానంద
సుతునిఁ గనిరి గోపసుదతులెల్ల. 30

సీ. లక్ష్మీకటాక్ష విలాస నివాసమో
బలశక్తి సత్యసంపదల ప్రాపొ
లావణ్యజ్ఞాన సౌలభ్యనిధానమో
పురుషార్థచయ హేతుభూతగృహము
ప్రబలాయురారోగ్య భద్రచాతుర్య ధై
ర్య స్థైర్య శౌర్య వీర్యాలయంబొ
కారుణ్య తారుణ్య గాంభీర్యవాత్సల్య
మార్దవౌదార్య సామ్యనిలయంబొ
మధురి మార్జవ తేజస్సముగ్రవారి
రాశియో యన విలసిల్లు శ్రీశుఁ గృష్ణు
నఖిలలోకాధినాథు మహానుభావుఁ
గనిరి ముదమున గోపాలకాంతలెల్ల. 31

సీ. కోటిమన్మథు లొక్కచోట నేకీభవిం
పఁగఁదోఁచు సౌందర్య పటలమనఁగఁ
గవికృతగ్రంథసంగతిమాని మూర్తిభ
వించిన చాతురీ విభవమనఁగ
బ్రహ్మవేత్తల మనఃపద్మముల్ వెడలి రూ
పముఁగాంచు జ్ఞానసంపదయనంగ
భాన్వగ్ని చంద్రాది భాస్వంతులనురోసి
మేనొందు తేజస్సమితి యనంగ
సూనములు మొదలైన వస్తువులమాని
రాశియైతోఁచు వివిధ సౌరభ్యమనఁగ

వెలయు కృష్ణుని వేదాంతవేద్యు నాద్యుఁ
గనిరి గొల్లెత లతుల కలవరుదీఱ. 32

ఉ. కొప్పులువీడిపోవ నడుగుల్ వడిఁ ద్రొట్టువడంగమార్గముల్
తప్పఁగ రాత్రికాలమునఁ దారొకచోని చెమ్మటమేసి లీవలం
దుప్పతిలంగ నచ్చెలువ లుబ్బునవచ్చిన కస్తిదీరఁగా
నప్పరమేశ్వరుండు కుజమందుఁ గనంబడి వారికిట్లనున్. 33

శ్రీకృష్ణుఁడు

మ. ఇది కాంతారము కాలమా రజని మీ రిందీవరాక్షుల్
గదా । పదము ల్ద్రొట్టుపడంగ వచ్చితిరి సంబంధుల్
పతుల్ పుత్రులున్ । మదిలో మెత్తురె నేనుపూరుషుఁడ
మీమర్యాద నాకీర్తి క్రమం । గదె యీ సాహస మెట్లొ
నర్చితిరి సౌఖ్యంబిచ్చునే యీపనుల్. 34

క. వచ్చినపని వివరింపుడు
విచ్చేయుఁడు మీరు మీమీ వేశమ్ములకుం
జెచ్చెర స్వీయజనంబుల
మచ్చిక నార్జించుకొనుఁడు మానినులారా. 35

మ. పతిశుశ్రూషలు సేయుఁ డాత్మజులకుం బాలిండ్లు కూఁతుం
డ్రప । మ్మతి లాలింపుడు మామకత్తలను సన్మానంబు
గావింపుడీ । పితుమండ్రావుల నెల్లబంధుజనులం బ్రేమింపు డీ
కార్యముల్ । సతతంబై తనరారు లేములకు శాస్త్రంబిట్లె
ఘోషించెడున్. 36

గోపికలు

వ॥ తమలో నాహా! చిరకాలమునుండి యుష్మన్మహానుభావుండు
మన వాంఛలు నెఱవేర్చునని నమ్మి యున్నందులకు నిరా
శావకాశంబులైన వాక్యంబులచే ధిక్కరింపుచున్నాడు
మన ప్రారబ్ధంబని యెన్నవచ్చు నైనను గొంతసంభాషించి
చూతము. 37

ఉ॥ మంచిదనంగ నెద్ది చెడుమార్గమనంగ వచింపుమెట్టిదో
యంచు బలాత్కరింపనిటు, లాడుటధర్మముగాని మేముభా
షించకమున్న శాస్త్రవిధిఁ, జెప్పఁదలంచెద వెందుకయ్య మే
లెంచఁగదయ్య కోర్కులు ఫలింపఁగఁ జేయఁగదయ్య కేశవా!

శ్రీకృష్ణుఁడు

మీరు వచ్చినకార్యం బెఱింగింపుడు. 39

గోపికలు

చ॥ తెలియనిదించుకైనఁ గల, దే మఱి సర్వజగంబులందునం
గలవిషయంబు లారసెదు, కర్తవు మమ్మడుగంగ నేలమా
వలన నెఱుంగఁబూనియిటు, నాకొని తేనివచింతుమింపుగాఁ
దలఁచివినంగదయ్య సవ, తామరసాక్ష వధూసుమాంబకా!

మ॥ మాలోఁ గొందఱు కన్యకామణులు స, మ్యగ్భక్తిసంయుక్తలై
కాళింగూర్చి వ్రతంబొనర్చి వరముం, గాంక్షింప నద్దేవిగో
పాలుండే విభుఁడౌను మీకనియె న, వ్వాక్యానుసారంబుగా
జేలంబుల్గొను వేళఁ బల్కితట నేఁ, జేకొందునంచున్ రహిన్.

ఉ. ఇందఱితోడ నీవు వచియింపకపోయినఁ గొంతమందితో
ముందఱఁ జెప్పియుంటిఁగద మోహముఁదీర్తు శరత్సమా
గమం । బందునటంచు డాసెనది యాఱసిపుచ్చక ప్రోవు
మయ్య గో । విందముకుంద నందకులవిస్తృతవారిధి
పూర్ణచంద్రమా. 42

శా. మా కన్నుల్ నినుఁజూడ మా శ్రవణయుగ్మంబుల్ భవద్గా
థలే । యాకర్ణింపఁగ మా కరాంబుజము లీహాపూర్తిఁ గొం
గింట ని । న్నాకర్షింపఁ దలంచుచున్నవి సమస్తాక్షంబులున్
నీపనుల్ । కాకే కార్యములందునంజనవు మా కామాగ్నిఁ
జల్లార్పుమా. 43

ఉ. నీయుపగూహనంబుఁగని నీకరముల్చనులందు మోపియున్
నీయధరంబులాని కమనీయ కపోలయుగంబు నొక్కుచున్
నీయనురాగమొంది మహనీయ సుమాంబకకేళిఁ దేల
మా । కాయములున్న సార్థకము కన్పడుగాకటుగామి
నేటికిన్. 44

వ. రసికజనాగ్రగణ్యా ! పూర్వకర్మానుసారంబుగా దేహసం
బంధులై సంసారవర్ధకులగు పతిపుత్రాదుల సన్మానించుట
ధర్మంబనియు నిరుపాధిక బంధుండగు నిన్నుఁ బ్రేమించుట
సమంజసంబుగాదనియుఁ బల్కెడి విధి విపరీతంబుగానున్న
దెందుకంటివేని. 45

సీ॥ వెనువెంట నమ్మివచ్చిన దమయంతిని
విడిచి పోవఁడె నలుం డడవిలోన

నన్యులకును దాసియగు నట్టులమ్మడే
చంద్రమతిని హరిశ్చంద్రనృపతి
యొప్పులు మాని తపోవృత్తిఁ జెన్నిజాయను
దండింపఁడే జమదగ్నిమౌని
దనుజుని బాధచేఁ దల్లడిల్లినభార్య
నోగిఁగావఁ జాలెనే భృగుమహర్షి
తమ్ముఁనమ్మియున్న దారలఁ బ్రోవంగ
నోపినారె పతులహా! పరాత్ప
రుండుగాదె ప్రోచె రూపింప నప్పరా
త్పరుఁడవీవకావె పద్మనాభ. 46

మ॥ పతులున్ మామలు నత్తలాత్మజులు సంబంధుల్ మహా
ప్రీతిసం। స్తుతిఁగావింతురు దేహపాటవముచే, శోభిల్లి
శుశ్రూష మే। మతిమోదంబునఁ జేయునప్పుడు తదీ,
యారోగ్యముంబాయుచో। మతిలోనెన్నరు మాయదం
తమిది సామాన్యంబుగాదే భువిన్. 47

మ॥ అలవంధ్యాతనయుండు స్వప్నమునఁ బెల్లెత్తోఁచు ద్రవ్యం
బు వ్యోమలతాంతంబును నెండమావులుగదా, మాలిన్య
సంసార మం। దలి భోగంబులు చాలుఁజాలునిఁక నీ,
దాసీలమైయున్న మ। మ్మలఘుప్రేమను స్వీకరింపు మురు
పు, ణ్యాంబుజ్జబాణేశ్వరా. 48

మ॥ వ్రణముల్ పుట్టునో పెళ్ళునన్ విఱుగునో, వ్యాధుల్
ప్రవేశించునో। ఫణి కాటందునోయంచు డీలుపడు మా'

వాపిష్ఠియంగంబులం | దనుమాత్రంబనుకంప యుంచి
భవదీ, యాంగంబుచేఁ దాఁకినఁ | క్షణకాలంబున
సాధ్వసంబడఁగునా, చందంబుఁ గావింపుమా. 49

ఉ. తంటలుమానెనంచుఁ బ్రమదంబున నీదరిజేరినట్టి మ
మ్మింటికిఁబొండటంచు వచియించిన నీనుడులాలకింపఁ జేఁ
గంటినిఁ దాఁకినట్టుల సెగల్ పొగలుబ్బెను మేనులందుఁజే
నంటితివేని వేమరల హాయిజనించును ప్రాణనాయకా. 50

మ. నిజబంధుల్ విడనాడిపోయిననుఁ బోనీ రాజుకోపింప హా
ని జనింపన్ జనియింపనీ పరులు బల్ నిందింప నిందింపనీ
సుజనంబుల్కుజనంబులొక్కటిగ సంక్షోభింపనీ నీపదాం
బుజరక్తిన్ విడనాడలేము కరుణం బ్రోవంగదే కేశవా.

ఉ. నీవిట నుద్భవంబగుట, నీరజగర్భుఁ డెఱింగి మమ్ము ని
త్తావునఁ బుట్టఁజేసె హరితత్పరలై సుఖమొందుఁడంచు
వాఁ | డావగఁ జేయకున్న నిటులందఱుమానిను లొక్క
రీతి నీ | పై వలపొందనేల నినుఁబాసినఁ జత్తుమనంగ
నేటికిన్. 52

ఉ. ఒల్లను మిమ్మటంచు దృఢమొప్పగఁ బల్కితి వేనిఁ జాలు
మే | మెల్లర మొక్కపెట్ట నిపుడే తనువుల్ విడనాడి
చత్తుమీ | పల్లవపాణులీలిగిన పాపము రేఁగి యదభ్రమై
నినుం | దల్లడమొందఁజేయు నిది తప్పదు చూడుము ప్రాణ
నాయకా. 53

మ. మిము నేరమ్మనలేదు మాటికిని సమ్మించంగలేదెప్డు మీ
స్వముఁ గైకొన్నదిలేదు పొమ్మనెదవా స్వామీ! భవద్దివ్య
దే । హాము సౌందర్యవిలాసముల్ గమనముల్ హాసంబు
వేసంబు మోసముసర్చెన్నను సర్వకాలములనాసల్ మాన్ప
ప్రాణేశ్వరా. 54

వ. ఇట్లనేకవిధంబులఁ బ్రలాపించుచున్న గోపవధూమణుల
దృఢాధ్యవసాయంబునకు మెచ్చి భక్తపరాధీనుండైన
శ్రీకృష్ణుం డవనీరుహాం బవరోహించి వల్లవాంగనల డాసి
యిట్లనియె. 55

క. శుద్ధస్ఫటికము లట్లు ప్ర
సిద్ధములై యుష్మదీయ చిత్తంబులు న
న్నుద్ధురభక్తిం గొలుచుట
బద్ధుఁడనైనాడ నిపుడు భామినులారా. 56

ఉ. కూరిమితోడఁ గొల్చి మదిఁ గోరినవారల కెద్దియైన వి
స్తారముగా నొసంగెద వదాన్యతలో ననుఁబోల రెవ్వ రం
భోరుహపాణులార! మిముఁ బూర్ణకృపాంబుధి నోలలార్చి సం
సార భయంబువాపెదను సత్యము సందియ మొందఁ బోకుఁడీ.

చ. కురిసెడు వానజల్లులకుఁ గొంచెము చంచలమొందకుండు భూ
ధరములరీతి మీహృదయ తామరసంబులు కొంకవయ్యె నే
బొరిఁ బొరినాడు మాటలకుఁ బొంగితి మీ మహనీయభక్తిచే
నరుసముఁ జెందుఁడీ సుమశరాసన బాధఁ దొలంగఁ జేసెదన్

గోపికలు

చ. పురుషుఁడవైన నీవె పరిపూర్ణకృపానిధివైన నీవె సు
స్థిరమతివైన నీవె విను, తించెడువారి మనోనుసారియా

వరదుఁడవీవె శక్తిగలవాఁడవు నీవెగదయ్య దానిచే
స్మరశరతాడితాంగనలఁ, జయ్యనఁబోఁ ప్రపుము ప్రాణ
నాయకా. 59

ఉ॥ అగ్గినిడాయువాని చలి, యప్పుడె తీరినభంగి జాహ్నవిన్
దగ్గఱినీరుఁ గ్రోలు నరు, దాహముమాసిన భంగి నిన్నుఁగే
లొగ్గిభజించువారు సుఖ, మొందుటలబ్బముగాదుగానమా
యొగ్గులు ప్రగ్గఁజేసి రమియింపుమడంపుముమన్మథవ్యథన్

వ॥ ఇట్లు కొంతసేపు పరస్పర సల్లాపంబులచేఁ ప్రొద్దుపుచ్చి
తదుపరి శ్రీకృష్ణుం డింద్రియస్ఖలనంబు గానీయక వల్లవీ
జనంబులతో రమించె. 61

సీ॥ తనచుంబనములచేఁ దనియించి వారి చుం
బనములచేఁ దాను తనివిఁజెంది
పరిహాస వచనముల్ పచరించి వారల
పరియాచకములచేఁ గరముఁబొంగి
దంతక్షతములు జెందఁగఁజేసి వారిదం
తక్షతంబులచే ముదంబుఁగాంచి
మించిచందురు కూనలుంచి వారొనరించు
చందురు కూనలా సక్తిఁదాల్చి
స్వీయపరిరంభ సుఖమిచ్చి చెలఁగివార
లిచ్చుపరిరంభములచేత నింపుఁగాంచి
వల్లవీజనములనువ్యవాయ కేళి
చేతనుబ్బించెఁ బూతనా ఘాతుకుండు. 62

సీ. రసికాగ్రగణ్యుఁడౌ రామానుజుండొక్క
రమణీమణికిఁ బరిరంభమిచ్చి
సౌందర్యనిధియైన సరసిజాక్షుండొక్క
కమలగంధికిఁ గపోలములొసంగి
నవరసస్థానమౌ నందనందనుఁ డొక్క
పీవర స్తనికిఁ గెమ్మోవులొసఁగి
లావణ్యఖాని యా దేవకీసుతుఁడొక్క
లలనకు సూక్ష్మావలగ్నమిచ్చి
సౌకుమార్యవార్ధి యాశౌరి వేల్పొక్క
కంబుకంఠికొగి నురంబొసంగి
నిర్మలానుకంప నిధువనకేళిఁ దే
లించె మందలోని మించుబోండ్ల. 61

సీ. సూర్యచంద్రులకైనఁ జొరరాక సాంద్రమై
తీపారు ద్రాక్షపందిళ్ళయందు
సౌరభ్య మెల్లదిశల నిండఁగాఁ జేయు
నిరుపమ పుష్పమంజరుల నడుమ
నానావిధాఖ్యాప్రధానంబులై యొప్పు
రమణీయ వ్రతతీ గృహములలోన
ఫలపుష్ప మకరంద పల్లవాస్పదములై
తనరారు సాల సంతతుల చెంతఁ
గమలకల్హార కుముద కోకనద విమల
జీవనోపేతమైన సరోవరములఁ

జెలఁగి క్రీడించె వల్లవాబలలతోడ
సారసాక్షుండు జగము లాశ్చర్యమొంద. 64

సీ. పల్లవంబులుదీసి మల్లెపూవులుఁగోసి
కొల్లగా నెమ్మేనఁ జల్లి చల్లి
కవిసి సారెకుమెచ్చి వివిధ ఫలములిచ్చి
చవిఁజూడుమని నతుల్ సలిపి చలిపి
కురులు చిక్కులుధీసి కూర్మి నూసియుఁబూసి
యాచించి మరల మూచూచి చూచి
చిబుకంబు సవరించి చెక్కులఁ గేలుంచి
పెక్కుమాటలు బాళినొక్కి నొక్కి

బాంధవంబుఁ దెల్పి పలుకులు నెలకొల్పి
భక్తినూని లాఁతిరక్తిమాని
గొల్లెతలు మురారిఁగూడి నిరాబారి
కౌగలఁబోలి కీరితిఁగనిరోలి. 65

సీ. గజనిమ్మపండిచ్చు కనకాంగిఁబట్టి నీ
స్తనమిమ్ము దీనితో నెనయునేమొ
దానిమ్మపండిచ్చు తరళాక్షిఁగని నీయ
ధరమిమ్ము దీనితోఁ దొరయునేమొ
సంపెంగనవలిచ్చు సతిఁగని నీమేవ
లపునిమ్ము దీనిఁ బోలఁగలదేమొ
పూదండలిచ్చు పూఁబోడినిఁగని నీక
రముఁ దెమ్ము దీని తుల్యమగునేమొ

యనుచు వసుదేవసూనుఁ డాయాతురంగ
లోచనలతోడ సల్లాపమాచరించి
మించి మన్మథకేళిఁ దేలించి పరవ
శలనుగావించె వినుతింప సాధ్యమగునె. 66

సీ. నన యెత్తునకు మాఱుఁగొనుము దీనినటంచు
జే మెడమీఁద వైచి యొకలేమ
ముకురంబునకు నుద్ది మొనసి చేకొనుమంచుఁ
జెక్కు చెక్కునమోపి యొక్కనాతి
సితకుమాఱట దీని ధృతినానుమని చెప్పి
బింబాధరంబు లర్పించి యొకతె
భర్మకుంభములకుఁ బ్రతిగ దీనిఁగ్రహింపు
మని చాచులిచ్చి యొక్కనళినాక్షి
నందనందన నిన్ను మిన్నందఁజేసె
దను సుమీయని నడుమిచ్చియు నొకనారి
బహుమతులొసంగి కృష్ణుని బాళిమీఱఁ
బూజఁజేసిరి గొల్ల పూఁబోఁడులెల్ల. 67

క. ఒక్కొక్క పద్మగంధికి
నొక్కొక్కండై నందసూనుఁ డుత్సాహముతోఁ
బ్రక్కల నిలిచిన కతమున
మక్కువలాలించి రొక్కమాఱవ్వనితల్. 68

ఆ. దేనియందు మనము లీనమౌ దానియం
దఖిలసంఘమెల్ల నంటియుండుఁ

గాన చానగముల మానసంబులు కృష్ణు
నందు నుంట నింద్రియంబులుండె. 69

శా. ఆకాత్యాయనిఁ గొల్చినట్టి సుకృతం బత్యంతసాఫల్యమై
మాకానందముఁగల్గఁ జేయుటకురామాపుష్పకోదండుఁడౌ
శ్రీకృష్ణుంగొని తెచ్చియిచ్చెనిఁక దాసీవృత్తి నీయుత్తమ
శ్లోకుంగొల్చెద మెల్లకాలమితరాలోకంబు మాకేటికిఁ.

క. అని చెప్పి తేనెటీగలు
మునుకొని బలు తేనెపెరకుమూఁగిన శేవన్
వనజాతలోచనునిఁ జ
య్యనఁ బరివేష్టించి రంగనావళులెల్లన్. 71

వ. ఇవ్విధంబునం బరివేష్టించి గోపాలవరారోహలుసాముద్రిక
శాస్త్రానుసారసౌందర్య సంయుతంబుగాఁ బ్రకాశించు
కృష్ణుని సర్వాంగస్పర్శచే నుద్భవించిన యానందంబు
భరింపలేక యతివృష్టిచే సస్యంబు నశించునట్లుప్రాణం
బులు విడువనున్న సమయంబున సర్వభూతాంతర్వర్తి
యగు నప్పురుషోత్తముం డున్నట్లుండి యదృశ్యుండయ్యె
నటుపిమ్మటనయ్యువతీజనంబులుడోలాయమానమానసలై

చ. ఎనయు తపఃఫలంబు నశియింపఁ గృశించు తపస్విభంగి జీ
వనధనమెల్లబోవ బలువంతలుగాంచు గృహస్థుపోల్కి నెం
డిన సలిలాశయంబున వటించు విసారముగీతి వల్లవీ। జన
ములు కృష్ణునింగనక చయ్యన నేడ్చిరి దీనవర్తులై. 73

ఉ. ఎన్నియొ నాళ్ళనుండి మనమిందఱముఁ మహనీయదాన
సం। పన్నలమై తపంబులు జపంబులొనర్చి తదీయపుణ్య

మా । సన్నముగాఁగఁ గృష్ణుఁడు వశంబయినాడని పొంగు
చుండ నా । పున్నెపుఁదిట్ట యేదెసకుఁ బోయెనో యేమి
యొనరు మక్కటా. 74

చ. వనజదళేక్షణుండు మన వామల నెల్ల బహూకరించి చే
సినపను లెల్ల నిక్కముయి నీ కలయో యని శంక సేయఁగాఁ
గనఁబడుచుండె నాతని నఖక్షతములు ల్వలు కెంపులెట్లు కా
దనఁదగునో నటంచు నెటులాఁడదగుల్ హరిలేమి నక్కటా.

ఉ. చేరువయైన జాహ్నవి వశీకృతసేవధి సొంతదొడ్డిలోఁ
జేరిన నీవులావు తనచేతికినందు తలంపు మిన్నగా
నారసి శౌరిఁగూడి మనమందఱముల్ సుఖమందుచుండనే
తీరున నమ్మహామహుఁడదృశ్యతఁ జెందెను వాయమేమిఁకన్.

క. ఆయేడె మహైశ్వర్యం
బాయేటనె భిక్షమెత్తుటన్నట్టులయో
యీ యామని హరిఁ బొందుట
లీ యామినిలోనె యతని నేదుటగలిగెన్. 77

ఉ॥ పోయినరత్నజాలములు పోయినభూములనేకరూప కా
దాయములెల్లఁ గూర్తురు గ, దా మనుజావళి దైవదత్తస్వీ
యాయువుపోయెనేని గడి, యైన గడింపఁగ వీలు జిక్కదు
ట్లీయదునాథుఁ గానక క్షు, యించిన కాలము రాదిఁ కెట్టులో

సీ॥ ఖద్యోతముల భంగిఁ గనుపట్టు జీవుల
కింపుగా దేహంబు లిచ్చువేళఁ
దల్లిగర్భమున వంతఁ గను పిండంబుల
కవకాశమిచ్చి కాపాడువేళ

లలి జీవనస్థితిఁ దెలియనిబాలక
పితతులఁ బాలుద్రావించు వేళ
మేతాలుపులు నిద్రచేత విస్మృతిజెందఁ
జెలుపు లేకుండ రక్షించు వేళఁ
పంచభూతములను సృజియించు వేళ
నీకుఁ గలిగిన దయ మానినీచయంబు
లందు నెబ్భంగి శుష్కించె నందపుత్ర
ధీరజనవారసన్నుతాధారసుగుణ ! 79

సీ॥ సమయోచితముగ వర్షములెల్ల భూముల
యందుండఁ జేసి సస్యములు పెంచి
తారకాదిత్యాగ్ని తారకాధిపకాంతి
చే వస్తువులు ప్రకాశింపఁ జేసి
వరగలు సజ్జలు వడ్లురాగులుజొన్న
లాదియౌ ధాన్యంబు లమరఁ జేసి
హరిమంథకకుళుద్ధవరమాషముద్గాఢ
కముకదాళీ పదార్థములొసంగి
చవులుగల్పించు వివిధశిగ్రుఫలకోటమఁ
గాయలాకులు దుంపలు గలుగఁ జేసి
దేహధారులఁ బ్రోచు నీదివ్యకరుణ
స్త్రీజనంబులమీఁద శుష్కించె నెట్లు. 80

సీ. ఒక్కనాడైన నిన్నూహింపఁ గాలేని
మూఢుల నైశ్వర్యము నొనఁగూర్చి

సర్వేశ్వరుఁడు లేడు సత్యంబు లేదని
రొద సేయువారి కారోగ్యమిచ్చి
నీయాజ్ఞయగు శాస్త్రవితరంబు నిందించు
నట్టిదుష్టులకు దీర్ఘాయువొసఁగి
నీదాసజనులను ఖేదింపఁజేయు దు
ర్బుద్ధులకుఁ గుటుంబవృద్ధిఁ జేసి
కించిదీర్ష్యయు లేక బోషించుచున్న
నీవు సర్వంబు విడిచి ధ్యానింపుచున్న
పడఁతి కూటువ నెల్లెడఁబాసినావా
శ్రీవధూచిత్తచోర! కృష్ణావతార! 81

సీ. మొసలిచే బహుళాబ్దములు గాసిఁ జెందిన
స్తంబేరమాధీశుఁ దాల్మి నేలి
పినతల్లి దుర్వాక్యమున ఖేదమొందు నౌ
త్తానపాదికిఁ బ్రభుత్వం బొసంగి
ఖలుఁడైన గాంగేయ కశిపుచే వ్యథఁగన్న
మాణవకునకు సమ్మద మొసంగి
దుష్టాగ్రజునిచేత దుఃఖమొందిన విభీ
షణున కమోఘరాజ్యం బొసంగి
వాలిని వధించి రేకంటుచూలి నేలి
కీర్తిఁ గాంచిన నీవు మాయార్తిఁ దూలు
మమ్ముఁ బ్రోవకయున్న భూమండలమున
నిందఁ బొందెదవయ్య గోవింద! కృష్ణ! 82

ఉ. సన్నపుగోడమీఁదఁ బోడసూపెడు కాటుకగీటుపోల్కి వి
ద్వన్నుతుఁడైన వానియెడఁ, దప్పొనరించినఁగన్పడుం బ్రథా
స్కన్నని పైజలస్థలిపి, చాడ్పునఁదోఁపదు నీవు కీర్తి సం
పన్నుఁడవేము హీనల మపాయము కెవ్వరికో జనార్దనా.

ఉ॥ జీవుల మేము గావున నశేషభవంబులలోఁ బరాభవం
బేవగనైనఁ బొందితిమి, యిప్పుడు పొందిన తప్పలేదు లో
కావళిచే యశంబుఁగని నట్టి మహాపురుషుండవౌట ని
త్తావుననింద లేల ప్రమ, దాజనులన్ దయజూడు మచ్యుతా.

వ॥ అని బహువిధంబులఁ బ్రలాపించి ఫలంబు గానక బృందా
వనమహీరుహంబులఁ జరింపుచు నాభీరపురంధ్రులిట్లనిరి. 85

గోపికలు బృందావనంబున వెదకుట.

సీ॥ కంటిరే జంబీర కందరాలములార
పాలితసాధు మా ప్రాణనాథుఁ
జూచితిరె కపిత్థచూతనింబములార
పున్నెంపుఖని మా వన్నెకాని
పరికించితిరె సప్తపర్ణజంబువులార
దేవకీసుతుని సుధీవినుతుని
వీక్షించితిరె కరవీరసాలములార
పాపసంహారు రూపజితమారు

ననుచు విభ్రాంతమానసలై మురారి
నామముల నుచ్చరించి నానామహీరు
హముల నడుగుచు రేయి విహారమోలి
సల్పి రాభీరమానినీచయము లెల్ల. 86

సీ॥ తనమేనివంటి వాసనఁ గైకొనుటమిమ్ము
దాసెనేచందనతరువులార
తనతల నెనయు నీ ఘనశలాటువులంచుఁ
బొడసూపెనే మీకుఁ బొన్నలార
తన మేనిరంగుతో నెనయైతిరని మిమ్ము
లనుఁ జేరెనే తమాలంబులార
తన చిబుకంబుఁబోలిన పండ్లుగలవని
మిముఁ జేరెనే వటద్రుమములార

తన గుణములఁబోలు ఘన ఫలాక్తములంచు
దాసినాఁడె మిమ్ము ద్రాక్షలార
నందపుత్రుఁడనుచు బృందావనమునఁ జ
రించి యడిగి రెల్లమించుబోండ్లు. 8

సీ. మీపుష్పములకు నీడౌ పల్వరుసవాని
మధువైరిఁ గంటిరే మల్లెలార
మీననలకు సాటియౌ నాసవాని గో
పాలుఁ జూచితిరె చంపకములార
మీతావికుద్దియౌ మేతావిగలవాని
హరినిఁ గంటిరె పాటలాద్రులార
మీనునువిరుల దీటౌ నఖంబులవాని
మురవైరిఁ గంటిరే మొగళులార

మీలతాంతములనుఁబోలు మోవులవానిఁ
గంటిరేమొ రక్తకంబులార

యనుచు నార్తితో విహారంబుసల్పి ర
మ్మందయానలెల్ల బృందయందు.

సీ. కుంజరావళులార కూర్మితో యాదవ
కుంజరు విధమెఱుంగుదురె చూచి
సింహసంఘములార సింహావలగ్ను నృ
సింహు నెందైన వీక్షించినారె
శార్దూలతతులార చర్చించి పూరుష
శార్దూలుఁ గంటిరే చక్రధరుని
ఘోణీచయములార కోమలాంగుని యజ్ఞ
ఘోణినిగంటిరే కోర్కిదీర

ననుచుఁ బలుమాఱు నానావిధాహ్వయములఁ
హరినిఁగూర్చి మృగంబుల నడిగియడిగి
వారిజాక్షునిఁ గానలే కారటంబుఁ
గనిచరించిరి వని గొల్లకాంతలెల్ల. 89

సీ. గిరులార దరులార ఝురులార సన్మునీ
శ్వరులార చెప్పరే హరివిధంబు
జనులార ఖనులార ఘనులార లోకపా
వనులార తెల్పరే వనజనాభు
శ్రుతులార హితులార సతులార శాస్త్ర సం
హతులార యెఱిఁగింపు డసురవైరి
హరులార తరులార సురులార గంధర్వ
వరులార నుడువరే వాసుదేవు

ననుచు నారాత్రియందు దుర్జన విదారుఁ
డైన కృష్ణునిఁగూర్చి మహానురాగ
ముననుఁ జేర్కొని బృందాఖ్య వనమునందు
సంచరించిరి గోపికాజనములెల్ల. 90

సీ. భములార సూర్యచంద్రములార సకలగ్ర
హములార పురుషసత్తమునిఁ గనరె
హరులార సిద్ధకిన్నరులార యక్షఖే
చరులార సరసిజోదరునిఁ గనరె
యతులార సమదిశాపతులార దేవతా
సతులార గోపాలపతినిఁ గనరె
కములార పవనానలములార భూపుష్క
రములార మాయదూత్తమునిఁ గనరె

నిరుపమానందుఁ గనరె కింపురుషులార
కాంచనాంబరుఁ గానరే గరుడులార
సర్వసాక్షినిఁ గనరె మోక్షసాధ్యులార
కానకుండిన లేదు సౌఖ్యంబుమీకు. 91

సీ. అళులార కైరవావళులార బహుళకం
దళులార కృష్ణుఁ డీస్థలికిరాఁడె
తావలార యసలుఁ బుట్టువులార కొదమ జ
క్కవలార వెన్నుఁ డీకానఁ జనఁడె
ఘణులార వరనిర్ఝరిణులార విపులస
రణులార శౌరిచేరఁడె యిచటికి

హితులార హరిణసంతతులార నానావ్ర
తతులార చక్రిమీఁదరిని లేఁడె
స్థావరములార మాధవుఁ దాపుఁ గనరె
జంగమములార కేశవుజాడ వినరె
యనివితర్కించి తర్కించి మనములందు
నిలుపుకొనిరి రమానాథు నెలఁతలెల్ల. 92

సీ. శుకములార కపోతపికములార కరేటు
బకములార మురారి పరగుచోటు
జలములార మరాళకులములార లసచ్ఛ
కులములార మృగాంకకులునిజాడ
తమ్ములార మహాత్మ్యలమ్ములార శిఖావ
లమ్ములార మహావిలాసియునికి
కంబులార జలాశయంబులార మహాఘ
షంబులార మనోజజనకు మనికి

లహరులారా స్మదీయవల్లభుని తావు
భంగతతులార బాలగోపాలువిధము
మాకుఁ దెల్పరె పుణ్యంబు మీకుఁ గలుగు
ననివచించిరి గోపికాజనములెల్ల. 93

వ॥ ఇట్లు రోదనం బొనరింపుచుండఁ జంద్రాస్తమయంబగు టయు వల్లవీ జనంబులు భయాకుల మానసలై తన్మయ త్వంబుఁ జెంది నేననేన కృష్ణుండని కృష్ణచేష్టితంబు లొనరించి తదుపరి నిట్లనిరి. 94

గోపికలు ఘోరంబుగా దుఃఖించుట.

ఉ॥ మానవజన్మమొందుటయె మంచిదిగాదని యెంతుమందులో
మానినులాటలెల్ల నవమాన పరాభవకారణంబుగా
నీనిశ మేమెఱింగితి మహీన కృపాగుణశాలివయ్యు మా
పైనిటు నిర్దయంగవుట పాపులువీరని చెప్పుటే గదా. 95

సీ. సంసారి క్షేత్ర రక్షణమునకుంచు ప్రా
చీరంబు పసుల భక్షించెనేని
స్వాపతేయము మందసమునఁ దాఁచంగ న
ద్ధనమది మెక్కంగఁ దలఁచునేని
మెండైన గింజెముల్ దండియంబున వేయఁ
గా నదివాని మ్రింగఁగలదేని
యాచకుండైవచ్చి యాశ్రయించినవాని
దాతయే దండింపఁ దలఁచునేని
నెవ్వరాదరింతు రెల్లలోకములు నీ
కాఁకుపడవె యిట్టికాలమందు
నీవదృశ్యమౌట లావగనున్నది
వినుత సత్యశీల కనకచేల. 96

శా. సర్వజ్ఞుండవు సర్వశక్తుఁడవు భాషా ప్రాణనాథాండముల్
సర్వంబేలు మహాప్రభుండవు వధూసంఘంబు నీలేమిచే
నోర్వంజాలక యేడ్చుచుండ ననుకంపోద్యోగమున్ మాను
టల్ గర్వంబో మొగతాళియో కఠినమో కంజాతపత్రేక్షణా.

ఉ. గౌరవమిచ్చి యన్యకృత గౌరవమొందుట లెంతవారికిన్
ధారుణియందు నైజముగదా నినునమ్మిభజించుమమ్ము నీ

తీరున నేడిపించితివి తిట్టకమానను రోషమున్నచో
బోరుసరమ్ము కోరికలుపూర్తియొనర్పుము ప్రాణనాయకా.

మ॥ అవమానం బొనరించు దేహులకుఁ బూర్ణాసక్తి సన్మా
నమీ । యుపనిం జేయుదురే మహాత్ములగువా, రైనం
గటాయిట్లు మ । మ్మవమానించిన తావకీన ఘన మ,
ర్యాదన్ విలోకింతుమే । శివతాతీ యుపవారణంబయితివే
శ్రేయస్సురాఁ గోరియో. 99

క. మరణావస్థకు మించిన
దరాధికము గోచిమించు దారిద్ర్యములే
దరయఁగనీగ్లెడు మాఁకిఁక
హరి! నీమోమోటమేటి కాలోచింపన్. 100

మ. శిలయో వజ్రమొ యశ్మసారమొ భవ, చ్చిత్తంబు మే
మెన్ని భం । గులఁ బ్రార్థించిన మార్దవంబుగనదీ, క్రూర
త్వమే నాడుకే। వలమై నిల్చెనొ చాలుఁజాలు నిఁకఁజా,
వం జూచు గోపాంగనా । వళులం బ్రోవఁగరమ్ము రమ్మి
టకు దు, ర్వారాగ్రహంబేటికిన్. 102

ఉ. నిత్యముగాదు జీవనము, నిక్కముగావు ధనాధిభోగముల్
నిత్యులుగారు దేహజననీ జనకుల్ సుతదారబాంధవుల్
నిత్యము సత్యమానములు, నిర్మలకీర్తి భవాదృశాళికి
హాత్యలభింపనేల తరళాక్షులు నచ్చినఁ బ్రాణనాయకా.

మ. బకవత్సాది పలాశనాళిపయిఁ గో,పంబూనిచక్కాడసూ
రిశదంబంబులు మెచ్చెఁగాని నినుశౌ,రీనమ్మి సేవించుయా

చకపద్మాతుల నర్థరాత్రివనిలోఁ,జంపంగ హరింతువే
సకలాచిత్త సరోజకేశవ యదుస్వామీ మనోవల్లభా. 103

ఆ. ముప్పదేండ్లుసాము మొనసినేరిచి ముస
లమ్మ నొక్కదెబ్బ కడచినట్లు
గొప్పవాఁడవయ్యు గొల్లచానలఁ జంపఁ
దలఁతువయ్య చిత్ప్రధానపురుష. 104

మ. అవిగో! డీల్పడె నాళ్ళుకీళ్ళుముక లల్లాడెన్ సమస్తాంగ
ముల్ । చివికెం బ్రాణము లుండఁజాలవిఁక డస్సెన్
మానసాబ్జంబు బిట్టవిసెం బ్రేవులు గోపికాజనసమూఖ్యల్
మాఱు నీలోన వచ్చి వగల్ దీర్పుము కూర్పుమీ కరు
ణాతో శ్రేయస్సుఁ బ్రాణేశ్వరా. 105

క. అని యెన్నివిధంబుల న
క్కనకాంగు లమోఘభక్తిఁ గైకొని ప్రార్థిం
చిన శ్రీకృష్ణుఁడు కనఁబడ
కునికి మరల సాహసించి రుర్వీనాథా. 106

వ. అనిన రాజిట్లనియె. 107

మ. వరభండీల సుమంబుఁబోలె మృదులత్వంబొంది యంగార
భా । స్వర సాన్నిధ్యముఁజెందు వెన్నగతి దాస శ్రేణిపైఁ
బొల్చు శ్రీ । ధరు చిత్తంబెటులోర్చె నింతవడి దుర్దాంత
వ్యథాపూర్ణలై యురవిందాతులు గోలనేయ మునివర్యా!
విస్మయంబయ్యెడున్. 108

శుకయోగి

మ. అలివేణుల్కన్నెరెరిగాని యరవిందాక్షుండు తద్దేశమం
దలఘుప్రీతివసించి వారలకుఁ బ్రాపై యుండిరక్షింపుచున్
జలజాతేక్షణు లేమిచేయుదురొ యేచందానభాషింతురో
నిలువంజూతురొ నిల్వరో యని నిదానించెన్ ధరాధీశ్వరా.

పరిక్షిత్తు

వ. అయ్యంగనామణు లటుపిమ్మట నేమిచేసిరి. 110

శుకయోగి

వ. గోపాలవరారోహలు చేయునది లేక సరోజాక్షునిం గానక జీవించుటకంటె మరణించుట మేలని యెంచి తమ తమ శరీరావయవంబులం గాంచి యిట్లనిరి. 111

సీ. కనుదమ్ములార కృష్ణుని దివ్యమూర్తిఁ గాం
చనిచో ఫలంబు లేశమునుఁ గలదె
నును జెక్కులార వెన్నునికపోలముల మో
పనిచో సుఖంబుఁ గైకొనవశంబె
శ్రవణంబులార కేశవు వేణునాద సం
భవగీతి వినక యుత్సవము గలదె
ముకుగోళ్ళులార నందకపాణి ప్రాపుఁ జెం
దకయున్నచోఁ బ్రమోదకరమగునె
చెలఁగి జన్మాంతరమునఁ జేసిన మహాసు
కృతముచే నీవిభావరి కృష్ణుతోడఁ
జెందితిరి సౌఖ్యమునుఁ గొంతసేపదృశ్యుఁ
డయ్యె నిఁక నేమిచేయ వీలౌనహాహా. 112

సీ. ఉరమా దరాభకంధరమా విశాలమా
శిరమా సరోజాక్షు కరుణదప్పె
మొకమా పిరివియా యలికమా మనోజ్ఞ చి
బుకమా మురారి ప్రాపుకఱవయ్యె
మనమా విశేషయావనమా జగాచక్కఁ
దనమా యదుస్వామి దవ్వుసేసె
ధనమా మృదులమా యజినమా సుఖాక్త జీ
వనమా సువర్ణవసనుఁడు వాసె

ఇంక మీరుండి సార్థకమేమిగలదు
శిథిలమైపొండు తదుపరి శ్రీధరుండు
కనికరంబున్న సృజియింపఁ గలఁడటంచు
నేడిచిరి సారెగొల్లపూఁబోడులెల్ల. 113

సీ. చికురంబులార నాలుకదాడలార చా
రుకరంబులార మీరుచిదొలంగె
రదనంబులార తిన్నదనంబులార స
త్సదనంబులార మీ ముదమడంగె
వినుతోరులార జఘనశ్రోణులార హ
స్తనఖంబులార మీ గొనబుమాసెఁ
చరణంబులార సుందరవీక్షలార తొ
గరిమోవులార మీగరిమసమసె

సుఖఫలంబువోవ శోకించి బ్రతుకుట
కంటెఁ జావుమేలుకాదె మీరు

జన్మజన్మమునకుఁ జక్రహస్తుని బ్రాపుఁ
గోరి రూపుమాయఁ జేరవచ్చు. 114

ఉ. ఇంద్రియపంక్తులార నశియించుటకై వగపొందనేల దే
వేంద్రులు భూమిఁదాల్చెడు కరీంద్రకిరీంద్రకులాచలేంద్రనా
గేంద్రులు మానవేంద్ర దనుజేంద్రులు ఖేచరసిద్ధసాధ్యయ
క్షేంద్రులు వానరేంద్రులు దిగింద్రులు మాయుటగల్గి
యుండఁగన్. 115

ఉ. భోగులు జోగులైరి పరి, పూర్ణకళానిధులుగ్రపాపయు
గ్రాగమచేత రూపఱిరి, రాజులు దస్సితరాజులైరి స
ద్యోగులు భోగినీజనుల, కూడిగముల్పచరించి రచ్యుత
త్యాగము సేసి శ్రీహరి ప,దంబుల నిల్వుము నీవుచిత్తమా.

శా. ఏలోకంబున నున్న నే జనన మం, దే కాల మందైన స్త్రీ
లోలుండే గతి సర్వజీవులకు నా, లోచించి నీ వింద్రియా
భీలాసక్తులలోంగ కన్యవిషయ, ప్రీతిన్ విసర్జించి యుం
జాలాభక్తి మురారి పాదములపైఁ జల్పంగదే చిత్తమా.

మ. నలమాంధాతృరఘుక్షితీశసగరా, నంగాంబరీషాది భూ
పులు వేనుండును రంతిదేవుఁడు దిలీ,పుండంబృథుండాదిగ
నిలఁబాలించిసుఖంబుఁగాంచినను వా, రేమైరో యోజించి పా
పలతాదాత్రుని దేవకీసుతుని సం,భావింపవే చిత్తమా. 118

చ. తనువుఁ దొరంగువేళఁ దను ధారులు దేనిని సంస్మరింతుర
జ్జననము నొందుచుందురని, శాస్త్రములెల్ల వచించుఁగా
నమా । తనువులు వీడుచుంటిమిగ్గదా యిక నన్యము

మానినీవు పు । ణ్యనిధిని మోక్షదాయకుని, నచ్యుతు
గోరుము మూఢచిత్తమా. 119

మ. విషమిమ్మైనికి మాత్రమే శిథిలము, ర్వింటెచ్చుశబ్దాది దు
ర్విషయంబుల్ నిరయంబు జీవులకు రా, వించుంజుమీ
యీనుడుల్ । మృష గానెన్నక దేనిపైఁ జొరక నె, మ్మిం
గనమ్మిత్రదై త్యాన్వయ । ద్విషుఁడౌ కృష్ణుని పాదపద్మముల
వ, ర్తింపంగదే చిత్తమా, 120

మ. చనుఁబ్రాల్ ద్రావెడు బాలకుండు రుజచే, సంతప్తుఁడై
యున్నఁ ద। జ్జననీస్తన్యము చేఁపుగాని చెడదా, చందాన
నీ భక్తి పా । పనిరోధంబునఁ దగ్గుచుండినను గో, పాలా
కృతిం గన్న శ్రీ । శుని కారుణ్యము హానిఁ జెంద దతనిన్,
శోధింపుమా చిత్తమా. 121

మ. చరణాంఘ్రిశ్రవణంబులార వరనా, సాజిహ్వలారాధరా
ధరసంకాచకుచంబులార ఘనదృగ్దంతంబులారా మనో
హరవాగ్గండములార బోఁకుఁడిఁక మీ, రన్యంబుగా నంచుఁజె
చ్చెరబోధించిమురారి పాదములపైఁ, జేరంగదే చిత్తమా

మ. మగలేలా నగలేల క్షేత్రవనముల్, మాన్యంబులేలాజగా
సొగసేలా నగలేల చీరలును వ, స్త్రవాతముల్ గోవులే
నుఁగులేలా సొగసేల మానుకొని మా, నుల్చెప్పుమార్గం
బుచేఁ । దగుభక్తిన్ జగదీశునచ్యుతునొగిన్, ధ్యానిం
పవే చిత్తమా. 123

సీ. శింశుమారంబుచే శిథిలాపయువుఁడైన
దంతీశు నేలుగా ధనిజమేని
జనక కృతోరు కష్టములచే నలఁగు ప్ర
హ్లాదు నేలుట తథ్యమాయెనేని
స్వవిమాతృదుర్వచస్తాడితుఁడైన సు
నీతిపుత్రుని ప్రోవునిక్క మేని
దుష్టపూర్వజునిచే దుఃఖమొందిన విభీ
షణుని రక్షించుట సత్యమేని

గరుడవాహనుండు మరుసిచే వ్యథలొందు
మమ్ముఁ గావ కేలమానునంచుఁ
గమలగ్రంథులెల్ల యమునానదింబడు
సమయమందు సాహసంబెఱింగి. 124

## శ్రీకృష్ణుని పునర్దర్శనము

సీ. వింతతుంపెసలాడు కుంతలంబులతోడ
రవణిల్లు శిఖిశిఖండంబుతోడ
నవవలాహక సమానవరవర్ణముతోడ
శంపాలతఁ మించు సాలుఁ తోడఁ
గాక చించాబీజకలిత హారములతో
నింపైన వంశనాళంబుతోడఁ
గోటిమారుల గోట మీటుసోయగముతోఁ
గమలబాంధుని గేరు కాంతితోడఁ

చెవులఁజెక్కిన నల్లగలువలతోడ
సతుల నుబ్బించు ఘన విలాసములతోడఁ
జందురు నిరసించు మందహాసంబుతోడఁ
జానగములకు శౌరి సాక్షాత్కరించె॥ 125

సీ. మరుదాతపములచే మ్లానమౌ సస్యంబు
లనుకూల వర్షాప్తి నలరినట్లు
లైగారికగ్రస్తమైన స్వకీయ ద్ర
వ్యమురాఁగఁ బొంగు గృహస్థుపోల్కి
జనపాళి మధ్యమందునఁ దప్పిపోయిన
శిశువు రాజనని హర్షించు పగిదిఁ
బోయిన ప్రాణముల్డాయఁగా బలముచే
రేఁగి రంజిల్లు శరీరిభంగి

నిర్మలారోగ్యపదవిచే శర్మమొంది
తనరు బహుకాలరోగి చందమున గోప
కామినులు దేవకీసుతుఁగాంచి సంత
సించిన యుదంతమరసి వచింపఁదరమె. 126

సీ. చూచుచుండఁగ నదృశ్యుండైన దుస్సాధ్య
వంచకు నీకనైనఁ గాంచరమ్మ
పరిరంభవేళఁ గన్పడకుండఁ బోయిన
పాటచ్చరుని నేడు పట్టరమ్మ
రోసి గడియలోఁ దిరోధానమొందు ని
య్యింద్రజాలికుని గుట్టడుగరమ్మ

గతరాత్రి మనమెన్ని గతుల నేడ్చినఁ గరం
గని వాని నేమనంగఁ గలదమ్మ
యనుచు నందనందనునిఁ బరివేష్టించి
బహువిధంబులైన భాషణములు
పలికిఁ దృప్తి లేక భామినులానంద
వార్ధిఁ దేలిరయ్య వసుమతీశ. 127

వ. ఇట్లు కొంతవడి సంభాషించి. 128

ఉ. చక్కిలిగింతవెట్టి సరసమ్మునఁ జుంబనముల్ రచించి పె
న్మక్కువఁ గౌఁగిలించి వెతమాఱఁగఁ జందురు కూనలుంచి
మే। ల్చెక్కులు నొక్కినొక్కి తమిచే రదనక్షతముల్ వెల్చె
లంగ నా। చక్కెరబొంగుల బదిలునుఁ జక్రినధీనము సేసి
యూపయిన్. 129

సీ. ప్రబలాంకుశముచే నిభముఁబోలెఁ గుచములఁ
గ్రుమ్మరే వీని నోయమ్మలార
రజ్జువుచే నిట్చరమునట్లు జడలతో
మోదరే వీని నో ముదితలార
కశలచే వరఘోటకముఁబోలె మాటల
నలయింపరే వీని నతివలార
బోనుచే శార్దూలమునుఁబోలెఁ బ్రేమతో
బంధింపరే వీనిఁ బడఁతులార
యనుచు నవ్వల్లవాంగన లమ్మురారి
బట్టుకొని చుట్టుముట్టి చేపట్టి ప్రణయ

కలహామునఁ బల్కుచుండ నక్కమలదళవి
శాలనయనుండు మందహాసమునఁ బొదలె. 130

సీ. రదనక్షతుల పీని రంగుమార్చినదాఁక
మన కోపమడఁగునే వనితలార
రంభోరుహతుల నీరసికు మోదినదాఁక
నుడుగునే మన మోహ ముదిదలార
కరరుహక్షతి పీని గర్వంబడఁచుదాఁక
దీరునే మనవాంఛ తెఱవలార
పురుషాయితమున నిష్పౌరుషు నోర్చినదాఁక
మన కామమాఱునే మగువలార

యనుచు నాయాపను లనునయంబుమీఱ
విషమసాయకు జనకుతో వేనవేల
గతుల నొనరించియును దృప్తిఁగానరైరి
గోపదరళాక్షు లేమందు భూపవర్య. 131

సీ. అద్దమరేయి నీయన్నమిన్నులబాయఁ
బాదంబులెట్లాడెఁ బ్రాణనాథ
ప్రార్థించువారి కభయమీయకుండ నీ
పాణియెట్లు సహించె జాణమిన్న
వాపోవుచుండు నీవాములఁగనక నీ
కన్నులెట్లోర్చె నో వన్నెలాఁడ
దిక్కులేకడలు నింతిగమిపై రాక నీ
చిత్తంబెటుల నిల్చె జీవగఱ్ఱ

నిన్ను వినుతింపకున్న విపన్నులైన
జనుల రక్షించు దయయెల్లు సన్నగిల్లె
నని యశోదాసుతునితోడ నాడిరెల్ల
వన్నెలాండులు నోపరిక్షిన్నరేంద్ర. 132

సీ. పతి జీర్ణవరదాంకఁ బలుకనేనని యొక్క
వగలాఁడి తగవాడి మొగముఁ ద్రిప్పె
హరిదాయ నాఁక డాయనటంచు నొక్క చ
కోరాక్షి దూరంబుఁ జేరి నిలిచె
దయితుఁడంటినదాఁకఁ దాకనేనని యొక్క
సుమగంధి భ్రమఁ జెంది తమకమడఁచెఁ
గాంతుండు కనుదాఁకఁ గాంచనేననియొక్క
కనకాంగి కనలూని కనులుమూసెఁ

ప్రాణనాథుఁడింత వరముఁ గన్పడకున్న
బ్రతుకలేదె వఁండు బ్రతుకకుందు
నే యటంచు నొక్క తోయజముఖిపల్కె
నేమిచెప్పవచ్చు నో మహీశ. 133

సీ. నీవంటిగాంభీర్య మావారినిధి సప్త
కమునగాలించినఁ గానరాదు
నీ నిశ్చలత్వం బనేకగిరులఁగవే
పించినఁగాని వీక్షింపరాదు
నీ క్షమాగుణము సర్వక్షితిస్థలమందు
శోధించియైననుఁ జూడఁబడదు

నీ మనోగుహ్యంబు నిర్జరాదులకైనఁ
దెలిసి వక్కాణింపఁ దలముగాదు
యెట్లు చెప్పుడందువేని మేమిందాఁక
బొగులుచున్న దూఁటి పొగడుచున్న
నొక్కరీతినుంట నిక్కంబుగాఁగంటి
మయ్య నీ స్వభావమంబుజాక్ష. 134

ఉ. పోయిజనించుకాలమున నంగదలబ్బిన నక్బొఁగాళ మా
స్యీయులఁబాసి లౌకికముఁ జీయనిరోసి భవత్సమాగమం
బేమెడఁగోరి రాఁగమము నీగతిఁబాసితివేల నీయభి
ప్రాయముఁజెప్పుమన్న విని పంకజనాభుఁడువారికిట్లనుర్.

మ॥ చెలులారా ! మిముఁబాసి నే నెటకు, వేంచేయంగ లేదమ్మ చెం
గలి నేనిల్చితిఁగంటి మీవగ కృత, ఘ్నత్వంబు లేదమ్మ మీ
పలుకుల్ వింటిని మెచ్చుకొంటి నెదలో, భక్తి ప్రథానాశయా
బ్జలు మీరెల్లఁ గరస్థలామలకమై ప్రాప్తించు మోక్షంబహా.

ఉ. నమ్మిన వారి నెన్నటికి, నాదరణంబునఁజూతుమీ సమీ
పమ్మలనుండి కన్నులకుఁ బక్ష్మములట్టులఁ గాచుచుంటిగు
హ్యమ్ముగనుంటకేమి ఫల, మంచువచించెద రేని భక్తవా
రమ్ములకొక్క వేళసుక, రమ్ముగఁ, దోఁచెదదోపకుండుదుర్

శా. ఆరంభంబున భక్తి గల్గుటకుఁ బెం, పైయుంటకుర్
మచ్చుభా । కారంబిమ్ములఁ జూపియా పైననేఁ, గన్పింప
భక్తాళినా । నారాగంబులు మానిడీలు పడి మ, న్నామా

కృతుల్గాథలా । ధారంబంచు స్మరింపుచుండుటకునై, తథ్యం
బుగా నమ్ముఁడీ. 138

క. హితకారి యైనజనకుఁడు
సుతువ్రణము గోసిదాన సున్నమిడువగన్
వెతలు గల్పింతు భక్తుల
కతులిత సంసృతి విరాగమబ్బుట కొఱకై. 139

క. కడువడి నిడుములు పొడమినఁ
జెడని దృఢముతోడ నను భజించెడువారిం
జెడనీక ప్రోచియప్పటి
యొడలుడిగిన పిదప ముక్తి నొందింతుఁజుమీ. 140

మ. ఘనయజ్ఞాంగ ఫలంబులట్టుల మదం, గంబందు బ్రహ్మాం
డముల్ । కనుపట్టుంజుమి వానిలోనొకటి భం, గంబైన
నష్టంబులే । దని వాదింతునుగాని భక్తులకు నా, వంతైన
గీడబ్బినం । గనినే నోరువఁ జాల శ్రద్ధఁగొని యా, కష్టంబు
వారించెదన్. 141

ఉ. అన్నల మిన్నలార విన, యంబునఁ జేరి భజించువారి నా
కన్నులభంగి నాలుక వ, గం బదయున్నము మాడ్కిఁ బ్రేమ
తో । నెన్ని బహూకరింతునిది, యిప్పుడు పుట్టిన వార్త
గాదు భూ । భృన్నికరంబు నుగ్గయిన, భీతి వహింపరు
మామకాశ్రితుల్. 142

మ. ఎవఁడే పుణ్యమొనర్చినన్ మఱియు నే, యే దేవతా
భక్తుఁడై । యెవఁడర్పించిన వానికా ఫలము నే, నే ఖా

వలెంగాని లే । దు విలోకింపఁగఁ గర్తవేఱొకండు మూ,
ఢులా కానరీ వార్త ధీ । రవరులా కెంతురు మీరు ధీమత్తు
లుకా, రా నన్ను సేవించుటల్. 143

మ. బలుపుణ్యంబు లొనర్చి స్వర్గసుఖముం, బ్రాపించువారుం
దవః । ఫలయోగంబున బ్రహ్మలోక సుఖలా, భం
బొందువా రిద్దరా స్థలిఁ జన్మింతురు సారెసారెకును భ,
క్తశ్రేణి మల్లోక మొం । ది లయో ద్భూతజరాదులం గ
నరు ము, క్తి స్థానమై యొప్పుటల్. 144

ఆ. స్వస్వరూపమునుఁ బరస్వరూపంబు పా
య స్వరూపమును రిపుస్వరూప
మరసి మఱియుఁ బూరుషార్థస్వరూపంబు
నెఱుఁగవలయు మనుజు లిహమునందు. 145

సీ. స్వస్వరూపంబన సకలేంద్రియాదులు
గానిజీవుని నిజాకారమనియు
భవ్యపరస్వరూపంబన మామకీ
నాకారమును బరమాత్మ యనియు
దీపితోపాయ స్వరూప మనంగ మ
త్ప్రాప్తిఁగూర్చుఁ బలసత్ప్రపత్తియనియు
బలువిరోధిస్వరూపంబన నను: జెంద
నీయని ప్రాకృతమాయ యనియు
జననమృతి జరారుజలు లేని మల్లోక
మందియుంట పూరుషార్థమనియు

నన్నిటికిని మాయకానుగ్రహమె మూల
మని యెఱుంగవలయు నతివలార. 146

ఆ. విజ్ఞులర్థ పంచకజ్ఞానమని చెప్పఁ
గలరు దీనిగుట్టు దెలియలేని
వారలెన్నికోట్ల భవములకైన స
న్గానలేరు ముక్తిఁగాంచలేరు. 147

క. ఈయర్థ పంచకజ్ఞా
నాయత్తాశయులుగాక యాచార్యసప
ర్యాయుతులుగాక తత్ఫల
మెయొప్పెడు నన్నుఁగంటిరంగనలారా! 148

చ. సకలశరీరధారులకు సాధ్వసముల్ వగలుఁ దిగుళ్లు బం
ధకములుదగ్రతాపములుదాసికృశింపఁగఁజేయుఁగాని మా
మక కరుణాసుధారస సమన్వితులం జెనకంగ లేవు మ
న్నికటముఁ జేరినందున ననిష్టము లెప్పుడు రావుమీకిఁకన్.

చ. జపములొనర్చి నోములనుసల్పి మఖంబుల నాచరించి బ
ల్తపములుసేసి తీర్థములు దాసి సుపాత్రల కీవులిచ్చి త
ద్విపుల ఫలాళిచే వృజిన విస్తరముల్తొలఁగించుకొన్న వా
రపరిమితానురాగము మదంఘ్రి యుగంబునఁ గాంతు
రెప్పుడున్. 150

క. విడుతుంబంచాయుధముల
విడుతుఁ వైకుంఠమైన విహగవరుని నే

విడువక భజించు సాధుల
విడుచుటలేదెన్నటికి వివేకినులారా! 151

క. మీరు ఘనపుణ్యవతులగు
కారణమున మదనురక్తిఁ గాంచి ప్రబలసం
సారాంబుధికుడుపంబగు
వైరాగ్యముఁ జెందితిరి సువాసినులారా! 152

తే. ఎన్నివిధముల రోదజేయుచున్న రాక
గోడుగుడిపించి నట్టి నాకొంటెతనము
మఱచిపోవుట కొరకై క్షమాపణంబుఁ
గోరుచున్నాడ నుతమకున్నారులార! 153

క. నాకై మీ రియ్యామిని
శోకించిన చరితమెల్ల సూరివరులు ము
ల్లోకములఁబుణ్యకథగా
వాకొందురు సభలలో సువాసినులారా! 154

వ. ఇట్లు సాంత్వన వచనంబులు వల్కుచున్న కారుణ్యంబున
కాశ్చర్యమొంది బహుజన్మ సహస్రసంచిత పుణ్యపరి
పాక విశేషంబుచేఁ గలిగిన పరమభక్తి తలకెక్కుటయు
నమ్మహిళామణు లపారపాండితీ వాక్యంబులచేఁ బ్రస్తు
తించిరి. 155

పరిక్షిత్తు

వ॥ వామదక్షిణ పార్శ్వంబులకుం గలభేదంబెఱుంగలేని వల్ల
వాంగనలకుఁ బాండిత్యంబెట్లుగలిగె.

## శుకయోగి

ఆ. నిండు నీరుగల్గియుండిన చేనికిఁ
జెంతనుండు చేనుఁ జెన్నుమ్రగిల్లి
పండినట్లు పురుగు బంభరంబైనట్లు
లగుమరెల్ల జనులు హరినుతించి. 157

క. వనజనయను నుపగూహన
మొనరించి నిజస్తనముల నొత్తిన మాత్రం
బున సాహితి సంగీతం
బునధీనంబయ్యె గొల్ల పూఁబోఁడులకున్. 158

సీ. అతిబాల్యమందె ప్రహ్లాదుండు బాలకా
వళికి శాస్త్రార్థము తెలుపలేదె
షట్సమాప్రాయుఁడై సాధుధ్రువుఁడు శ్రుతి
స్మృతివాక్యములను భాషింపలేదె
తగురీతి రామా! యనఁగలేని వాల్మీకి
శ్రీరామ కథను రచింపలేదె
శరతల్పగతుఁడైన జాహ్నవీ సుతుఁడు ధ
ర్మజుని సందేహముల్మార్పలేదె

విష్ణుభక్తులైన విమలాశయులకు వి
ద్యా ప్రపంచమెల్ల దాసివచ్చుఁ
గానగోపికలు కలానిరూఢిముకుందు
రహినుతించు టబ్బురంబుగాదు. 159

H. Y. R. Sampat Khomar

పరిక్షిత్తు

వ. అటుమీఁద జరిగినట్టి యుదంతం బెఱింగింపుము. 160

శుకయోగి

వ. యోగినులభంగిఁ బరిశుద్ధులగు గోపికాజనంబులు హరికి
నమస్కరించి యిట్లనిరి. 161

గోపికలు

క. నీ వినయము సౌలభ్యము
నీ వాత్సల్యంబు మృదువు నీ సౌశీల్యం
బేవగ మానోరులతోఁ
గావింతుము వినుతి భక్తకల్పమహీజా.

సీ. పాతాళలోకంబు పదములుగా భూమి
కటిగా సముద్రములు కడుపుగాఁగ
సత్యలోకముతల స్వర్గంబుగళముగా
శైలావళులు కకసములుగాఁగఁ
బుష్పవంతులు నేత్రపుండరీకములుగా
జలధరావళులు కచములుగాఁగ
నొగి సమీరణుఁడు నిట్టూర్పుగా వగ్ని రో
షంబుగా వాణివచస్సుగాఁగ
ద్రుమములును సస్యములును రోమములుగాఁగ
సురసమూహంబులెల్లఁ గింకరులుగాఁగ
ఘన నిగమములు వందిమాగధులుగాఁగఁ
దనరు నీవేడ మేమేడ దైత్యవైరి. 163

సీ. వైకుంఠనిలయంబు వర్జించి కర్మభూ
మినిఁ డాసి నీవు జన్మింపకున్న
మధురాపురీజన మండలంబులతోఁ బ
రగుచు నిచ్చోటికి రాకయున్న
వచ్చియుఁ జుట్టాలవలె వెసనేగి యి
న్నెలవునం దిన్నాళ్లు నిలువకున్న
నిలిచియు గోపమానినులెంతవారన్న
యీసడింపుచు నాదరింపకున్న

మాకు దక్కునె నీసేవ స్వీకరించి
కరుణఁ జూడంగ నిట్టి భోగంబుగలిగె
నింతపని జేసినందుల కేమి నీకొ
సంగఁ గలరయ్య యీ గొల్లచానలెల్ల. 164

సీ. భవపద్మభవశచీధవుల కోటీరంబు
లంటివర్ధిల్లు నీ యంఘ్రిమహిమ
పగిలిపోకుండ లోపలనిల్పె బ్రహ్మాండ
సంచయంబోము నీ జఠరమహిమ
సిరులకిక్కై ప్రకాశించు లక్ష్మి కుచో
పరిసౌఖ్యమొందు నీ పాణిమహిమ
స్వేచ్ఛానుసరణి శిక్షించి శరీరులఁ
గాపాడు నీ యధికారమహిమ

మఱచి సౌలభ్య సౌశీల్య మార్దవముల
కగ్గమై యిట్టి నీచలమైనమమ్ము

స్వీకరించిన నిను నుతిఁ జేయఁ దరమె
కీర్తివిస్తారవర దేవకీకుమార ! 165

సీ. నీగౌరవంబు మానీచం బరయు లేక
చెలఁగి శీఘ్రముగ విచ్చేసినాము
నిందమావలన నిన్నొందునోయని విచా
రింపకందఱము ప్రేరించినాము
నీదివ్యదేహంబు మా దురంగములతోఁ
జేర్చి కొంకకయె స్పర్శించినాము
విడనాడి మమ్ముఁ గన్పడకుండ దాఁగి య
దుస్స్వామి రాడని దూఱినాము
యిన్ని తప్పులొనర్చిన యన్నుమిన్న
గములనెట్లు బ్రోతునన కనుకంపతోడ
మాకడకువచ్చినట్టి క్షమాగుణంబు
తరమె వర్ణింప సంవిత్ప్రధానపురుష. 166

మః ధనమో విక్రమమో యొకానొక ప్రభు, త్వంబో యశం
బో కలా । ర్జనమో సుందరమూర్తి యోగలుగ గ, ర్వ
స్వాంతులై యుందురీ । జనులాహా విపుల ప్రభావములు
ల, క్షల్ కోట్లు నీకుండియుం । గనవగ్గర్వము లేశమైనఁ
గన మా, కామంబు లీడేరునే. 167

మ. కులమర్యాదల నీసడించి నిగమోక్తుల్ లోకమర్యాద లి
మ్ముల వర్జించి శరీరబాంధవులపై, మోహం బుఁ జాలించి మీ
తలఁపుల్ నాపయినిల్పినందులకు వి, స్తారోపకారంబు నేఁ
జలుపంబూనిన నెంతుఁ జాలవనిల, క్ష బ్రహ్మకల్పంబులున్.

వ. ఇవ్విధంబున లాలించి యదుపుంగవుండమ్ముద్దియల నొక్క విశాలవనంబుఁ జేర్చినాడసుటయు. 169

పరిక్షిత్తు

వ. యోగీంద్రా! శ్రీకృష్ణుని శరీరంబు మనుజ సామాన్యమా యప్రాకృతమా. 170

శుకయోగి

వ. సామాన్య మానవ దేహంబులభంగి మూత్ర పురీష నఖరోమాస్థిస్వేదశోణిత ధమనీ మస్తిష్కస్యందినీ దూషికా శుక్రశింఘాణపింజూషక్షుత్పిపాసా రోగజరామరణ కామ క్రోధలోభ మోహమదమాత్సర్యేర్ష్యా దంభాసూయా దర్పాహంకార నిద్రాహారాదులంగూడినదిగాక శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహంబ ప్రాకృతంబై పంచోపనిషణ్మయంబై జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్య తేజస్సౌశీల్యవాత్సల్యమార్దవార్జవసౌహార్ద తారుణ్యకారుణ్య సౌందర్యస్థైర్యశౌర్యౌదార్యగాంభీర్యాది సమస్త కల్యాణ గుణ పరిపూర్ణంబై యొప్పుచుండు. 171

పరిక్షిత్తు

వ. అట్టి పరిశుద్ధుండు ప్రాకృతాంగులగు గోపికాజనంబులతో నెట్లు భోగించె. 172

శుకయోగి

వ. మంచి ప్రశ్న మొనర్చితివి చెప్పెద నాలకింపుము. 173

ఉ. చందన వృక్షసన్నిధి కుజంబుల దేవిధమైన భంగి నిం
దిందిర నిఘ్నకీటకము, తేటితనంబు వహించినట్లు గో
విందుని దివ్యవిగ్రహము విస్తృతభక్తిని సంస్పృశించియా
చందన గంధులందఱును, జయ్యన బొందిరిదివ్యభావముల్

సీ. సనకసనంద నాద్యనఘులఁబోలె వై
రాగ్యమ్ముఁ జెంది రభాగ్యవతులు
వాయుపుత్రాది విద్వత్కవీంద్రులఁబోలె
సాహితీపరులైరి చంద్రముఖులు
కలహాశనునిఁబోలె గాత్రజంత్రముల గీ
తముఁ బాడ నేర్చిరి భ్రమరకచలు
నిర్జరాంగనలట్లు నింగిపై విహరించు
సామర్థ్యమొంది ర కోమలాంగు
లార శ్రీకృష్ణదేవు దివ్యాంగమంటి
నంతమాత్రముచే వారలట్టులైరి
బలవదాశ్రయ మేరికిఁ బట్టుగొమ్మ
గాదె పాండవకుల దుగ్ధకంధిచంద్ర. 175

ఆ. విన్నకొలఁది భూరి విమలమై విస్మయా
వాలమై శుభానుకూలమగుచు
నాకుఁదోఁచుచుండె నందనందను కథా
విభవమంతమీఁద విన్నవింపు.

శా. లేరావక్తలు నాలకించు జనముల్ లేవా కథల్ఘోరమై
లేరెవ్వారును సర్వసంగములపై లిప్సల్ విసర్జించి కం

సారెకు నీవలెఁ దెల్పువారు మురజిచ్చారిత్రముంబోలు స
చ్చారిత్రంబులు లేవుగాని ధరపై సత్యేక్షమానేషధీ. 177

ఉ. ఏకథ లెప్పుడైనఁ బఠియింప సభాస్థలి నొక్కజాములో
వాకొనువారు నూఁకొనెడువారు విరక్తి వహించి చాలులే
మాకని లేచిపోవుట సమస్తజగంబుల నైజమట్లుగా
దీ కమలాక్షుగాథ వచియించినవిన్ననుఁ గ్రొత్తయాగదా.

క. కావున నటు పిమ్మట మన
శ్రీవరుఁ డేమేమి పనులు సేసెనొ గోపీ
స్త్రీవారమెటుల నడచెనొ
వేవిసిపింపఁగదే వివేకనిధానా. 179

శుకయోగి

వ. శ్రీకృష్ణుండప్పుడు రాసక్రీడా వినోదంబు జగంబులకుఁ
బ్రదర్శింపనెంచి వల్లవాంగనా మణుల వలయాకారం
బుగా నిలుచుండఁబెట్టి వేనవేల గోపికలకు వేనవేల కృష్ణా
కారంబులు ధరించి యిరువురి గోపికలనడుమ నొక్కొక్క
కృష్ణుండు నిరువురి కృష్ణులనడుమ నొక్కొక్క గోపికయు
గానిలిచి యొక్కరి మెడలపై నొక్కరి చేతులు మోపు
కొని మనోహారంబుగా నృత్యంబు సేయుచుఁ బాడుచుండఁ
గాంతామణీ గోపాల చూడామణుల కంఠమాధుర్యం
బుతోఁ గూడిన గానంబు త్రిలోకస్థంబులగు చరాచర
భూతంబులకుఁ గర్ణగోచరంబై యానంద ప్రవాహంబు
గల్పించె. 180

సీ. ముందుగాఁ గృష్ణుఁ డానందంబుతోఁ బాడఁ
గాఁ జెలి నాదంబుఁ గలిపిపాడె
ధ్రువతాళమును రమాధవుఁడానతీయు న
క్షరకాలమిదియంచు గరితదెల్పె
గమకంబు లైదు రాగమునకు హరి పట్టఁ
దక్కిన గమకము ల్తరుణి పట్టె
లాస్యంబు గోపలలాముం డొనర్పంగ
నలినాక్షి విపులాభినయము సూపె
వేణురవము వల్లవీ నాయకుఁ డొనర్ప
వీణ మ్రోయఁజేసె వెలఁది యొకతె
కృష్ణుఁడిట్లు రాస కేళిఁగావించిన
నేరుపిట్టిదని గణింప వశమె. 181

సీ. శ్రీజానికథలు కాంభోజిరాగంబుతో
నొనఁగూర్చి పాడె నొక్కనలినాక్షి
మాధవాఖ్యలు హనుమత్తోడి రాగంబు
నందుంచిపాడెఁ దొయ్యలియొకర్తు
చక్రిసౌందర్యంబు సావేరితోఁగూర్చి
లలిఁ బ్రకటించె నొక్కలతకూన
హరిగుణంబులు శంకరాభరణంబుతో
జతిగూర్చి పాడె నొక్క-తరలాక్షి
దానవవిరోధి దివ్యావతారములనుఁ
బాడెనొకమొలనాగ రూపవతి రాగ

ఫక్కి-చేనట్టివేళ గోపాలమౌళి
చూచి సంతోషమునఁ దలయూఁచుచుండె. 182

సీ. కనకాంగులార యక్కనకాంగి శుద్ధగాం
ధారధైవతములఁ దనరుచుండు
రాగవర్ధనులార రాగవర్ధనికి ష
ట్ఛ్రుతిరిషభమున నాకృతిఁ జెలంగుఁ
గల్యాణులార యక్కల్యాణి ప్రతిమధ్య
మా క్తమై సతతంబు రక్తిఁగాంచు
సుచరిత్రలార యా సుచరిత్రమనఁగఁగై
కలినిషాదంబుచేఁ గ్రాలుచుండు

నని మురారాతి యవ్వల్లవాంగనలకు
రాగమర్మంబు లెఱిఁగించి రమ్యఫణితిఁ
బాడుచుండంగ నానిలింప ప్రతీప
దర్శినీ సంఘములు ప్రమోదమునఁ దేలె. 183

సీ. చతురశ్రవరమిశ్ర సంకీర్ణఖండ త్రి
శ్ర సమాఖ్యజాతుల జాడఁదెలిపి
తాళైకమునకు ద్రుతములెన్నొ లఘువులు
ఘాతలెన్నియొ వాని రీతిఁదెలిపి
యటమధ్య ఝంపాత్రిపుటరూపకైకాది
తాళమర్మములు సాంతముగఁ దెలిపి
వాద్యనువాది సంవాది వివాది నా
మములచేఁ బరఁగు స్వరములు దెలిపి

తాల్మిమంద్ర మధ్యతారాది స్థాయీ వి
ధానమెల్లఁ దెలిపి దైత్యవైరి
గొల్లచెలులతోడఁ గూడిపాడెడు వేళఁ
బూలసోనఁ గురిసిరోలిసురులు. 184

సీ. వచ్చునే కాంభోజి వర్ణంబు నీకని
యొకలేమ యొకభామ నొత్తియడిగె
దోడిలో గీతంబు పాడెదే నీవంచు
నెలనాగ యొకచాన నెత్తిపొడిచె
ఖరహరప్రియకృతి ఘనమెఱుంగుదె యని
పొలఁతి వేఱొక వధూభుజముఁ దట్టె
బల్లవివినిపింతుఁ బరికింతు వేయని
వెలఁదియొండొక దాని వేణిలాఁగెఁ

జిగురుబోఁడు లిటువచింపుచుఁ బందెముల్
వైచి కృష్ణుమధ్య వర్తిగాఁగ
నిలిపి పాడుచుండ నిఖిలలోకంబు లా
నందవార్ధిఁ దేలె నరవరేణ్య. 185

సీ. ఈ స్వరంబులు నీమహాస్వరంబునఁ జేరి
గౌరవంబొందెఁబో మారజనక
యీగీతములు నీ వచోగీతవశములై
భాసిల్లినవి సుమీ పద్మనాభ
యీరాగములు నీమనోరాగమునఁ జొచ్చి
మాధుర్యమునుఁ గాంచె మధువిదార

యీస్థాయిలును నీగళస్థాయిలైయుంట
హాయిఁ జెందినవి మహానుభావ

యితగులందుఁ జేరి యీపెంపు నీ సొంపుఁ
గనవటంచుఁ సారెగగనమందు
గరిమఁ బొగడి రోలి గంధర్వవరులు గా
నప్రవీణులౌట నరవరేణ్య. 186

సీ. రాగంబునకుఁ గలరక్తి యీనాడు బ
యల్పడెననె సుధాహారమాని
స్వరసప్తకస్థమా సకల మాధుర్యమి
క్కడఁ గంటిననె హేమగర్భరాణి
సుప్రశస్తమగు లయప్రమాణము నేడు
కనుఁగొంటి ననియె విఘ్నప్రభుండు
లాస్యాభినయతత్వ లక్షణంబిచట వీ
క్షించితిమనిరి జేజేనెలంత

లంబుజదళేక్షణుఁడు వల్లవాంగనలు మ
హా వినోదంబుగా యమునాపగా స
మీపమున రాసకేళిచే మించునప్పు
డరసి వర్ణింపఁ దరమె తదద్భుతంబు. 187

సీ. స్తనయుగంబున యదూద్వహునిహాజ్జలు మోపు
కొని నృత్యమొనరించెఁ గూర్మినొకతె
యంసభాగమున దైత్యారి కరుద్మతు
లుంచి మోదమునఁ గ్రీడించెనొకతె

హరి కరంబులు స్వకీయశయంబులనుఁ బట్టి
పలుమారు గీతంబు బాడెనొకతె
వనజాక్షుచెక్కిటఁ దనకపోలము మోపి
యుంచి యానందంబుఁ గాంచెనొకతె

కౌగిలించెనొకతె కన్నులు కనుల నా
నించె నొకతె హెచ్చరించె నొకతె
యిట్లు వ్రజపురంధ్రు లేమేమిచేసిన
సమ్మతింపుచుండెఁ జక్రపాణి. 188

సీ॥ సరసిజాక్షుఁడు శైలధరుఁడుగదా మత్కు
చము లేల పట్టడే చానలార
రుక్మచేలుఁడు భూధరుఁడుగదా నా కకు
ద్మతు లేల కోరడే యతివలార
పద్మనాభుఁడు వియత్పదుఁడుగాన మదీయ
మధ్యమెట్లంటడే మగువలార
దితిజారి జలధరదేహుఁడుగాన మ
ద్వేణి నెట్లొల్లఁడే వెలఁదులార

కంబుధరుఁడు నా గళంబేల తాఁకడు
శార్ఙ్గపాణి నా ప్రశస్తభ్రూయు
గళము నెట్లు దాఁటఁగలఁడని యూనించి
కెల్లకామినులు మహోల్లసమున 189

సీ. ఉపగూహనంబునం దుండు సౌఖ్యము విశ
దముగఁ దెల్పితి భుజాంతర మొసంగి
చుంబనస్థంబౌ రుచులు దెల్పినాఁడవు
రమణీయమగు కపోలములొసంగి
చక్కిలిగింత లోఁజవులు దెల్పితివి పో
మా కనువగుచోట దాఁకనిచ్చి
స్పర్శనానంద విస్తారంబుఁ జూపితి
కమనీయ దివ్యాప ఘనములొసఁగి

యనుచు నందనందనుని బహువిధముల
సన్నుతించి గొల్లవన్నెలాండ్రు
మిన్ను ముట్టుచుండ మింటఁ గాంచెడు మరు
ద్వామ లెఱుఁగ రైరి వపువులుబ్బ. 190

సీ. మందహాసమొనర్పు మాతోంటిమాడ్కి నీ
వనియొక్క తరుణిపై హస్తముంచి
భాషింపుమిందాఁకఁ బలికిన పరిహాస
వాక్యంబులని యొక వామనిమిరి
పాడుమింకొకమాఱు పాడినరాగంబు
బాగున్నదనియొక్క పడఁతిలాఁగి
తెలుపు మింతకుమున్నుఁ దెలిపిన కథ ప్రౌఢ
ముగనున్నదని యొక్క ముదితనడిగి
రాసకేళియందు నా సరోజాక్షుండు
సంచరింపుచుండ నంచయాన

బాప్లలెన్నలెన్న బాగుబాగాహా హా
నహ్వానహ్వాయనిరి నసుమతీశ. 191

సీ. నెమ్మి నీ వొసఁగిన తమ్మ నేను భుజింప
నర్తనశ్రమము వినాశమయ్యెఁ
గరము నీవు మదీయ కబరియందుంచంగ
గళమెత్తి పాడిన గాసితొలఁగెఁ
జేరినాపై దరస్మితము నీవొలయింపఁ
గా వీణవాయించు కష్టముడిగె
గరిమతో నీవపాంగ శ్రీనొసంగఁదా
కమును ప్రమోయించు శ్రమమడఁగారె
భవద మోఘవాక్య భావామృతముఁ గ్రోలఁ
గా నశించె నిద్రలేని కస్తి
యనుచు గోపకాంత లంభోజనయనునిఁ
బొగడుచుండిరొలిఁ బులకలెగయ. 192

సీ. బ్రహ్మాండ గర్భుఁడీ బాలుఁడాయని యొక్క
వనిత కృష్ణుని యంసమున వహించె
మున్నెత్తెశైల మీ చిన్నవాఁడాయని
చానయొక్కతె శౌరిఁ జంకనిడికె
భూమిపై కెత్తె నీబుడుతడాయని యొక్క
కనకాంగి చక్రి నంకమునఁ దాల్చె
విశ్వరూపముఁ జూపె వీడాజననికంచుఁ
బాణిచే నొకతె గోపాలుఁ లేపెఁ

జెలువలిట్లు తన్నుఁ జేయు నాశ్రిత పరా
ధీనుఁడనెడు బిరుదు తెరలు నను భ
యంబుచేత సులభుఁడై యుండెనెంతటి
వారికైనఁ గట్టుబాటులేదె. 193

సీ. తనపాణిఁ గృష్ణుఁడేపున మోప వేమంది
సరసిజాక్షులు మోవఁజాలరైరి
వంశంబు విసరి తేవలెననఁగా రెండు
వేలకామినులెత్తఁడీలుపడిరి
రోమంబుదీసి జేగుపుడు దవ్వన నాల్గు
వేలంగనలు త్రోయఁ జాలరైరి
హస్తపదంగుళిఁ గదలింపుడని చక్రి
యన నోపరైరెంతొ లైదువేలు

వారిఁగని యింతలోనె మీభూరిశక్తు
లెందుఁబోయె ననంగ నమ్మందయాన
లందఱునుఁ గూడి వందనం బాచరించి
కోరిరి క్షమాపణంబు మురారిఁ గాంచి. 194

ఉ. అంతటి వాఁడ విట్లుసులభుఁడవై మముఁగూడిన కారణంబుచే
సంతసమంది నిన్నిటుల సారెకు నెత్తుట భక్తిగాని దు
ర్దాంత మదంబుగాదురు తిరస్కృతిగాదు మహాత్మ దీని నీ
స్వాంతమునందుఁ జేర్చిన వివాదముఁ జెందరె సుందరీ 195
మణుల్

మ. సురకూలంకషమున్ భగీరథునిచే క్షోణీస్థలిం జొచ్చి దు
ష్కరపాపంబులడంచి దేహితతులం, గాపాడునట్లీవు భా
స్వరకారుణ్యవశుండ వై పొడమియో స్వామీ! మముంబ్రో,
లు పా,మరులంబ్రోచితి పోపునీతులకు నిమ్మార్గంబు నైజం,
బగున్ 196

సీ. కమనీయ దివ్యమంగళ విగ్రహుండవీవు
తాపత్రయీ తప్తతనుల మేము
మంగళదేవతా మానసస్థుండవీవు
శ్రీకృపాలేశ వాంఛితుల మేము
వాణీవిభునిఁగన్న వాల్లభ్యనిధివీవు
సృష్టిలోఁ బ్రథలేని చెలుల మేము
జాహ్నవీభవహేతు చరణాంబుజుండవీవు
తత దురాచార వర్ధనుల మేము
నీవు సర్వజ్ఞుండవు జనానీకమందు
నజ్ఞులము మేము నైన దయాంబురాశి
వగుటఁ జేపట్టితివి పట్టినట్టిపట్టు
వదలకుండుట కీర్తి భవాదృశులకు. 197

క. అలసితిరెల్ల సరోజా
క్షులు కాళిందీజలంబుఁజొచ్చి సుకేళిం
జలిపిన నియ్యాయాసము
తొలఁగుం బోదమిఁకరండు తొయ్యలులారా ! 198

క. హరియిట్లు పలికి నవలా
వరుసలతోఁ జలముఁ జొచ్చు వరనిశఁ దోఁచెన్
వరటావళితో మానస
సరోవరముఁ జొచ్చు హంసచాడ్పున నధిపా ! 199

క. కరిణీ నికరంబులతోఁ
గరిరాజొక మడువుఁ జొచ్చు కరణిఁ గనఁబడెన్
హరిరమణులతో యమునా
శరములలోఁ గేళిసలుపు సమయమున నృపా ! 200

ఆ. అమరనాయకుఁడు సురాపగలో నమ
రీజనంబుఁ గూడి తేజరిల్లు
కరణినొప్పె గోపికలతోడఁ గృష్ణుండు
యమునఁ గేళిసల్పు నట్టివేళ. 201

మ. హరిపాదంబునఁ బుట్టినా ననెడు గర్వాధిక్యమీరాత్రితోఁ
దెరలం జేసి వియన్నదీసదృశనై దీపింతుఁ బద్మాలయా
ధరుడగ్గంబయినందువల్లనని మోదంబందివీచీపరం
పరతోడం బ్రవహించెనయ్యమున భూపాలేశ! మిన్నం 202
దుచున్.

ఉ. శారదరాత్రి గావున ని, శాపతి భూరివళక్షకాంతిఁ దీ
పారుచు గోపికారమణుఁ, డంబు విహారవిలాసమొంచి నీ
హార కణంబులం గురియ, డయ్యెఁ జుమీ చలిగల్గునంచున
మ్మారుతమల్లె వీచుటలు, మానెమహాత్ములకున్నె విఘ్నముల్.

క. కటివేలుపు జలకేళికిఁ
గొంత గలుగునే మొ యనెడు కొంకునవినఁ దే
ద్ధాకాలంబుదయింపక
మఱిఁగొందెను విస్మయముగ మనుజవరేణ్యా. 204

తే. బళిబళీ బాగు మోకాలిబంటి తొడల
బంటి మొలబంటి కుత్తుక బంటి యనుచు
నొక్కరొక్కరి హస్తంబులూఁతగాగ
దిగిరి యమునా జలమున నతీవబోండ్లు. 205

ఆ. నీటిలోన దిగిన నీరజగంధులఁ
బాఱఁజూచి చక్రపాణివల్కెఁ
బూవుబోఁడులార పోవలదిక మీఁద
లోఁతుగలదు గలదు భీతియనుచు. 206

మ. సరసీజాక్షుఁడ మోఘభంగి జలము, ల్చల్లంగ నాభీరసుం
దరులందద్భుతమై చెలంగె లలిఁజి, తాస్వాతి నక్షత్రసం
కరుఁడై శుక్రుఁడు నిల్చువేళఁ గురియం, గాఁదోఁచువ,
ర్షంబుల, ట్లరుసంబొందిరి దిక్పతి ప్రముఖులా హాయంచు,
మురీశ్వరా ! 207

సీ. ఇవె తలంబ్రాలు నీకిందీవరనిభాక్షి
యివియె పన్నీరంబు లిందువదన
యివెమల్లెపూలు నీ కేణాభలోచనా
కస్తూర్యగురులివె కమలగంధి

మలయజ కర్పూరములివె సామజయాన
యావధీరసములివె పావనాంగి
క్రమానుబోధసాంకవములివే చెలీ
పసపునూనియలివె పద్మపాణి

మెల్లభూషణంబులివె నీకు మానినీ
చీరలివియె నీకుఁ జిగురుబోఁడి
యని మురారిచల్లు నంబుకణంబుల
వ్యస్తపూగమయ్యె భామినులకు. 208

సీ. హీరంబులివె వృష్ణివీర కైకొమ్మని
కైరవంబులుసల్లెఁ గాంతయొకతె
పద్మరాగములివె ప్రాణేశ కొనుమని
రక్తాబ్జములు వైచె రమణియొకతె
హరినీలమణులివే యబ్జాక్ష కొనుమని
యిందీవరములిచ్చె నింతియొకతె
సకలవాసనలివె శౌరి గైకొమ్మని
సౌగంధికములిచ్చె సతియొకర్తు

వీని విద్రుమములుగా నెంచుకుని హల్ల
కములొసంగెఁ బద్మగంధియొకతె
వారిభక్తిచేత వనజాక్షుసంబంధ
మునను మిన్నలయ్యె ననలుమాటి. 209

సీ. త్వత్కుచవలయా సౌందర్యంబునకు నోడి
చక్రదంపతులు విషాద మొందె

వరచతుర్గతులు నీ ప్రపదంబులకు లొంగి
మొనసి నీరమునందు మునుగుచుండె
నలచకోరములు నీయూశీతుల్యంబులౌ
కారణంబునఁ బొంగి గగనమందె
మకరముల్ నీజంఘలకు సమానముగాని
చింతచే మడుగులోఁ జేరిడాగె

నీదు వీక్షణములతోఁ దులదూఁగి వి
సార సంఘ మెగురసాగెనని వి
హంగ వాహనుండు శృంగార వచనంబు
లాడుచుండఁ బొంగిరబ్జముఖులు. 210

క. ఈఁత యన నేమొ యెఱుఁగని
శీతాంశుముఖులను నీటఁ జేరిచి యెంతో
చాతుర్యముతో నీదెడు
రీతుల నెఱిఁగించి సంచరించెను హరియున్. 211

సీ. దిగుటకు భయమొంది తీరంబునందుండు
నాతి డించి స్వహస్తమూఁతజేసి
లోఁతునదిగి యీఁతచేతగాక మెలంగు
చానతుందము క్రింద శయమునిల్పి
బండెంబుతనతోడఁ బచరించి కొంత ద
వ్వీఁదిన నవలాలనెల్ల మెచ్చి
యెన్నిచెప్పిన ధైర్యమెనయక మోకాలి
బంటినుండెడు లేమఁ బరిహసించి

యలసి తనుఁజేరు సతులఁ బెల్లాదరించి
యుడుగుడుచు నెలంతల నూఱడించి
తాల్మిమీఱంగ నయ్యశోదాసుతుండు
సేసె జలకేళిమింట జేజేలు మెచ్చ.

సీ. సీవాలములఁబోలు శైవాలములతోడ
విలసిల్లఁగాన బల్ వేడుకయ్యెఁ
దావకవళులతోఁదరమైన భంగము
లకలిగియుండుటఁజేసి గరువమయ్యె
నీయాశయమువంటి నిర్మలత్వంబుచే
భాసిల్లుచుంట సంభావ్యమయ్యె
నీయాననమువంటి తోయజంబులచేఁ బ్రి
తీతిఁగాంచుటనుఁ బ్రీతికరమయ్యె

నీదు ప్రపదములకు నిభములౌ తాఁబేళ్ళఁ
బెంచియుంట నాకుఁ బ్రేమపాత్రి
మయ్యె యమునయని మురారాతి చెలులతోఁ
బలుక వారలొందిరలఘుముదము. 213

సీ. భవదీయ దివ్యాంగ వర్ణసమానమై
తులకించు నైర్మల్యజలము గలిగి
తావకీనాక్షి ద్వితయప్రతీకాశమై
తనరారు నట్టి పద్మములఁ బొంచి
తావక హృదయ రాజీవ సాదృశ్యమై
వివరింపరాని గాంభీర్యమొంది

తావక ప్రథమావతారంబులగు మత్స్య
కచ్ఛపంబులను నిక్కముగ నేలి
నీపదాంభోజమందు జనించినట్టి
గంగకు సపత్నియై పేరుఁగాంచి నందు
వలనఁ గాళిందిపూజ్యయై పరఁగెమాకు
నని వచించిరి హరితోడ వనితలెల్ల 214

సీ. పాణులుగానరాఁ బద్మాక్షులీఁదంగ
నరవిందములు పూచినట్టులుండె
వేణులు గానరా విదుషలీదఁగవారి
దావళిదిగి క్రిమ్మినట్టులుండె
వపువులుగానరా వడిలేమ లీఁద శం
పాలతల్ మూఁగిన పగిదినుండె
లపనములుగానరా లలన లీఁదగననే
కాబ్జారులుదయించినట్టులుండె
వంఘ్రితలములుగానరా నబలలీఁద
హల్లకంబులు వికసించి నట్టులుండె
యమునయం దిట్టిభామా చయము లఁగూడి
సలిపె జలకేళి యుపాంచజన్యధరుఁడు. 215

సీ. నీకకుద్మతులకు సైకతంబులకు భే
దము గానరాదయ్యెఁ దలిరుబోఁడి
నీవళులకు వాహినీ తరంగములకు
వాసిదోఁపదుగదే వన్నెలాఁడి

నీహాసమునకుఁ బానీయ ఫేనమునకు
వేఱడంబొదవదో వెలఁదిమిన్న
నీలోచనముల కీ మీలగుంపులకు వే
ఱిమికానఁ బడదయ్యెఁ గమలగంధి

మాటగుఱుతువట్టి మన్నింపవలెఁగాని
వేఱులేదు నీకు విమలవాహి
నీపదార్థములకు నిక్క మంబనుచు వధూ
తతులఁ బొంగఁజేసెఁ దమ్మికంటి. 216

సీ. రక్తాంబుజంబు లేభక్తిఁ గావించెనో
భవదంఘ్రితల సన్నిభంబులయ్యెఁ
బుండరీకములెన్ని పుణ్యములేసెనో
నీ నేత్రముల కుపమానమయ్యె
సౌగంధికంబులే సత్క్రియల్ సలిపెనో
నీ తనూగంధోపమైతనర్చెఁ
గచ్ఛపరుషము లేకరణిఁ దపించెనో
నీయవతారాభిధేయ మొందె

నంతమాత్రమె కాక జన్మాంతరముల
నీకృపనుఁ గాంచినందున నేటికీ భు
నీ. జలంబులు సేవించె నిన్నటంచుఁ
బలికె రాకృష్ణునకు గొల్లపడఁతులెల్ల. 217

క. ఈవిధమునఁ గాళిందీ
జీవనముల వల్లవీవిశిష్టుం డై ల

శ్రీశ్వరుఁడు కేళిసల్పియు
నావల నిట్లనియె నా మృగాక్షులతోడన్. 218

క. తొలిజామునందు మీరీ
స్థలమున కరుదెంచితిరిగదా మీ మదిలోఁ
గల వాంఛితములు దీర్చితిఁ
జెలులార! నికాయ్యములకుఁ జేరుండనినన్. 219

క. నిను విడిచి నిమిషకాలము
మనలే మదియట్టులుండె మావారలు గై
కొనఁ జూతురె యన వనితలఁ
గని పలికెన్నందసుతుఁడు కారుణికుండై. 220

క. నామహిమాతిశయంబున
నేమనఁగాలేరు యుష్మదీయులటగుటన్
గీములకుఁబోయి రాతిరి
జామునకొగిరమ్మనంగ సతులు ముదమునన్. 221

క. తడిపుట్టము లాఱెడుపని
వడిగా యోజింపుమనఁ వనజాక్షుం డ
ప్పుడు పుడుకుఁదోడుఁకు బిలిచియుఁ
బొడిబట్ట లొసంగఁజేసి పొమ్మనిపల్కెన్. 222

క. అడుగులు తడబడ గొంతులు
పొడివోవఁగ మానసములు పొగులుచునుండం
దడవున కెట్లో చొచ్చిరి
పడఁతులు స్వగృహంబులందుఁ బార్థివవర్యా ! 223

గోపికలు పగటియందు దుఃఖించుట.

వ. ఇట్లు గొల్లచాన లిండ్లుఁ జొచ్చుటయు నయ్యిండ్ల మగవార లంభోజాక్షుని మాయచే స్వకీయభార్యలు తమ తమ శయ్యాలయం దున్నట్లు తలంచుటవలన గోపికలఁ గోపింప జాలరై రటుపిమ్మట నవ్వల్లవ పల్లవాధరలు గృహస్థ ధర్మంబులగు కార్యంబు లతిత్వరితంబున ముగించి పతి పుత్రాదులకు భోజనపానాదు లొసంగి యందఱు నొక్క రహస్యప్రదేశంబునఁ జేరి పరస్పరంబుగా నిట్లనిరి. 224

క. ఏనాటి భాగ్యమో మన
మా నందకుమారుతో సుమాంబక కేళిం
బూనికతోఁ గావించితి
మానని సురపాళి మెచ్చ నంగనలారా!

క. పోయిన నిశివంటిది మును
పోయిన నిశలందు లేదుపో యొకటియు రాఁ
బోయెడు నిశలోఁ గృష్ణుని
డాయఁగలమొ డాయమో కడకు నేమగునో. 226

క. ఓయమ్మ యేమి సెప్పుదు
నాయినుఁడు పరోపకారియై సహజముగా
నీయెడ నుదయింపనిచోఁ
బాయక గొల్తుముగదే కృపానిధిఁ గృష్ణున్. 227

ఉ. ఈ పగలెంత కాలమున కేగునొ సూర్యుఁడు క్రుంకు టెన్నఁడో
మా పరుదెంచు టెప్పుడొ రమావరుఁడౌ వసుదేవునందనుం

డాపసులన్ మరల్చి ముదమారఁగ సన్నిధిఁజేసిమాపయిం
జూపులునిల్పుటెప్పటికొ సూనశరవ్యథమాన్పుటెప్పుడో.

ఆ. ఇన్నినాళ్లదాఁక నింతయాలస్యంబు
లేదుపగటి పూటఖేదమొప్ప
నెన్నిపను లొనర్చుచున్న సూర్యుఁడుగ్రుంక
డేమి చిత్రమమ్మ రామలార! 229

మ. మనలం గృష్ణునొకే స్థలంబునను జన్మంబొందఁగాఁ జేసి,
యిక్కనకాంగుల్ హరిఁబొందునట్టులుగ సంకల్పించి మే,
లొనర్చె న, వ్వనజోద్భవుఁడుకాని యొండుమఱచెన్,
భాస్వంతుఁ డాకుండఁ జే, సినిశన్ నిల్పిన మేలుగల్గునుగదా,
శ్రీకృష్ణుతో నుండఁగన్. 230

క. ఎల్లపుడు పగలొనర్పమి
చెల్లదనిన నందు సగముసేసిన వాణీ
వల్లభు నెవరేమందురు
వల్లవరమణులు సుఖంబు వడయుదురుగదా! 231

చ. దినము జఘన్యవస్తువు లదేపనిగాఁగని పాపమొందు మా
కనులు త్రియామయందయినఁ గంజదళాక్షునిఁ గాంచి
పూతమౌ, నని తలపోయ నప్పడవు డడ్డమువచ్చును
తెప్పలిట్టి కూ, డని పని యెట్లొనర్చె నకటా! నలుమో
ముల వేల్పెఱింగియున్. 232

మ. కడియంబుల్ వదులయ్యె బ్రామానుపడె నంగంబుల్ మనో,
నీరజం, బుడికెన్ నిల్వదుచేల మిత్తనువు బిట్టూటాడె

గోవిందుఁ గోల్పడుటం జేసి తదీయదర్శనము సంప్రా
ప్తించు నందాఁక నా, యొడలం బ్రాణములుండు పద్ధతిని
మీ, రూహింపరే ప్రముక్కేదరా. 233

ఉ. ఏలజనించెఁ గృష్ణుఁడిట నెందుల కిన్నవలాలకెల్ల గో
పాలునియం దదభ్రమగు బాళిజనించె జనింప నెంతయో
మేలొనఁగూడెఁగాని యిఁకమీఁదటనొక్క నిమేషమైన శ్రీ
లోలునిఁ బాయకుండఁగఁ జెలుల్ సుఖముండు నుపాయ
మెద్దియో.

క. విరహాగ్ని నోర్వఁజాలక
మరణించెదమన్న దెగవు మానసములహో
ధర బ్రతికిన గోవర్ధన
ధరుఁ బొందఁగవచ్చు ననెడు తాత్పర్యమునన్. 235

క. అని గోపిక లా కృష్ణునిఁ
గననిక తన విరహబాధఁ గైకొని యుద్వం
గను తామరసాప్తుడు క్రుం
కెను సంధ్యాకాలమయ్యె క్షితి భృత్తిలకా. 236

క. అప్పుడు వల్లవకామిను
లొప్పుగ గృహకృత్యములు సముద్విగ్నమతిం
దప్పించుకొని పరస్పర
మిప్పగిది వచింపఁ దొడఁగి రిందుకులేశా. 237

మ. కడచెన్ గండము భాస్కరుండరిగె రిక్కల్ పుష్కరస్థానముం
దడరెన్ జక్కవజంట బాసెను విహంగానీకముల్ నీడముల్

వడసెందమ్ముల తెల్విదప్పఁగలుపల్, వర్ధిల్లె నా నందపు
త్రుఁడు వచ్చుం బసుల౯ మరల్చుకొని సం,తోషంబుతో
మానినీ. 238

సీ. వరశృంగిణీ ఖురస్ఫురితమై లేచిన
భూరేణుపటలం బపారమయ్యె
నంభారవంబులు తూధిక ధ్వానంబు
లోక్కటియై దెసల్ పిక్కటిల్లె
మూఢులమానసమ్ముల నైనఁ గరఁగించు
వేణునినాదంబు విస్తరిల్లెఁ
దోడుకులఁ గావ వెంబడిపోయినట్టి మా
ణవకు లన్నార్థులైనట్టులందుఁ
జేరిరివియెల్ల యోజింప శ్రీనిధాన
మైన కృష్ణుండు దాపయ్యెనని తలంతు
నమ్మహాత్ముని కడ కేగి నట్టులైనఁ
దీఱు నీ బాధలనియె సాధ్వీచయంబు. 239

సీ. కనకాంబరుని పాదమని పేరుగసినట్టి
వినువీధి కనిపించె గొనబుమీఱి
జలజాతు తెలినఖంబులఁ బోలె నలరు చు
క్కలుదోఁచె నలనింగిలలితభంగి
దరపాణివర ముఖాంబురుహంబు సరిదూఁగు
హరిణాంకుఁడగుదెంచె నరుస మొప్ప
మురవైరి స్థిరయశోత్కరము వైఖరిమహా
త్తరమైన కౌముది విరివిఁజెందె

నారఁ బీని నెల్ల నరయ యశోదాకు
మారుఁడీహితోడ మందఁ జేరు
సమయమయ్యెఁ గాన సాధ్వీమణులు లెండు
పోదమిపుడు శౌరిఁ బొందఁ గోరి. 240

క. మనపాలి భాగ్యదేవత
యనఁదగి విలసిల్లె రాత్రి యటు మీఁదవిధుం
డనుకూలుండై వెలిగెను 241
వనజాక్షుని చెంతకేగవచ్చు మనమిఁకన్

క. కడచసన రేయి వేగిర
పడిపోయితి మట్లుగాదు భామినులారా!
తడఁబాటు లేక కృష్ణుని 242
కడకుం బోవ వలయు మిగుల గౌరవ శక్తిన్.

సీ. పగలెల్లఁ బనులచేఁ బ్రభవించు స్వేదంబు
తొలఁగఁ బన్నీటిచే జలకమాడి
కలిగొట్టుపూలు మల్లెలు మొల్లలును జాజి
విరులు సంపెఁగ ననల్ వేడ్కఁ దాల్చి
పూనూనె కస్తూరి పునుగను బోధంబు
మలయజాదుల దేహముల నలంది
మూల్యంబు గల వస్త్రములు తళతళలాడు
కంచుకంబులనుఁ జక్కఁగ ధరించి
పరిమళంబు గలిగి పసుపు దప్పని పూస
రములకొన్ని కేల నమరఁ బట్టి

మనముపోవ వలయు వనజాక్షుకడకని
చానలందఱట్లు సలిపిరార్కి. 243

క. గేములనుండి వెడలియా
భామలుహరికడకుఁ బోవ బంధుజనచయం
బేమన కూరక యుండిరి
దామోదరు మాయచేత ధరణీ నాథా! 244

వ. గోపికలిండ్లనుండి వెడలినప్పు డాయాసదనంబులందు నట్టి వామామణులుండునట్లు శ్రీకృష్ణుండు స్వకీయ యోగ మాయాబలంబున సృజించి పనిచి తెల్లవారు నప్పు డదృశ్యంబు సేయుచుండు మరల వల్లవకాంతలు గృహంబుల కరుగుచుందు రీరహస్యంబు హరితోడఁ గ్రీడించు కాంతలకుఁగాని తదీయ సంబంధులకుఁగాని తెలియదయ్యెంగాని దేవతలెఱింగి యాశ్చర్యంబొంది నిలింపులమై చెడితిమి గోపికలమైనచో శ్రీకృష్ణునితో భోగించి కృతార్థులమౌదుముగదా యని చింతిల్లుచుండి రదియట్లుండ నవ్వల్లవవల్లవాధర లుల్లాసంబున విజృంభించి సర్వాలంకార భూషితలై. 245

సీ. కర్ణికాగ్రైవేయ కలలంతిహారాది
స్వానంబు లొగిఁజటచ్చటయనంగఁ
గవ్రహాంగదోర్మికా కంకణాదులఁబుట్టు
శబ్దజాలము ఝణంఝణయనంగ
సురుచిరవలయ నూపురసముద్భూత ని
స్వనములెల్లెడ ఝళంఝళయనంగ

రశనాకలాపస్థ రమణీయకింకిణీ
ఘననినాదములుగల్గల్లనంగ
బయలు చేరి యొయ్యారంబు బయలుపడఁగ
గంధసింధుర గమన సంకలితలగుచు
నడచి వేవేగ బృందావనంబుఁ జేరి
కామినులు దేవకీపుత్రుఁ గాంచి రలమి. 246

మ. వరచాంపేయ ప్రసూనగుచ్ఛములొ దివ్యత్తారకా
రాట్కలా, పరివారంబులొ పాలవెల్లియలలో భర్మాంబు
జాతంబులో, సిరులో విద్రుమపంక్తులో యనఁగ వాసిం
గాంచి యా భీరసుం, దరులా కృష్ణుని చుట్టుముట్టిరొగిఁ
గందర్పవ్యధాస్వాంతలై. 247

సీ. శంపాలతలభంగి సతులు భాసిల్లంగ
నీలాభ్రమట్లు గోపాలుఁ డొప్పె
లతలమాడిరి కళావతులు రాజిల్లఁ జెఁ
కల్పమాకుమాడ్కి శ్రీకాంతుఁ డమరెఁ
బసిఁడి సలాకలట్లు సువాసినులు గ్రాల
శ్యామోపలాద్రినాఁ జక్రి వెలసె
నక్షత్రములపోల్కి నాతులు కనుపట్ట
ధవళాంశులీల నందజుఁడు దనరె
నీవిధమున నందనందీవరాక్షులా
పద్మనాభు పాదపద్మముల క

నేళ వందనములు నిర్మల భక్తితో
నాచరించి యిట్టు లనిరి హరికి. 248

క. నినుఁ బాసి యలమటించిన
దినమొకయేడయ్యె మాకు దేవా! నీ చెం
తనె నిల్చి కొలుచు మార్గము
పనివడి యోజింపుమయ్య పాపవినాశా. 249

క. పనులెన్ని యున్నఁ జేయం
జన వింద్రియములు త్వదీయ సాన్నిధ్యంబే
యనిశంబుఁ గోరుచున్నవి
గనుకట్టి వరమ్ము నిమ్ము కమలదళాక్షా. 250

ఆ. సురుల కర్హమైన వరపురోడాశంబు
శ్వానమున కనర్హమైనరేవ
నిన్నుఁ బొందినట్టి నీరేజలోచన
లన్యుఁ బొంద నర్హలగునె కృష్ణ. 251

వ. అని యనేకవిధంబుల వచించి. 252

సీ. మంగళస్నాన మేమటుల పన్నీటఁ జే
యించి వస్త్రంబులర్పించి వేడ్క
బనిబూని తెచ్చిన భక్ష్యభోజ్యాదులం
చితరీతి నచట బోసేయఁ బెట్టి
పూనూనెఁ గురులకుఁ బూసి చిక్కులు దీసి
ముడివేసి పూసరమ్ములను జుట్టి

సుమమాలికలుకొన్ని క్రమముగా గళమున
ధరియింపఁజేసి మీఁదటనుఁ బుష్ప
హారచయములు కొన్ని కేయూరములుగఁ
గంకణమ్ములుగా నలంకారమొలిఁ
జేసి వసుదేవసుతుని వీక్షించి మలయ
జాబలందిరి యీ గొల్లచానలెల్ల. 253

సీ. చక్కలగిలి వెట్ట సందియం బొద వేసి
దనుజార్య జినమృదుత్వంబు నెన్నఁ
బలు కెంపు లొనరింపఁ దలపొప్పకున్నదీ
యరిపాణి సౌకుమార్యంబుఁగన్న
జందురు కూనలుంచఁగ శంకగల్గె నీ
వసుదేవసుతుని లావణ్యమరయ
గాఁగింటనదుమ హృత్కమలంబు జంకె నీ
మురవైరి శైశవమ్మును దలంప
నట్టులంచు మాని నల్లైనవ్యర్థుల
మగుదు మిందు సంశయంబులేదు
గాన కృష్ణుతోడఁ గలియుట కర్తవ్య
మనిరి గొల్లచెలువలంద తెలమి. 254

సీ. అజినముండియును లేనట్లుండుఁదావక
స్పర్శంబు లేనిచోఁ బ్రాణనాథ
కన్నులుండియు లేనిగతిఁదోచు నీదు ద
ర్శనము లేకున్నచో జగదధీశ

శ్రవణంబులుండి లేనివగఁ దోఁచును భవ
ద్వాక్యమొందనినాఁడు వన్నెలాఁడ
ఘ్రాణముండియు లేనిగతినొప్పు నీ తనూ
గంధమందనినాఁడు ఖలవిదార
రసనగల్గియు లేనట్లు వ్యసనమబ్బు
నీ యధరపాన మొందని నిశను దేవ!
యనుచు నంజలు లర్పించి వనితలెల్ల
సన్నుతించిరి కృష్ణు నాసక్తితోడ. 255

చ. నిధులు గడించినట్టులవనీతలమెల్ల గడించినట్టులా
సుధఁ గొని త్రావినట్లు బలసూదను పట్టముఁ గాంచినట్లు భూ
రిధనముఁ గూర్చురీతిని విడించి పదంబునుఁ బొందినట్లు మ
న్మథ జనకా! నినుంగనిన మాకొదవున్ ముదమెల్ల వేళలన్.

వ. అని పలుమారులు వచింపుచున్న భామామణుల నాదరించి యందఱికొఱకు నన్ని కృష్ణరూపంబులు ధరించి. 257

సీ. తీఱెనే నీవాంఛ నారీమణీ యని
తన చెక్కు దాని చెక్కున నమర్చి
ఫలితమయ్యెనె నీదువలపు భామా యని
చాచులు రెండుహస్తములఁ బట్టి
చక్కఁబడెనె సంతసము రమణీయంచుఁ
బుక్కిటి విడియము ముంపుగ నొసంగి
తొలఁగెనే నీ శ్రమం బలివేణి రో యనుచుఁ
బరిరంభసౌఖ్య మేర్పడఁగ నిచ్చి

రతులఁ దేలించి శృంగారరసముఁ బెంచి
భ్రమలు దొలఁగించి పరియాచకములముంచి
సతుల నలరించి యానందసుతుఁడు మించి
తనరె నూర్ధ్వరేతస్కుఁడై ధరణినాథ. 258

సీ. తనయమ్ములనుఁ జిమ్ము తరుణమ్మి దేనని
దర్పకుం డలరుకోదండమూనెఁ
దనతాఁకు పెనుటీకుఁ గను సావి దేనని
మలయమారుతము దీమసము సూపె
దనదీప్తిమనుప్రాప్తి చనుదెంచెనని రేఁగి
యుల్లాసమొప్ప జాబిల్లి వెలిఁగె
దననిక్కుఁ గని చొక్కుఁ గనదిక్కు దేనని
యలవసంతుండు పెల్లాడఁ దొడఁగె

నట్టివేళఁ జెలువ లధికకామమున మై
మఱచియుండ దైత్యమర్దనుండు
వారిఁ దేర్చెఁ గాని వలపుచే నావంత
యైనబాధఁ జెందఁడవనినాథ. 259

ఆ. ఇంద్రియముల కెల్ల నీశుఁడౌటను హృషీ
కేశనాముఁ డనుచుఁ గీర్తిఁ గన్న
యచ్యుతుండధోక్షజాఖ్యుండు పగులచే
మోహమొందు టెట్లు దేహివర్య. 260

సీ. చరణారుణాబ్జముల్ శర్కరావనిసోఁకి
కమలెనటంచు హస్తములనొత్తి

యటులిటులూఁచంగ హరి నీశయములెంత
సలఁగెనోయనుచు స్తనముల మోపి
పలుమాఱు మాతోడ భాషింపనోరెంత
గా వాడెనోయని మోవులొసఁగ
గమనంబుచేఁ ద్వాదంగంబెంతనొచ్చెనో
యనుచు నూరులఁజేర్చి యాదరించి

యొక్కరొక్కరు కౌఁగింట నొక్కి నొక్కి
వెలఁదులిమ్మాడ్కి వేదాంతవేద్యునందు
జరుపు పనులనుఁజూడ నాశ్చర్యమయ్యెఁ
జుమిజగంబులకెల్లఁ జంద్రముఖులేశ. 2

సీ. మా సమాధులఁబట్టఁగా సాధ్యపడని యా
దేవుఁడేగతిఁ బరాధీనుఁడయ్యె
మాపుణ్యచయముల కేపాటిలొంగని
యాదిపురుషుఁడెట్లు లగ్గమయ్యె
మాశోయగముల కేమాత్రంబు లొంగని
జలజాక్షుఁ డేరీతి సులభుఁడయ్యె
మాస్తోత్రముల కొక్కమాఱు నుపొంగని
సర్వేశ్వరుండెట్లు సాధ్యుఁడయ్యె

గొల్లచెలువలకనుచు యోగులు కిలింపు
లమరకాంతలు వేదశాస్త్రములు చెప్ప
కొని మహావిస్మయంబుఁ గైకొని నుతించె
నేమిచెప్పుదు నీకు భూమీశ్వరేశ. 202

సీ. అమృతంబిడెనుగాని యరసి ప్రేమామృతం
బిట్లీయ లేదంచు నెల్లసురులు
ననుసృష్టికర్తగా నొనరించెఁ గాని యిం
త చనువీ లేదంచుఁ దమ్మిచూలి
యమరీజనులఁ జేసె మమ్ముఁ గాని యెన్నఁడీ
వగభోగ మీడంచు స్వర్గసతులు
లోకపూజ్యులఁ జేసెనే కాని మమ్మి స
న్మానింపఁ డిట్లని మానివరులు

చెప్పుకొని విస్మయంబునుఁ జెంది సన్ను
తింపసాగిరి గోపసాధ్వీచయంబు
తోడ జతఁగూడి కృష్ణుండు క్రీడసలుపు
సమయమునఁ గౌరవాన్వయజలధిచంద్ర. 263

హేమంతవర్ణనము

ఆ. చక్రహస్తుఁ డిట్లు సరసిజాక్షులఁ గూడి
కేళిసల్పెఁ గొంతకాల మంత
లోనడాసివచ్చె లోకముల్ వడకింపఁ
జాలినట్టి శీతసమయ మధిప. 264

ఆ. రాజశాసనము నిరాకరించెడువాఁడు
యమునకైన మిత్త్రికైన జడువ
కుండువాఁడు మొండిగుండెవాఁడు వడంకఁ
జొచ్చె శీతబాధ హెచ్చినపుడు. 265

తే. జాముప్రొద్దుండగాఁ లేచి స్నానమునకుఁ
జదువుఁగొనుటకు మఱివ్యవసాయమునకు
నరుగువారప్పనులు సేయనలవిగాని
కతనను హుహూ యనిరి చలికాలమందు. 266

ఉ. సన్నపునూలి బట్టఁగిఁక సౌఖ్యము లేదని తీసివైచి యా
వన్నరవారమమ్ముదుగు వస్త్రములున్ బలుపచ్చడంబు లె
న్నెన్నియొరల్లకంబులును నింపగుశాల్వలు నంగరక్షలు
త్పన్న కుతూహలంబమరఁ దాలిచె నాచలిసావి భూ
వరా !
267

క. పవలెల్ల జగచ్చక్షుసి
దివసాంతంబైన నగ్ని దేవునిఁ గోర్కెన్
భువిఁగల శరీరతతు లె
ల్లనడంకడగించుకొఱ కిలావరతిలకా ! 268

తే. చంద్రకిరణ ప్రసారవిశ్వాసముడిగె
రుచిదొలంగెను మలయమారుతమునందు
నాశ్రయాశునియందు మహానురాగ
మెల్లజనులకుఁ గలిగె భూభృల్లలామ. 269

క. ఇది హాదనని మరుఁడు సుమ
ప్రదరములకుఁ బదును వెట్టి బలువడి నేసెన్
సుదతులపైఁ బురుషులపై
నది హేతువుగాఁగఁ గలిసిరయ్యిరు తెగలున్. 270

క. పలువల నేకముగప్పినఁ
దొలఁగని చలిపురుషునకు వధూస్పర్శముచేఁ
దొలఁగెఁ లలనకుఁ బురుషుని
వలననడఁగె శీతబాధ వసుధాధీశా. 271

ఆ. స్పర్శసుఖములోని సారంబు విశదమై
పొలిచెఁగామినులకుఁ బూరుషులకు
నొక్కరొకరితోడ నొరసి పరుండంగఁ
జలినశించుఁగాదె క్ష్మాతలేశ. 272

ఉ. శూరులు ధైర్యశాలురును, క్షోణితలేశులు శీలవంతులుఁ
సూరిజనాగ్రగణ్యులు యు, శోనిధులుఁ మహనీయ
దాతలుఁ। గౌరవనీయులుంగవులు, కర్మఠులుఁ వటులుఁ
జటుల్ నిశా। తరుణమునందుఁ గామినులఁ, దాయఁదలం
చిరి శీతబాధచేఁ. 273

క. వారక వర్షము గతి నీ
హారముగురియంగ నప్పుడద్రులు పారా
వారంబులు నీరంబులు
పైరులరణ్యములు తెల్లబాఱె నరేంద్రా. 274

సీ. నిద్దురమాని పైనిఁగల చేలము దీయ
వపువునందేవియో వ్రాఁకినట్లు
శయ్యనుండి తొలంగి చరణము ల్ధర మోపఁ
గనెయేవియో గ్రుచ్చుకొనినయట్లు

పానీయఘటములలోఁ బాణులుంచిన సందు
గట్టిగా నేవియో పట్టినట్లు
స్నానార్థమై నదీజలములఁదిగి తాఁకఁ
గా దానవేవియో కఱచినట్లు

తోఁచుచుండెను మనుజ సందోహములకు
నేమిచేయుట కెచ్చటి కేగుటకును
సాధ్వసంబయ్యె నా శీత సమయమందుఁ
గంప మొందని జంతువొక్కటియు లేదు. 275

మ. కరులం దోలెడువాఁడు పెద్దపులులం గాలించువాఁడుర్వ
మహోత్తర సింహంబులఁజంపువాఁడు ఫణులన్ దట్టించి
యాడించువాఁ, డుగ్రమంత్రౌషధ సిద్ధులన్నేరపు వాఁ
డుచ్చాటనాకర్షణా, దిరహస్యంబులు నేర్చువాఁడు వెలి
వొందెన్ శీతబాధాప్తిచేన్. 276

వ. ఏతత్సమయంబున శ్రీకృష్ణదేవుండిట్లని వితర్కించె నిప్పుడు
శైత్యనీహారంబులచే సమస్తజంతుకోటియు వడంకుచున్నది
సద్మంబులు లేక నిరాధారంబైన బృందావనంబున రాత్రి
కాలంబునందుఁ గామినులకు సౌఖ్యంబొనఁగూర్చు టెట్లని
యాలోచింపుచుండ నతండమోఘ సత్యసంకల్పుండగుటం
జేసి యారాత్రియందు. 277

సీ. శంఖ ముకుంద కచ్ఛపకుంద పద్మాది
నవనిధుల్ యక్షరాణ్ణగరినుండి

మహిమాణిమాగరిమా వశిత్వాది వి
భూత్యుత్కటము శివపురమునుండి
వెలిగిడ్డి వెలి చెట్టు తలఁపుమానికములాఁ
దైవతాధీశు పత్తనమునుండి
గడియలో వివిధసర్గములు నిర్మాణించు
సిద్ధులవ్యాఘ్రాజాని చెంతనుండి
వచ్చిబృందావనస్థుఁడౌ వాసుదేవు
సన్నిధానముఁ జేరి విశాలభక్తి
నంజలులొనర్చి నామధేయములుదెల్పు
కొని పనులు మాకుఁ గల్పింపుమన మురారి. 278

పంచచామరము.

దరస్మితంబొనర్చి వానిఁ దారసించి మీరధీ
శ్వరాజ్ఞలొంది వచ్చినారు శైత్యమేగుదాఁక స
ర్వరాత్రులందునిల్చి నన్ను, వల్లవాంగనా పరం
పరన్ సుఖింపఁ జేయుఁడన్న, మాటకుబ్బియాడుచున్.

మానినీ వృత్తము

చారుతరంబగు సౌధములింపగు
శయ్యలుమంచములున్ ద్రవిణా
గారములున్ వరగర్భ గృహంబులు
కాంచనహార్మ్యములావల శృం
గారవనంబు లగాధసరోవర
కాండములున్ శశికాంతమణీ

వారయుతాద్భుత వస్తుగృహంబులు
వర్ధిలఁ జేసె సృజించిరహీన. 280

మ. పరపాదిండులమూల్య చేలములు శం, పాదీపముల్
సౌరభ । స్థిరమై పొల్చెడు వస్తుపూగములు కాం, చీనా
పురాద్యుత్తమా । భరణంబుల్ బలుమానికంబులు నపూ,
పంబుల్ సమృద్ధాన్న శా । కరసాదుల్ దధిసర్పి దుగ్ధ
ములు గ, ల్గంజేసె నచ్చోట్లుల్లన. 281

క. ఆ యంసౌధంబులలో
నాయెడ నివసించి కృష్ణుఁడద్భుతరీతిన్
వాయించె వేణువాద్యధ్వని
చేయువతులు పంకజాక్షుఁ జేరిరి లేశా.

వ. ఇట్లు సమీపించి యచ్చటఁ గల కాంచనమయసౌధ
ప్రాసాదహర్మ్య శుద్ధాంతమండపప్రాకార కుట్టిమ వాతా
యన ప్రతీహార వేదికా తోరణస్తంభ గోపురకవాటార్గళ
ప్రఘాణంబుల వైభవంబును దివ్యవాపీకూప సహస్రంబు
లనుఁ గుముదకల్హార నీలోత్పల పుండరీక కోకనద బక
బలాక మరాళ రథాంగ జలేభజల తామ్రచూడ సమేత
సమృద్ధజలాశయంబులనుఁ దత్సమీపంబునందున్న గోపం
ధుని దర్శించి యమందానందంబుఁ జెంది నమోనమో
యని యాకృష్ణుని సన్నుతించి యిట్లనిరి. 283

క. నీ దివ్యకరుణ మాపైఁ
బాదుకొనుటచేత నిట్టి ప్రమదావన ప్రా

(26)

పాదంబులు పాదంబులు
మోదంబులు గలిగ ఖేదములు వినశించెఁ. 284

క. నీఋణముదీర్పఁజాలము
నారాయణ సర్వవిధ జననముల దాసీ
వారలమై సేవింతుము
నీరమణీయాంఘ్రి యుగము నిశ్చలభక్తిఁ. 285

క. వేదములకు నందని నీ
పాదాబ్జము లిపుడు మాకుఁ బ్రాప్తించిన భా
గ్యోదయ పరిమిత మింతనఁ
గాఁదగునే బ్రహ్మకైనఁ గంజదళాక్షా. 286

ఆ. కుంటివానిమీఁద గొబ్బునసురనది
పాఱినట్లు మూఁగవానినోర
నఖిలశాస్త్రచయము లగ్గమైనట్లు ప్రా
ప్తించితీవు మాకు దితిజవైరి. 287

వ. అని యిట్లనేక విధంబుల గోపాలదేవుని సన్నుతించి 289

సీ. సుడివాలుతాల్పరి మెడమీఁదఁ గేలుంచి
యుదిరి డోలికలలోఁ నూఁగియూఁగి
కటివేల్పుహస్తంబుఁ గరమునఁ గీలించి
వరచంద్రశాలలఁ దిరిగి తిరిగి
శ్రీకృష్ణునగ్రమందేక పాత్రమున న
మృత సమాహారంబు మెక్కిమెక్కి
హరితోడ హేమ పర్యంకస్థ మృదుల త
ల్పమునందుఁ గూర్మితోఁ బండిపండి

గోపబాలుని మార్దవాలాపసుధనుఁ
బూని శబ్దగ్రహంబుల నానియాని
ప్రొద్దుపోదుచుట క్రుంకుట మ్రుక్కదరాంద్రదు
తెలియ కైరి మహానంద కలితలౌట. 288

సీ. ననుముద్దు వెట్టి చుంబనమీవొసఁగనిచో
బుణపడుదువుగదా వృష్ణివర్య
నాయీ స్తనముఁబట్టి నీయురంబీకున్న
లోభివాదువుగదా శోభనాంగ
ననునవ్వి పరిహాసమునకు లొంగకయున్న
ధర్మమొప్పదుగదా ధన్యశీల
నాకరంబుఁ గ్రహించి నీ కరంబిడకున్న
రసికు లీకొందురే రాధికేశ
గొప్పవాఁడవైన గొప్పతనము విచ
క్షణుల సభలయందు సాగుఁగాని
నెలఁతలందుఁ జెల్లునే యనికృష్ణుని
తోడననిరి గొల్లచేడెలెల్ల. 289

సీ. జన్యరంగమునందు శత్రునాశ మొనర్పఁ
గావంగదే మహాకార్ముకంబు
సస్యంబులకునీరు సమకూర్చుటకు ఘటీ
యంత్రంబు నమ్రత్వమందుఁ గాదె
ఫలలతాంత భరంబుపై కొసినప్పుడా
నతభావమొందదే క్షితిరుహంబు

ఘన పిపాసాశాంతికై వంగదే సరో
వరముఁ జొచ్చినవేళ వారణంబు
రసికులౌ పూరుషులు వధూరత్నములకు
లొంగుచుండెద రారీతి లొంగరేని
వారు మూర్ఖులుసుమ్ము భూవలయమందు
నీవెఱుంగని దుండునే నీరజాక్ష. 290

సీ. ఏకకాలమున మమ్మందఱి లాలింపఁ
బురుషోత్తమత్వంబు స్థిరతఁగాంచె
నతివలందఱిఁ గలహములేక మెలపంగ
దక్షిణనాయకత్వము ఫలించెఁ
బ్రతిభామకడ నొకే పర్యాయముంట స
ర్వవ్యాపకత్వంబు వాసిఁగాంచె
నిందఱితో భోగమంది డీల్పడకుంట
సర్వాధికత్వంబు సత్యమయ్యె
దేవ! తావకీన దివ్యప్రభావంబుఁ
దెలిసి యిట్టిదని నుతింప బ్రహ్మ
కైన నలవిగాదహో మాకుశక్యమా
యనిరి గొల్లచాన లవనినాథ.

సీ. అల్పకాలము ప్రాకృతాంగార్థమై యొప్పు
చక్రవర్తిపద ప్రసక్తిమాని
చేసినపుణ్యంబు క్షీణింపఁగనె క్రిందఁ
బడఁద్రోయు దేవేంద్రపదము దాఁటి

పరిమితకాల మేర్పడఁబునర్జన్మ మెుం
దఁగఁజేయు బ్రహ్మపదంబుఁగేరి
నిన్నునీ ననుభవింపుమనుచు జీవాత్మను
బంధించు కైవల్యపదముఁగినిసి

నీ పదంబులు విడక ధ్యానింపుచుందు
రఖిలపదముల శాశ్వతం బనుచు నెఱిఁగి
యర్థపంచకజ్ఞానాఢ్యులైనవారు
లాఁతిమానిసు లరయరీరీతిఁ గృష్ణ. 292

ఉ. ఏనుఁగులుండు గుఱ్ఱముల, నేకములుండు మహాధనంబులు
ద్యానవనంబులుండు ఘనధాన్యపురాసులుగల్గి యుండు నా
నావిధులుండుఁ గొల్చెడుజనంబులు నెద్దులు గోవులుండుసు
జ్ఞానముపాయకుండు ననిశంబు నరాళికి నీకృపన్ హరీ!

మ॥ సిరులుండుం బ్రబలాయువుండు వరదాసీదాస సంఘంబు
సు, స్థిరమైయుండు నమోఘవిద్యలు సదాచిత్తస్థమైయుం
డుఁ గిం, కరులై వైరులు లొంగియుండ్రుదుఁ దరుణీ కాండా
త్మఁ నారోగ్య భా, స్వరకీర్తుల్ బలముండు మర్త్యునకుఁ
గృష్ణా! నీ కృపాలబ్ధిచేన్. 294

క. సత్వము నిరుపమ సరస క
విత్వము రాజత్వమును వివేకత్వము మా
నిత్వము దేవత్వము బ్ర
హ్మత్వము నీకృపనఁగని మహత్వముఁ గృష్ణా. 295

క. సత్యము సుజ్ఞానము సా
హిత్యము గానంబు ధైర్యమింపగుపాతి
వ్రత్యము తుదకు జనన రా
హిత్యము దేహులకు నీవయీవలెఁగృష్ణా ! 296

క. కలుషంలు సుఖాస్పదంబగు
నెలవులు సుక్షేత్రములును నిష్కపటములు మేల్
కొలుచులు నిలుచును నీకృప
గలిగినచో మానవులకుఁ గమలదళాక్షా. 297

క. మనుజత్వము పురుషత్వము
వనితాత్వము ఘోరదానవత్వము విద్యా
వినయత్వంబులు జీవులు
గనిరి భవచ్ఛాసనమునఁ గమలదళాక్షా 298

క. నరకమురాదెప్పుడు పే
దరికము వెంటనెతొలఁగు ధనవంతులచు
ట్టరికమువచ్చు సభలఁ బె
ద్దరికము ప్రాప్తించు నీదు దాసులకు హరీ ! 299

క. అనివచియించినగోపీ
జనసంఘము నాదరించి సంతోషము తో
డనిశల్ జరుఁపగఁ జనె హా
యనములు వ్రేపల్లెఁ గొన్ని యువనీ నాథా! 300

క. హరితోఁ గలిసిన సంవ
త్సరములు నిమిషంబులట్లు చనియెన్ గోపీ

వరవర్ణినులకుఁ గృష్ణుని
దరియానందముల కెల్ల దావఁగుఁ గాదే. 301

వ. ఇట్లు శ్రీకృష్ణుండు వల్లవలలనామణుల నపరిమితానందం
బునఁ దేల్చుచుండె నను వృత్తాంతంబు శుకుండు పరిక్షి
న్మహారాజున కెఱింగించె నంత. 302

ఉ. ఇంద్రకుజాపహారి దివసేంద్రసుతా హృదయేశ కంస రా
జేంద్ర గజేంద్రసంహార మృగేంద్ర పరాక్రమ కాళియా
ఖ్య నాగేంద్ర మదావనీధర సురేంద్ర సురేంద్ర కరీంద్ర
చంద్ర గోత్రేంద్ర గిరీంద్ర నారదమునీంద్ర సమాన
యశోధురంధరా. 303

క. కుందారరూప సన్ముని
మందార జగన్నివాస మధుసూదన గో
విందా! వందారు జనా
నందా ముచికుందవరద నరసవ్యేంహా! 304

ఇది శ్రీ సీతావల్లభప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల సీతా
రామాచార్య కృపాలబ్ధ మంత్రరత్నానుసంధాన పవిత్రాంతరంగ నిఖిల
దుర్మతశిలోచ్చయ దంభోళీభూత సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ
బోధిత విశిష్టాద్వైత రహస్యార్థధురంధర శఠగోపయతిరాడ్వర వరయోగి
ప్రభృతి పూర్వాచార్యచరణసరోజ భ్రమరాయమాన మొవ్వవంశతిలక
కృష్ణాంబాకృష్ణార్యతనూజ శ్రీవైష్ణవవిధేయ వేంకటదాసనామధేయ ప్రణీ
తంబైన గోపికావిలాసంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము

సంపూర్ణము.

# గోపికావిలాసము

## తృతీయాశ్వాసము

---

శ్రీ రాధాహృదయేశ్వర
నారాయణ పౌండ్రకాది నరనాయక సం
హార జరాసంధాది మ
హారథ గర్వాంధకార హారిదశ్వహరీ!

వ. అవధరింపు మటుపిమ్మట రాజవర్యునకు యోగివర్యుండిట్లనియె నట్లు జగన్నాథునితో గోపాలాంగనలు సమస్త భోగంబులందుచుండ నొక్క సమయంబునఁ గంసుని పంపున నక్రూరుండు బృందావనంబునకు వచ్చి శ్రీకృష్ణుని దర్శించి ప్రదక్షిణ ప్రణామంబు లాచరించి వచ్చిన సమాచారం బెఱింగించి మధురకు రమ్మనుటయు నప్పుండరీకాక్షుండలరి తన దివ్యచిత్తంబున నిట్లని వితర్కించె నింతవరకు భక్తపరాధీనుండనై తదీయ వాంఛితంబులు నెఱవేర్చితి నిప్పుడు కంసాది దుష్టుల వధించు సమయంబు వచ్చె నప్పని యొనర్చినంగాని భూభారంబు నివర్తింపదు గదా యని యొక్క దూతికను రహస్య ప్రదేశంబునకుఁ బిలిచి యిట్లనియె.

క. నన్నా మధురకు రమ్మని
మన్ననతో దూతననిచె మాతులుఁడు మదో
త్పన్నమతి కంసభూపతి
విన్నది మొదలు గఁ బ్రయాణ వేదనగలిగెన్. 3

క. తేపరిగెద మధురకు నే
నీపలుకులు గోపికలకు నెఱిఁగింపుము నే
నేపనిఁ బూనివచించిన
నాపదఁ గని పోవనీయరంబుజనయనా. 4

క. నావినియబ్జాభమామణి
భావంబునగుంది గొల్లపడంతులకడ కేం
తో వేదనతోఁ జనిహరి
శ్రీ వచనములెఱుఁగఁ జెప్పఁజేడెలడలుచున్. 5

వల్లవీవిలాసము

ఉ. వెలవెలఁబాఱు మోములును వేపథువొందినదేహవల్లి।
కల్, కళవళమొందుచిత్తములు కజ్జల ధారల పీడుకన్ను।
లుఙ్, జలజలరాలు భూషలునుఁ జాచుటకగ్గముగాని।
యూరువుల్ కలిగి వధూలలామలు వికావికలైరిఁక నేమి
సెప్పుదుఙ్. 6

ఉ. ముక్కున వ్రేలు మోపి యది, మోవులపై దడవుంచి
కొంతసే। పక్కనఁ జేతులుంచియక, టాయని పెల్లుగ
మోది మోదిన। ద్దిక్కులు పాఱఁజూచి సుద, తీయని

(27)

నూర్పులువుచ్చి నేలపై । స్రుక్కుచు వ్రాలి ఘోరముగు,
చూపులచేఁ బెడనవ్వునవ్వుచున్. 7

ఉ. సమ్మెటలీల యప్పిడుగు చాడ్పున వహ్నికణంబు భంగి శ్రో
త్రమ్ములసోఁకె నీట్టిభయదమ్మగు వార్తకటా తదీయ వా
క్యమ్ము నఁజీలిపోక హృదయాబ్జము లెప్పటియట్లనుండె లో
హమ్ములో ఱాలో హీరములో యంచు దలంచెద మానినీ
మణీ. 8

క. మానవజన్మము రోఁత గ
దా నారీజననమందు దౌర్భాగ్యజని
స్థానం బటు గాకుండిన
చోనింత విపత్తు మనకుఁ జొప్పడునె వెసన్. 9

మ. పగలాకృష్ణునిఁ జూడఁజాలక ఘనాపాయంబు సిద్ధించె నే
వగజీవింతు మటంచు నేడ్చి నిశరాఁ బద్మాత్మునిం జేరి సాం
పుగభోగింపుచునుంటి మింతవర కప్పుణ్యుండు దూరస్థుఁడై
పగలున్ రాత్రియుఁదోఁపకుండిన వధూప్రాణంబులిం కేటికే

క. కడచిన నిశవరకాసుడి
యడిదము గలవానిఁ బొందినట్టి మనకుఁ జొ
ప్పడె నీ యాపద త్రుటిలో
గడువఁగ వీల్గాక కలలు గావె సుఖంబుల్. 11

క. కుడియెడమ లెఱుంగని యి
ప్పడఁతుల కొనఁగూర్చెఁ బొందు పద్మాక్షునితో

నుడిలేమ మగండని కడు
వడిఁబొగడితి మింత నెగులువచ్చు టెఱుఁగమిఁ. 12

చ. ఎవనిఁ గుఱింగలించి యిఁక నెవ్వని రూపముఁ గాంచి
ప్రేమతో । నెవని కవుంగిలించి మఱి, యెవ్వనితోఁ బరి
హాసమాడి వేఁఱెవని కపోలముల్ నిమిరి, యెవ్వనితోఁ రతి
కేళి సల్పి చెం । దవలయునమ్మ సౌఖ్యముగ, దాధరుఁ
డౌ మురవైరి లేని చోఁ. 13

చ. కనఁబడుచుందు రెల్లపుడు, గౌరవనీయులు వన్నెలాండ్రు పా
వనులురు ధైర్యశాలురు యు,వానులు సూరిజనుల్
ధనాఢ్యులౌ । జనులు సహస్రసంఖ్యలుగ, త్క్ష్మాతలమం
దునఁనేల కాల్పనే ! మనమధు వైరిగోటికిఁ స, మానము
వత్తురె వారలందఱుఁ. 14

మః మన గోవిందుని సుందరాంగమును సమ్యక్ప్రీతితోఁ
గాంచి పా । వనమై యున్న మదీయ నేత్రములు దే
వవ్రాతముల్ తోఁచినన్ । వనజాతాసనుఁ డబ్బలారిగిరిజా
ప్రాణేశులే తెంచినన్ । గనునే లక్ష్యము సేయునే తనిసి సౌ
ఖ్యంబందునే కామినీ. 15

ఉ. ఎందులకిందు ముందు జనియించితినే జనియించి నా
నుపో । నందునికందు పొందెటుగ, నంగలిగెం గలి గెం
గదా సదా । నందముఁ జెందనీకయొకొ, నాటికి నేటికిఁ
గూటమేదవే । సుందరియంచు వ్రాసెనో యు,జుండు
మరుండిటు లేల వేచునో. 16

శా. జీవింపంగ వశంబుగాదు మనకా శ్రీకృష్ణునింబాసి ని
ర్జీవత్వంబు వహింతమన్న జనులా క్షేపింతురా మీఁద ని
త్యావాసంబులభించు నారకము నందంచున్ బుధుల్
పల్కెడుం,జావుంగానకజీవనంబుగనకేజాడం బ్రవర్తింతుమే.

ఉ. ఒక్కఁడువంచెనంచుభటుఁడొక్కఁడురమ్మని వచ్చెనంచుఁ
దా। నక్కడికేగితీరవలె నంచునుఁ గృష్ణుఁడువల్కుఁ గాని
మీ। రెక్కడ నెక్కడేను ననునేటికిఁబిల్చెదరంచు మాని
యీ। చక్కెరబోఁడులన్ మనుపుసంగతి నారయఁడేమి
చెప్పుదున్. 18

క. ఈనాటికి మధురాపురి
కా నందసుతుండు పోవునటు వ్రాసిన వా
గ్జానిలిపి దిద్ది హాగ నీ
స్థానంబున నిల్పువారు ధరలేరుగదా. 19

ఆ. మేనులుండుదాఁక నీ నందనందనుఁ
గలిసియుండునట్టి గాఢపుణ్య
మాచరించమైతి మకారణమున గొ
అంతగల్గెఁబో నెలంతలార.

మ. యామంబేగెను వచ్చెవచ్చె నిదె మధ్యాహ్నంబు మూ
డయ్యెఁ బో। జాముల్ నాల్గవదేగుదెంచు నిఁక భాస్వం
తుండు గ్రుంకున్ నిశా। యామంబైన మురారిడాసి రతి
సౌఖ్యంబందఁగా వచ్చు నం। చామోదంబున లెక్క
పెట్టు మన మెట్లజ్జాతు వర్జింతుమే. 21

ఉ. మందనునిల్చుటెట్లు పది మందిమొగంబు సూచుటెట్లు శ్రీ
బృందనుఁ గాంచుటెట్లు సుర బృందసపర్యనొనర్చుటెట్లు కా
ళిందినిడగ్గరించి సుఖ లీలజలంబులఁ గ్రుంకుటెట్లు గో
విందునిఁ బాసి పుష్పశర వేదనపాలగు వాసరంబులన్. 22

సీ. హారడిండీర నీహారహీర పటీర
ములఁబోలు వెన్నుని మొలకనవ్వు
శర్కరాక్షీర మోచాఫలద్రాక్షామ
రందసన్నిభము గోవిందువాక్కు
షండమృగేంద్రేభ శార్దూల వైఖరు
లనుకరించు మురారియానరీతి
చాంపేయమల్లికాజాతి పాటలపుష్ప
సమము కేశవతనూ సౌరభంబు
విశ్వమోహన మసురారి వేణుగీతి
గాఢమాధుర్య మచ్యుతు కంఠరావ
మట్టి మహనీయుఁ బాసి యింకెట్లు మనము
జీవములతోడ నుందుమో చెలువలార. 23

సీ. భర్మచేలుఁడులేని పాపిష్ఠి బృందావ
నముఁ జేరుటింకేల నారులార
వలమురితాల్పు చూపుల కధీనముగాని
కైసేఁతలేటికే గరితలార
కటివేల్పుతోడ సాంగత్యములేని శ
య్యనుఁబండుటెందుకే వనితలార

తరిగట్టుతాల్పరి దర్శనంబొందని
నిశలెట్లుకడచునే నెలఁతలార
మరునితండ్రితోడ మాటలాడఁగలేని
వాక్కెందుకమ్మ వామలార
యనుచు దుఃఖమొందిరంభోజనయన లా
కృష్ణుఁ గానలేని కీడుదలఁచి 24

సీ. మనభోగమే పోవుననుచు యోజింతమా
మందలోఁ గలసిరుల్ మచ్చమాయు
మందలో సిరులేగి నందుకే వగతుమా
బృందావనము హైన్యమొందితీరు
నలఘుబృందారణ్య హానితోఁ బోవునే
యమునాధునీ వైభవమునశించు
యమునానదీ దుర్దశావాప్తి నెంతుమా
శృంగిణీ సంఘంబు భంగమొందు

గిడ్డికూటువలకుఁ గీడొనఁగూడిన
నాఁడె గొల్లలకు వినాశమొదవు
వాసుదేవుఁడిచటి వాసంబు మానంగ
నిన్నివచ్చు లౌచ్చు లింతులార. 25

సీ. మనమీఁద నిసుమంత మమకారమా కృష్ణ
నకు నుండెనేనిఁ జెంతకొఁగిఁజేరి
దుఃఖింపవలదు మధురకేనువోయిన

గర్తివ్యకృత్యములూర్తిఁ జేసి
యున్నాళ్ళ కీ మంద కేతెంతునని యొక్క
పలుకైనఁ జెప్పడే పత్తినంబుఁ
జొచ్చెనాయచ్చోటి సుందరీమణులెల్ల
శ్రీకృష్ణువలచి వశీకరించి

కదలిరా నీయరీరసిక ప్రథానుఁ
డమ్మహారాజ కన్యాసహస్రములను
మఱఁగెనేని వ్రజస్త్రీసమాజములను
మనము నందైనఁ దలఁచునే మునుపెఱింగి. 26

శా. రాజస్త్రీ విభవాభిరామ సుకుమా, రత్వప్రభావంబులీ
రాజీవాక్షుఁ డెఱుంగనందున ఘనా, రణ్యప్రభూతాంగనా
రాజింబొందెనెఱింగెనేని యిటకుం, రా నెంచునేయమ్మహా
రాజన్యుండేటనున్న నేమి మనకా, రాటంబు పెంపొందెదుం.

సీ. కమలాప్తుఁ జక్రవాకములు గోరునుఁగాని
తలఁచునే హేళిరథాంగములను
ఘనలబ్ధినాచాతకములు గోరునుగాని
జలదమాసించునే చాతకముల
వెన్నెలపులుఁగులవ్విధుఁ దలంచునుగాని
రాజుకోరునె చకోరముల ప్రాపు
చక్రాంగములు మానసముఁ జేరుగాని త
త్సరసి వచ్చునె హంస తతులకొఱకు

నాపగలుపోవుఁగాని మహాబ్ధిఁగూర్చి
వనధిపోవునె నిమ్నగావళుల నెంచి
యుట్టిమన ప్రాణనాథుఁ డైనట్టి కృష్ణుఁ
జెలులుగొల్తురు వారినాసింపఁడతఁడు. 18

సీ. నలినాక్షుగుణవర్ణనము సేయుచుండుట
గాఢపాండిత్యంబు గలఫలంబు
హరికర్పణము గవ్యయంబుగావించుట
స్వాపతేయముగల సార్థకంబు
లక్ష్మీశులీలా కలాపములాడుట
రాజిల్లు గానప్రయోజనంబు
కేశవసంబంధ కృత్యముల్సేయుటె
లప్రాయలబ్ధికి లక్షణంబు

గావచించెను వేదసంఘంబులెల్లఁ
జక్రిమేలొనరించినఁ జలుపకున్న
నతని భజియింపుచుండ మెల్లపుడు మన మిఁ
కేమి జరుగునో తరువాత నెఱుఁగవచ్చు. 29

సీ. చాలింతమిఁకమీఁద సంసారకార్యముల్
రాత్రింబవళ్లు తిరస్కరించి
సరిపెట్టుదము దేహసంస్కారములు మండ
నావలేపముల ననాదరించి
వర్జింతము ప్రపంచవాంఛలు గలిగించి

బహువిధంబుల నేచు బంధుజనులఁ
దలఁగఁ జేయుదము చిత్తస్థమైతగుమమ
కారాతిశయమహంకార పూర్తి
మొదట నిట్లొనర్చి తదుపరి గోవిందు
నాశయమున నిల్పి యీశరీర
వాక్కులతనికిచ్చి వసియింత మిచట ని
ర్భయులమగుచు భక్తిపరులమగుచు. 30

సీ. మోహమామామనమ్ముల వసించుట మాని
యెచ్చోటికైన నీవేగవచ్చుఁ
గామమాయిఁకమమ్ముఁ గాఱించుటుడిగినీ
జీవనసరణి యోజించుకొమ్ము
రసికత్వమామా సరసను నిక్కఁ జాలించి
యరుగుమెందైన శ్రేయస్సుగలుగు
లఘుగ్రామ్యధర్మాభిలాష మామధురా పు
రముఁ జేరి తేని మేలమరునీకు
నిన్నినాళ్ళనుండి యున్నమమ్ములరోయ
నేలయంటిరేపి యిందిరేశు
ప్రాపకమున మిమ్ము బ్రతికించి బ్రతికితి
మతఁడువాసె నెవ్వరండమనకు. 31

వ. అని యిట్లు గోపాలాంగనలు బహువిధాలాపంబు లాడుచు నిలిచినచో నిలువక కూర్చుండుచోటఁ గూర్చుండక నిప్పులఁ బొరలిన చందంబున గంతులువైచుచు విధిఁ దూఱు

(28)

చుఁ దమతమ పూర్వకర్మంబుల నిందింపుచు మూర్ఛల మునింగి దేలుచుఁ గంసాక్రూరులనుపాలంభించుచు వధూ పారతంత్ర్యంబెంత నీచంబెయనుచు వ్యాకులచిత్తలై యుండి రమ్మఱునాఁడు వేకువనులేచి యక్రూరుండు శతాంగం బాయత్తంబుసేసికొని తెచ్చిన జనార్దనుండు బలరామ నందాదులతో దాని నారోహించి కొంతదూరం బరిగిన నక్రూరుండొక్క శీతలసాంద్రచ్ఛాయాయుత మహీరుహం బున రథంబునిల్పి గోవిందునకు నమస్కరించియిట్లనియె.

కాళిందియం దక్రూరుండు భగవంతుని స్తుతించుట.

క. యమునానదికిం జని, స్నా
నమొనర్చి జపంబుసల్పి రయముగవత్తుఁ
సమయాతీతమునకు ము
న్నమరఁగ సెలవిమ్మనంగ హరి పొమ్మనియెన్. 33

క. చక్రధరు నాజ్ఞఁగొని యా
యక్రూరుఁడు యమునకేగి యంబువులందున్
నక్రాదులకులుకక శా
స్త్రక్రియఁదప్పక జపంబు స్నానమొనర్చెన్. 34

తే. కాల్యములుదీర్చి యామునోదకముల మరల
మునుఁగ నక్రూరునకుఁదోఁచె ముందఱమును
వినియుఁ గనియు నెఱుంగని విస్మయంబ
తండు విభ్రాంతిఁజెందు చందమున భూప. 35

మ. అమలంబై సువిశాలమై లలితరుద్యంబై సహస్రాక్షు ధా
మముకంటెన్ఘనమై సువర్ణమయమై మాణిక్యసంయుక్త

మై, కమలాప్తాంశు సమప్రభాకలితమై, కనుపట్టె నప్ర
రున, గ్రమునందొక్క విచిత్రసౌధము రుసౌఖ్యస్ఫీతమై
భూవరా ! 36

సీ. ధగధగద్ధగయను తనుమరీచులు కోటి
సితదీధితుల నిరసించి వెలయ
వేదవేదాంగాదివిద్యలు మూర్తిభ
వించి పార్శ్వముల సేవింపుచుండ
స్ఫటలందమరుమణిచ్ఛటల కాంతులు హరి
దంధకారముల రూపడఁగఁ జేయ
నవవలాహకపంక్తి నవఘళించెడుదీప్తి
గలనీలచేల మంగమున మెఱయఁ
గ్రమతరమై సహస్రభోగములు సెలఁగ
నద్భుతంబైన హేమపర్యంకమందుఁ
గొలువుదీరిన శేషాహినలఘుభక్తిఁ
గాంచె నక్రూరుఁడొడ లెల్లగగురుపొడువ. 37
వ. ఆశేషతల్పంబునందు. 38
సీ. నీశారమాధారుణీ ముఖలావణ్య
వతులు లక్షులుగఁ బార్శ్వములఁగొలువ
వాహినీసహితవిష్వక్సేనుఁడంజలి
బద్ధుఁడై లలిఁ బరాబరులు దెలుప
నామ్నాయసమితి సర్వాంగముల్ గానొప్ప
విషిక-రాధిపుఁడు సేవింపుచుండఁ

జండ ప్రచండ విజయుఁడు ముదాఢ్యాది
నిత్యసూరులు ప్రమొక్కి నిలిచియుండ
శంఖకౌమోదకీ పాంచజన్య చక్ర
శార్ఙ్గనందకములు సరసను వసింప
భానుకోటి సమాన ప్రభాశరీరుఁ
డైన నారాయణుఁడుదోఁచె నాశ్రితునకు. 39

ఉ. హారమణీద్ధకుండల ఘనాంగదనూపుర కింకిణీక కో
టీరలలంతికా నవతటిత్సమకంకణ శృంఖలోర్మికా
సారలలాటికా తరలచారిమ కౌస్తుభముఖ్యసత్పరి
ష్కారవరండ సంయుతుఁడు సారసనాభుఁడు దోఁచె
నయ్యెడన్. 40

సీ. చరణప్రభలచేత స్వాశ్రయాజ్ఞానంబ
డంచువాఁడు వివేకముంచువాఁడు
పాణితలంబుచేఁ బ్రబల సాధ్వసములఁ
గుంచువాఁడభయంబుఁ బెంచువాఁడు
నిజవీక్షణములచే నిబిడదారిద్ర్యంబు
లడఁచువాఁడైశ్వర్య మిడెడువాఁడు
వాక్కుచే నిజదాసవర్యుల ననిశంబు
మెచ్చువాఁడు వరంబు లిచ్చువాఁడు
స్తుతులకుబ్బువాఁడు శ్రుతుల నేలెడువాఁడు
సతులపాలివాఁడు యతులమతుల

సతతముండువాఁడు సరసీజనయనుఁడు
క్రూరునగ్రమందుఁ గూర్మిదోఁచె.

సీ. నీరుదాల్పుల జగాగారవం బడఁగించు
తోరంపు మేరంగు సౌరుతోడఁ
గ్రొమ్మించు తెగల యందమ్మెంతయని దూఱు
నిమ్మైన పట్టుపుట్టమ్ముతోడ
నలువగుడ్డుంబరుల్ లలిఁబొట్టలోనుంచి
పొలివోనివగఁ గ్రోచు బలిమితోడ
నల్లద్రావుడుల పోకిళ్లుమాన్చి నేల
డొల్లనేయు కడింది విల్లుతోడ
సిరులొసంగెడు సిరినేలు చెలువుతోడ
మించికోలలూడ్చు జాలోము మెట్టుతోడఁ పాదము
దనరు రేవెల్గు వేవెల్గు కనులతోడ
పేఁకలెంకకుఁ దోఁచె ముప్పోకలాడు. 42

క. ఆ వేలుపుగలమేడకు
నావల నీవలను వెనుక నగ్రమునందున్
శ్రీవైకుంఠముతోఁచె మ
హావిభవముతోడ యాదవాగ్రణిపొంగన్. 43

మా ని నీ

రాలెడుపువ్వులు రాజిలుమొగ్గలు రమ్యనవీన ప్రవాళములున్,
మేలగుకాయల మేయఫలంబులు మిక్కిలితీవలు తేనియలు,

ద్వేలశిఫాళులు విస్తృతశాఖలు విచ్చున సల్లల్రమాఁకులచేఁ
గ్రాలెడుతోటలు గన్పడెభక్తుని కన్నుల కింపుగనట్టియెడన్.

లయగ్రాహి

సాలములు కేసర రసాలములుదీర్ఘతర
తాలములు చంపకతమాలములుకోలీ
తూలములువంజుల పటోలికలు నింబవట
జాలములు బిల్వజటి మాలతులమోఘా
బాలములుజంబుకృతమాలములు మన్మథ మ
ధూలకము లభ్రసుమ గాలవము లాత
క్కోలములుగల్గిన వనాళికనుపించె వన
మాలికడ భక్తునకుఁ జాలవిశదంబై 45

సీ. పులుదిండిరాలచేఁ బొలుపైన కంబముల్
విధుమణీ రచితమౌ వేదికలును
పద్మరాగములచే భాసిల్లుదూలాలు
గొనబైన మగజాల కుట్టిమములు
మరకతమాణిక్యమయ వరణంబులు
వైడూర్య ఖచిత కవాటములును
భవ్యగోమేధిక పానీయ శాలలు
పుష్యరాగములచేఁ బొలుచుగదులు
గలిగియొప్పారు సౌధసంఘములు చంద్ర
శాలలంతః పురంబులు సంజవనము

లన్నిదిక్కులఁ గనిపించె నధికభక్తుఁ
డైన యక్రూరు నెదుట మహాద్భుతముగ. 46

సీ. నారాయణధ్యాన పారీణులైకనుం
గవలుమూసి జపించు క్రౌంచపంక్తి
వనజాక్షుగోవింద యనిచొక్కి నాట్యంబు
గావించు భూరిశిఖావలములు
మాధవాచ్యుతశౌరి మధుసూదనాయని
గొనబుమీఱఁగఁ బాడు కోకిలములు
పరమ పూరుషుని ప్రభావంబు లొగిలకిం
పారవక్కాణించు కీరతతులు
కనకపరిధానయని పల్కుకన్నె లేండ్లు
దేవదేవాయనుచు వేడుతిత్తిరులును
లక్ష్మణాగ్రజు వినుతించులకుముకులునుఁ
గలిగియొప్పారె నచటియగారచయము. 47

క. నారద సనకసనందన
పారాశర్యశుకశక్తి ప్రహ్లాదాదుల్
భూరితరభక్తిఁ గొల్చుచు
శ్రీరమణుని చుట్టునిలుచు చెన్నటఁదోఁచెన్. 48

క. చుక్కలలోనఁ గలానిధి
పక్కి నవగ్రహములందు భానునిగతినా
చక్కివిలసిల్లువారికి
మ్రొక్కుచు నక్రూరుఁడొగి నమో యనిపలికెన్. 49

అక్రూరస్తుతి

తే. దేవదేవరమాధీశ ధీరజనవ
చోవిశాలేడ్య గాంభీర్య భావధుర్య
సంసృతిదురాప దుఃఖవిస్తారనాశ
నాస్తుతిఁబరిగ్రహింపు మనాదిపురుష. 50

క. వక్రగతి సంచరించి మ
హాక్రూరుఁడనయ్యుఁదావకాంఘ్రియుగమునే
డీక్రియదర్శించుటచే
నక్రూరాభిఖ్య సఫలమయ్యె ముకుందా! 51

తే. ప్రకృతి సంబంధవస్తులాభమున కలుష
మొందిన మదీయ నేత్రంబు లిందునిన్నుఁ
గాంచుటఁ బునీతమైనవిగాన నిలుపు
మనిశమీ వైభవంబు మదాశయమున. 52

క. వాస్తవమెఱుఁగని నన్నొక
వస్తువుగా నెన్ని భూరివాత్సల్యముతో
నిస్తులరూపముఁజూపి మ
నస్తాపంబడచినావనాథశరణ్యా! 53

ఆ. దేవ!తిర్యగాది దేహములయందు నీ
వనిశముంటఁ దత్తదంగితతి ప్ర
వృత్తి జరుగుచుండు విస్తారముగ నీవు
విడిచితేనిఁ జేష్ట యుడిగియుండు. 54

క. దుర్మార్గులఁ జంపుటకును
ధర్మము నిలఁబెట్ట నీదుదాసుల బ్రోవన్
నిర్మల రాజాన్వయముల
నిర్మాణముఁ జేసికొందు నిను నీవ హరీ! 55

చ. అలఘు విసారమై కమఠమై కిటివై నరసింహమూర్తివై
బలరిపుసోదరుండవయి, భార్గవరాముఁడవై దినాధిరా
ట్కులజుఁడవై బలుండవయి, కూరిమిఁగృష్ణుఁడవై జినుండవై
కలికితనుండవై ధరణిఁ, గాంచెదవీవుభవంబులచ్యుతా. 56

ఉ. నీయవతారలీలలు గ, ణించి పఠించెడువారు వాయువా
రేయెడ నాలకించి యర, రేయని సంతసమందువారు వి
ద్యాయుతులై ప్రబంధముల, యందొనఁగూర్చి రచించు
వారలే! కాయము లాశ్రయింపక సు, ఖంబగు మోక్ష
ముఁగాంతు రచ్యుతా. 57

ఉ. నీవవనీస్థలంబున జ, నింపక నిత్యవిభూతిలో సదా
స్థావరమట్లులుండిన సు, సాధులు పండితులుంగవీంద్రుల్
స్థావరరూపులౌదురు ప్ర, శస్తపురాణక థేతిహాసముల్
లేవురసజ్ఞులీవులును లేవపవర్గము లేదుజీవికిన్. 58

సీ. గాఢారిషడ్వర్గగంధసింధురములు
దుర్వ్యాధిరూపశార్దూలచయము
లాభాసబాంధవాశ్యాచ్ఛభల్లంబులు
నసమాన విషయంబు లనెడుపొదలు

ఎలుగుగొడ్లు.

తాపత్రయోద్వేలదావాగ్ని శిఖలు నా
నాదుఃఖవృష్టికణనికరంబు
దారుణావిద్యాంధకారంబు తనియక
బాధించు తృష్ణాఖ్యపాదపములు
ధనకళత్ర గృహక్షేత్ర తనయ హిత ప
రీచికలుగల్గి కోఁతరింప రాని
సంసృతి మహాటవింబడి జడియునన్ను
శీతలకటాక్షమున దరిఁజేర్పు మీశ!

ఉ. ఎన్నిభవంబులిచ్చినను నీదగు నాకెటులన్న నీ కథల్
విన్నను దృప్తి లేని బలువీనులు నిన్ను నుతించు నాల్కనీ
సన్నిధిఁగోరు పాదములు సౌరభముం గనుముక్కు పూజ లే
పన్నగఁ జేయుహస్తములు పల్మఱుఁ జూచెడు కన్నులిచ్చినన్

తే. ఎన్నికల్పంబులందున నెన్ని మార్లు
జన్మమెత్తుచుఁ జచ్చుచు స్వర్గనరక
ములనుఁ బొందిన జీవికి మోక్షమబ్బఁ
బోదు నినుఁ గానకున్న సంభోరుహాక్ష. 61

ఉ. పుట్టుకకీవె కారణము పోషణకర్తవు నీవె దేవ మీ
పట్టున వీడిపోవు తఱిఁ బాలనకర్తవు నీవె జీవికి
గుట్టెఱుఁగంగ లేక నినుఁ గోరినుతింపక మానవాళు లి
ట్టట్టు చరించి సంసృతి దవాగ్నికిఁ జిక్కుదు రంబుజేక్షణా.

తే. బద్ధులు ముముక్షువులును గేవలులు నిత్య
ముక్తులను పేర జీవులు మూఁడు రెండు

విధములనటింపుచుందురు వీరికెల్ల
నాదికర్తవు నీవె ఫుల్లాంబుజాక్ష. 63

తే. అన్నిచోటులవ్యాపించి చిన్నమంత
కలుష మొందక నాశంబుఁ గనక వేలయు
నింగిభంగివసింతు వీనిఖిలజీవ
కోటిహృదయంబు లందునో కైటభారి! 64

ఆ. నీటియందు రసము నీహారకకిరణాగ్ని
హేళులందుఁ దేజ మీవెసస్య
పోషకుండవీవె భూమినావేశించి
జనుల దాల్తువీవె జగదధీశ 65

క. అనియిటులయ్యక్రూరుఁడు
పనివడి వినుతింపుచుండఁ బద్మాక్షుం డే
గెనదృశ్యుండై విస్మయ
మునవచ్చెన్ భక్తుఁ డరదమును డాయంగన్. 66

క. డాసిన యక్రూరునకు ర
మాసఖుఁ డిట్లనియె భవ్యమానస నదినెం
తో సావిజరిగెఁ గాంచితి
వే సలిలమునందు వింతలేవైన నన్. 67

తే. ఆపగా జలమున విశ్వరూపమధిక
కరుణతోఁ జూపి యిప్పుడిక్కరణినడుగు
చున్నవాఁడ వెఱుంగనశ్లెన్నరాని
మహిమలకు నాస్పదమునీవె మధువిదార ! 68

వ. అప్పలుకులకు గోపాలదేవుండు మందహాసంబొనర్చుటయు
నక్రూరుండు మందగమనంబున రథంబుఁదోలి నది మధు
రాపురంబు డాయంజనుటయుఁ దన సద్మంబునకు సరో
జాక్షుని రమ్మని ప్రార్థించిన యక్రూరునిఁ గాంచి యప్పురు
షోత్తముండు నాయనా నీవంటి పరమ భాగవతుల యా
తిథ్యంబుఁ బడయుటకన్న నుత్తమ ధర్మంబు లేదైననుఁ
గంస సంహారం బొనరించి పిమ్మట వత్తుననిన నయ్య
క్రూరుండు వల్లెయని యరిగి కంసునకు రామకృష్ణులు
వచ్చిరని చెప్పి నిజాలయంబునకుం జనియె నట్లుపిమ్మట
సీరధర చక్రధరులు మధురాపుర రాజవీధికి డాయుటయు
నచ్చోట రాజస్త్రీలు కృష్ణుని రాకవిని, 69

మ. జలకంబాడిన మేని నిర్మలముతో సౌవర్ణమాణిక్య భూ
షలతో మాల్యవిశేష చేలములతో శంపాలతాకాంతితో
విలసత్పాండురహాస వైభవముతో విద్యా వివేకంబుతో
బలువీఁకం జనుదెంచి చూచిరి పురీ, భామల్ యశోదాసుతున్.

వ. అట్లువచ్చి పరస్పరాలాపంబుల నిట్లనిరి. 71

మ. రవిచంద్రాగ్నులలోని తేజము రమా రామామనోల్లా
సము, త్సవనిక్షేప మశేషమంగళగుణ, స్థానంబు పీయూ
ష సంభవమూలంబు విరించనాది సురసా, భాగ్యంబు
భోగ్యంబు పల్లవపాణీచ్ఛటకమ్మురారిఁ గనరే, లాలిం
పరే డాయరే. 72

సీ. తలిఱోఁటఁగట్ట మద్దులనుఁ గూలిచిన వాఁ
డీతండు కాఁబోలు నిందువదన
మల్రవేల నెత్తి గొల్లలనుఁ బ్రోచినబలుం
డీతండు కాఁబోలు నింతిమిన్న
లలిరాసిపోయ గొల్లలఁ పసాదము మెక్కి
సీతండు కాఁబోలునే లతాంగి
కార్చిచ్చు రేఁగినఁ గదిసిమ్రింగినధీరుఁ
డీతండు కాఁబోలునే మిటారి

పాలుద్రావెడునాడు సంపంగవచ్చి
నట్టిపూతన నా శకటాసురుని దు
రాత్ముఁడైన తృణావర్తు నట్టెకూల్చె
నిమ్మహాత్ముండ కాఁబోలు కొమ్మలార.

సీ. విశ్వరూపంబెల్లు వీడుసూపించెనో
కందువైతల్లి యంకముననుండి
కాళియోరగమునే కరణిజయించెనే
యొరిమతో నాలకాపరిగనుండి
వత్సాది రాక్షసావళినెల్లు ద్రుంచెనే
కమనీయమూర్ధ్వాంగములు గలిగి
బ్రహ్మవ లేపమెప్పగిది వారించెనే
యాభీరవంశజాలందు మెలఁగి

చిలుతపాయముందె జేజేల దొరనెల్లు
బొంగఁజేసెనియ్యనంగరూపు

డీముదాసురారి యెల్లలోకేశ్వరుం
డగుట నిక్కవంబు మగువలార. 74

శా. వంశీనాద మొనర్చుచుండునట గ్రా, మంబుల్ కరంగన్
వళ,త్పాంశుస్మేరయుతాన నుండితఁడ హా, హాతద్ధ్వనింజ్రకని
స్త్రీంశా చేయుమటంబు నిచ్చటలలిం, జేయించువారున్నమా
వంశంబుల్ శ్రవముల్ భవంబులు ప్రజా, వారంబుధన్యం
బగున్. 75

సీ. రవిసహస్ర ప్రభారాజిన్ స్రెక్కడనిల్పి
తూఁచఁగృష్ణుని కాంతితుల్యమగునె
చంద్రాయుతకలా విసరము రాసిగ జేసి
నను పద్మనాభానన సమమగునె
లక్షసమీరబలములు ప్రోవొనరించి
కనుఁగొన్న హరిబలంబునకు నెనయె
దర్పకకోటి సౌందర్య మొకటఁజేర్చి
సరిజూడ గోవిందు సాటియగునె

సకలవారాశి గాంభీర్య మొకటనుంచి
పోల్చిచూచిన వెన్నునిఁ బోలఁ గలదె
తాల్మిఁ గులశైల సప్తక ధైర్య మొక్క
చోటఁగూర్చిన శ్రీకృష్ణుపాటియగునె. 76

సీ. కాంచనస్థంభైన గౌరవాధిక్యంబు
స్ఫటికంబులంగల స్వాచ్ఛమితఁడు

నవరత్న సంఘస్థ వివిధమౌల్యమ్ము లతాం
తస్థమై విలసిల్లు తావియితఁడు
మకరందమునఁగల మాధుర్యముద్యాన
వనపాళి మంజులత్వంబితండు
సీమంతినీమణీ శృంగారమింపైన
చిగురాకులంగల స్నిగ్ధమితఁడు
సత్పురుషులందుఁగల పౌరుషంబితండు
సకల శూరార్జితంబైన శౌర్యమితఁడు
సర్వలోకస్థ నిర్మలైశ్వర్య మితఁడు
మంచిలేదమ్మ కృష్ణుని మించియొకటి 77

సీ. శార్దూలపంచాస్య శరభాధి సత్వసం
ఘములఁగల్గిన పరాక్రమమువీడె
తురగమానస ఖగేశ్వర సమీరణులతోఁ
గలిగి తీవ్రరు వేగంబువీడె
ధాత్రిభారమువహించు శైకచ్ఛపకిటి
ఫణిరాజులంగల బలమువీడె
పురవిరోధ్యష్ట విభూతులంయ్యక్షరా
ణ్ణిగమంబునందుండు నిధులువీడె
స్వర్గలోకభోగసము దాయములువీడె
ధాన్యములును వీడె ధనమువీడె
నలువగర్భమునందుఁగల సంపదలు వీడె
గానఁజూడరమ్మ కమలనయను. 78

తే. చైత్రరథనందనముల భాస్వత్సమృద్ధి
నైమిశాదిమహావనస్తోమ మహిమ
మఖిల తీర్థస్థమైన మహత్త్వ వివిధ
పుణ్యఫలములువీడె పూఁబోఁడులార. 79

సీ. వేదంబులునువీడె వేదాంగములువీడె
సదమలధర్మశాస్త్రములువీడె
వేదాంతములువీడె వివిధభాషలువీడె
తర్కాదిశాస్త్రవాదములువీడె
శస్త్రముల్ వీడె దివ్యాస్త్రంబులునువీడె
తంత్రముల్ సకల మంత్రములువీడె
యాగఫలమువీడె యోగ మహిమవీడె
ఘనమునీశ్వర విరాగంబువీడె

సచ్చిదానంద శుచిధైర్య శౌర్యశాంతి
దానధర్మాది సుగుణసంతతులువీడె
సిరికిసిరివీడె వీడువర్జించెనేనిఁ
దత్త్వదార్థములెల్ల వ్యర్థంబుగాదె. 89

ఉ. ఇంతమహానుభావుఁ, డెటులేగెనొ మందకు నేగినాడు పో
సాతసమొప్ప గోపికలఁ, జాయలగాఁ గొని గ్రామ్యధర్మమ
త్యంతముగా నొసంగియును నాపగలో జలకేళి రాస నా
మాంతర కేళిఁ జేయుట మహాద్భుతమాయెఁ గదే వధూ
మణీ. 81

మ. తగునే గోపికలిట్లు మాహాత్మునకుఁ గందర్పుండు దర్పించి నె
ల్లగు బాణంబుల నేయు నప్పుడు తదీయాటోపమున్ మా
న్పని, మాగవాఁడాత్మఁదలంచె నేని సురవామల్ రార
మాబోఁటులింపుగ లాలింపరె రాజకాంతలు వ్రజాంభో
జాక్షులే జాయలా. 82

ఉ. ఈ కనుదమ్ము లీకయము లీ సొగసీనగ వీవిలాస మీ
సైఁకపుమధ్య మీసొబగు చక్కదనంబధరంబు లీమనో
జ్ఞాకృతిగల్గినట్టికమ లాక్షుఁడు నూతనసూనబాణుఁడే
లాకలిసెన్ వ్రజాంగనల లాఁతివధూమణికేని రీతిగన్. 83

మ. అరరే యీ వసుదేవసూనుఁడు స్వకీ, యాంగంబులర్పించి
గో । పరథాంగస్తనులన్ స్పృశించునపుడ, ప్పంకేజ
పత్రాక్షులెక్కరిణిం బొంగిరో యెనుడుల్ వలికె సౌ, ఖ్యం
బొందిరో యెంతగాఁ । బరిరంభించిరో వారి భాగ్యము
నకుం, బారంబు లేదాయెగా. 84

క. మన పురమునందుఁ గృష్ణుఁడు
జనించి మనకందకుండఁ జని యగ్గోపీ
జనులకు సౌఖ్యంబిచ్చుట [illegible]
మన పాపముగాక వేఱుమార్గముగలదే.

ఉ. కామము చేతఁగాదు నవకంజదళాక్షుఁడు గోపకామినీ
గ్రామము నాదరించుట లకర్మషభక్తి నిధానలై సదా
యేమఱకుండఁ దన్ను భజియించుట భక్తికధీనుఁడై మహా
ప్రేమ బహూకరించెనని పెద్దలు సెప్పఁగవిందుమమ్మరో.

ఉ. వెలఁదులమిన్నలార! మఱివింటిఁగదే యొకమాట గోప
కాం। తలొగి సహస్రసంఖ్యలుగఁ దన్గదియంగ రమించి
యింద్రి య। స్ఖలన మొనర్ప లేదట సుఖస్థితి నొక్కొక
లేమ కొక్కఁడై। పిలిచి ముదంబుఁ గూర్చెనట నీరజ
నాభుఁ డిదేమి చోద్యమే. 27

మ. హరిణాక్షుల్ బలువేలఃసుందిచని కృష్ణా! యంచు నాసింప
న। త్తరుణీసంఘముఁ జేరఁదీసి మరుసంతాపంబుఁ జల్లార్చి
యా। సరసీజాక్షులు సూచుచుండగ నదృశ్యంబై నిదా
నించి యా। సరసంబూర్వపురీతిఁదోఁచునట యీచర్యల్
మనుష్యాళివే. 88

మ. మనమగ్గోపికలుండు మందలకు సన్మర్యాద నేతెంచి భా
మినులారా! వసుదేవనందనుఁడుమున్ మీకెట్లు స్వాధీనుఁ
డ। య్యెనో చెప్పందగునంచుఁ గీలడిగి యా యిందీవ
రాక్షుల్ వచిం। చినభంగిన్ జరియింతు మేని వశుఁడై
చేపట్టడే వీడొగిన్. 89

క. కీలెఱిఁగి పనులొనర్చిన
చో లగ్గగునట్టు లీ యశోదాతనయుం
డేలాగున వశుఁడగు న
మ్మాలము గొల్లెతల నడిగి మొనయుట లొప్పున్. 90

సీ. అందఱు కవివర్యులగుదురే వాల్మీకి
మౌనిపరాశరాత్మజులుగాక

బ్రహ్మచారులె భార్యఁబడయనివారెల్లఁ
బవసనందన శాంతనవులుగాక
హరియన్నువారెల్లఁ బరమభక్తులెదంతి
రాజప్రహ్లాదనారదులుగాక
యిలనంగమొలవార లెల్లవిరాగులే
సనకశుకాది మస్కరులుగాక
శూరులాదురె విలుదాల్చువారలెల్లఁ
దాఁకిజగములనోర్చు మదనుఁడుగాక
పురుషుఁడన నందగాడనఁ బుడమినంద
ఱాదురే దేవకీపుత్రుఁడౌనుగాక. 91

ఆ. సుఖములో అకుఁగాదె నిఖిలదేహులు భూమి
యందు బ్రతుకఁగోరుచుందురెప్పు
డట్టి సుఖమునందు పట్టె సంయోగంబు
వలనఁగాగ మెట్లుకలుగునమ్మ. 92

సీ. లాఁగిపట్టిన నిల్వదీ గోపికానాథుఁ
గాఁగిలింపఁగఁ గోరికరయుగంబు
మూసిన నటులుండవీ సరోజాతాక్షు
లోలతఁగన నెంచి లోచనములు
ఘనచోలము బిగించినను లేచి యుబ్బుఁ గృ
ష్ణుని యోమ్ముఁదాఁక నెంచుచుఁగుచమ్ము
లేస్పర్శమైన హాయిగ నెన్నదీ మురా
రి స్పృశింపంగఁగోరి మృదుకృత్తి

దొరకువాఁడుగాడు తోయజనాభుఁడా
తండు దొరకకున్న ధరణియందుఁ
దనువునిల్వఁబోదు తనువుండినను బ్రదు
కనము లేదు చుమ్ము చానలార. 93

శా. తేజస్వంతములైన వస్తువులలో, దీపించుసౌందర్యముం
దేజస్సంతయుఁ దీసి బ్రహ్మమురజి ద్దివ్యాంగమందుంచి వి
భ్రాజిష్ణుండగునట్లొనర్చెనని సంభావింతు భావించి యీ
రాజాస్యన్ లలిఁ బొందుటెట్టులని యారాటించెదన్
మానినీ. 94

మ. నవలావణ్యము సోయగంబు విపులానందంబుధర్మంబుమా
ర్దవతారుణ్యదయాశుచిత్వములు సత్యస్థైర్యముల్ శౌర్య
ధై, ర్యవదాన్యత్వ పరాక్రమంబులును బ్రోవై కృష్ణరూ
పంబులో, నవతారంబిటులెత్తెనేమొయని నేనాత్మందలం
తుంజుమీ. 95

సీ. తనకీర్తిశుద్ధియైతనరుటంగాఁబోలు
దధియు దుగ్ధంబులు త్రావినాడు
తనమార్దవంబుతోఁ దరమౌటఁగాఁబోలు
మిసిమిముద్దలుకూర్మి మెక్కినాడు
తనసౌహృదంబుతో నెనయుటఁ గాఁబోలు
మీఁగడాజ్యము జున్ను మెక్కినాడు
తనసాధుభావమొందిన వని కాఁబోలు
మేకొని తోడుకల మేపినాడు

హా! యశోదకుమారుఁడ మేయపుణ్య
రాశి యటుగాకయున్న నా వ్రజమునందు
నిలుచునేటికి గొల్లల చెలిమియేల
నిజగుణోపమితముల మన్నించెఁగాక. 96

సీ. కామధేనువు జనీకారణంబేనని
చెప్పగోవులను యోజించి ప్రోచెఁ
గల్పవృక్షము నేనె కల్పించినానని
వచియింపబృందా నివాసమొనసె
క్షీరసాగరముఁ ద్రచ్చిన వాఁడ నేనని
తెలుప గోపాలుర చెలిమి సల్పె
దితిజారి బిరుదమొందినవాఁడ నేనని
చాటింప వత్సాది శఠులఁ జంపె
నప్సరోపేతులైన దేవావళులకు
నమృతమొసఁగినవాఁడ నేనని వచింప
నిచ్చెఁ బ్రేమామృతము గొల్లమచ్చెకంటి
తెగలకీ నందసూనుఁడో మగువలార! 97

సీ. శేషశాయిత్వంబుఁ జెల్లింపఁగాఁబోలు
దురితకాళియు నియుసురులు నిలిపె
నారాయణాఖ్యార్థ మారసికాబోలు
యమునానదీ తీరమందు మెలఁగె
విష్ణునామఖ్యాతి వివరింపఁగాఁబోలు
భామలందఱి నొక్కవరి రమించె

గోవిందనామార్థ గుప్తికై కాంబోలు
తమిరోహిణీ వరండములఁ బ్రోచె
శ్రీధరఖ్యాతి ధరపై వసింపఁజేయఁ
దలఁచి కాంబోలు సిరులు గొల్లలకొసంగె
నీ మహాపురుషుఁడు యదుస్వామి లోక
రక్షకుండైన కృష్ణుఁడో రామలార! 98

సీ. ఈ వధూమన్మథుండింపైన చూడ్కులఁ
గాంచినఁజాలు నాకాంక్షదీరు
నీ రసికోత్తముండెలమితో సల్లాప
ములనొసంగినఁజాలు ముదముఁగాంతు
నీసత్యఖని పరిహాసమాడినఁజాలు
బడఁతులలో మేలుబంతినౌదు
నీపుణ్యనిధిహాస మింతసూపినఁ జాలు
మదనసంతాపంబు పొదలకుండు

నని యశోదాకుమారు దివ్యాంగమందు
గలుగుసౌందర్యమునకోడి కాంతలెల్లఁ
జెప్పుకొని రొక్క రొకరి కచ్చెరువుతోడ
సారగుణసాంద్ర కౌరవక్ష్మావరేంద్ర. 99

వ. అని వెండియు 100

సీ. కనుసైఁగ జేసె నివ్వనజాక్షుఁడని యొక్క
నీరేజగంధిపన్నీరుసిలికి

మందహాసమొనర్చి నందాత్మజుఁడునన్నుఁ
గనియని యొకతె చందనమలంది
చీరెరమ్మని యీసుశీలుండనుచునొక్క
సుదతీలలామ కస్తూరిఁబూసి
నామోముఁగనె యదుస్వామియనుచు నొక్క
రమణి ప్రసూనహారములువైచి
వలపుఁదీర్పుమయ్య జలధరదేహ శ్రీ
కృష్ణయనుచునొకతె కేరలిపలికి
యమ్మహానుభావు నన్ని పార్శ్వములందుఁ
జుట్టిముట్టిరోలి క్షోణినాథ 101

వ. ఇట్లుపరివేష్టించి వధూలలామలా శ్రీకృష్ణు ననుసరించి వచ్చుచుండ గోవిందుండు స్వకీయ రసికత్వ భంగమునకు శంకించి వారల నదల్పక దరస్మితోపేతసుందర వదనారవిందుండై యేగుచు వీథియందుఁ దన్నుఁ దిరస్కరించిన రజకుని సంహరించి కొంత దూరంబేగిన వాయకుఁడొక్కఁ డెదురుగావచ్చి నమస్కారంబు లొనరించి తన గృహంబునకుఁ గొనిచని యుచితాసనంబులఁ గూర్చుండఁబెట్టి యమూల్యవస్త్రంబులు సమర్పించి యిట్లనియె. 102

ఆ. సరసిజాక్ష యోగిజనవంద్య సర్వేశ
వాసుదేవ శ్రీనివాస దేవ
దేవ నీపదాబ్జ దివ్యదర్శనముచేఁ
బావనుండనైతిఁ బండెఁ దపము. 103

క. భూభారహరణ దీక్షా
లాభముఁ గాంక్షించి నీవిలాస్థలి జన్మం
బీభంగిఁ దాల్చి వ్రజము
దాభీరులఁ బ్రోచినాడ వంబుజనాభా. 104

మ. ఖలురంగూల్చుట భక్తసంఘములకున్ గాఢప్రమోదం
బిలం । గలుగంజేయుట నైజకార్యమగుచుం గన్పట్టు నీ
కందులో । ఖలనాశంబు తలంపుచే జరుగు భక్తశ్రేణి
నుబ్బించుటే। బలితంబౌ పని దానికే గద నరప్రాయాకృతిం
బొందుటల్. 105

మ. పురుషాశీల్యవశుండవై ధరణిపైఁ బుట్టంగ మావంటి ము
ష్కరమర్త్యుల్ భవదీయదివ్య విమలాంగంబున్ నిరీక్షిం
పఁగాఁ । దరమై యొప్పెనుగాక కోటియుగముల్ ధ్యా
నించి తర్కించినన్ । దొరకన్నేరదు తావకీన పదభక్తుల్
ధన్యులా నచ్యుతా. 106

ఉ. తామసరాజసాశయులు తావకదివ్య పదారవింద చిం
తామహిమం జెలుంగరుగదా జననాయుతమందునైన నే
భూములయందునైన బుధపుంగవ బోధలచేతనైన నా
రా మధువైరివారల పురాకృతదుష్కృత మెంతగట్టిదో.

శా. మాయాభూతము నీకుమాకుఁగల సంబంధంబుఁ బోగొట్టి
దుః । ఖాయత్తంబగు సంసృతింగలిపి • జాయానందనక్షేత్ర
ముల్ । దాయాదుల్ మనవారలంచుఁ జెడుబోధల్

దెల్పి నిత్యంబనే। కాయాసంబులుగల్గఁజేసె ఘనమాయం
బాపు మజ్జేక్షణా. 108

శా. దేహాత్మభ్రమచేఁ గలంగి వృజినాధిక్యంబు నార్జించి దా
సోహంబంచును మాదృశప్రజల నాహోరాత్రిని బొల్చి
యొం। తోహీనంబగు నారకంబెనసి తోద్దిప్తపక్షిపశ్వాది
దు। ద్రేహంబుల్ వగఁ బొందినాఁడనిఁక నార్తింబాపవే
శ్రీహరీ. 109

శా. మేనామీఁద గుఱ్ఱాలమీఁదఁ గరిపై మేలౌశతాంగంబు
పైఁ। దానెంతోతమి నెక్కినాఁడది భవద్దత్తాధికారంబుగా।
లోనేవేళఁ దలంపఁడీ నరుఁడు తల్లోపంబుచే దుర్దశా।
ధీనుండై నినుదూఱుఁ జిత్రముగ నేదీ న్యాయ మజ్జేక్షణా.

వ. అని యనేకవిధంబుల సన్నుతించిన శ్రీకృష్ణుఁ డానందించి
యక్కువిందున కపారైశ్వర్యంబు నొసంగి దేహాంతంబున
నపవర్గం బిచ్చెదనని చెప్పి యచ్చోటు వాసి బలరామ
సహితుండై సుదాముండను పేరుగల మాలాకారుని
గృహంబునకరిగిన నతం డమందానందంబున లేచి దండ
ప్రణామంబు లాచరించి యర్ఘ్యపాద్యాది విధులం
బూజించి యుచితాసనంబులఁ గూర్చుండఁబెట్టి. 111

సీ. వాడక గుమగుమవాసించు చాంపేయ
కుసుమంబు లా వృష్ణికుంజరులకుఁ
బరువుదప్పక సౌరభములీను మల్లికా
పుష్పంబు లా రాజపుంగవులకు

విచ్చివిచ్చకతావు లెచ్చించుమాలతీ
సుమముల వ్వాసుదేవసుతవరులకు
మకరందరసము వీడకయొప్వ పాటలి
సూనంబులా చిన్నిధానములకు

మాఖ్యపుష్పంబులబ్బల మాధవులకు
మాలికలుగూర్చి భక్తిసమర్పణంబు
సేసి ఫాలస్థలంబునఁ జేతులుంచి
మ్రొక్కి కృష్ణునితో సుదాముండుపల్కె 112

ఆ. ఆత్మగౌరవాధి కానలేపముమాని
పాదచారివగుచు భక్తిమాత్ర
మునకు లొంగి బీదజనులైన మాబోటి
వారలిండ్లకీవు వచ్చుటరిది. 113

వ. కృష్ణా! పరమనీచుండనగు నన్నొక వస్తువుగా నంగీకరించి
వచ్చిన నీకు సమర్పించుటకుం దగిన పదార్థం బొక్కటి
యైనం గానరాదెట్లందువా నీకుఁ బాద్యం బొసంగుదు
నంటి నేనిఁద్రిలోకపావనియగు నిలింపతరంగిణినీదివ్యాంఘ్రి
కమలంబున జనించె నీ కభిషేకంబు సేయుదునంటినేని
నీవుండునది క్షీరసముద్రంబు దీపారాధనంబొనర్తు నందు
నేని నీ నేత్రంబులు దినకర నిశాకరులు ధాన్యం బర్పింతు
నందునేని సకలధాన్యహేతు భూతంబైన భూదేవి నీభార్య
ధనం బొసంగఁ గోరుదునేని, నిజకటాక్షంబులచే నైశ్వర్య
పరంపర లొసంగు లక్ష్మి నీయిల్లాలు నైవేద్యం బిడఁ

గోరితినేని నీవు ముప్పదిమూడుకోట్ల వేల్పుల కమృతం బిచ్చిన మహోదాతవు కన్యాదానం బొనర్పఁ దలంతునేని స్త్రీ పురుషులకుఁ గామసుఖంబిచ్చు ప్రసూనధన్వి నీకనిష్ఠ కుమారుండు స్తోత్రవాక్యంబులచే మెచ్చింతునంటినా, విద్యాధిదేవతయగు సరస్వతి నీకోడలు, వేదమయుండైన గరుడుండునీవాహనంబు వ్యాకరణనిర్మాతయగు శేషుండు నీతల్పంబు రెండు మూడు సుగుణంబులచేఁ దృప్తిసేయుదు నంటినా, నీవశేషకల్యాణగుణపరిపూర్ణుండవు వస్త్ర దానంబు సేయుదునంటినా నీవు ధరించునది కాంచన చేలంబు నీ మెడలోనిది కౌస్తుభరత్నంబు భవదీయ హార కేయూరకటకకంకణ మంజీరకోటీరాది భూషణంబుల నర్ఘ్యంబుల ప్రాకృతంబులు దారిద్ర్యంబుల నిర్మూలించు కల్పకకామధేను చింతామణులు నీసంకల్పాధీనంబుగా జనించినవి దేవతలు నీభృత్యులు తదీయభార్యలు నీదాసీలు వేదంబులు నీస్తోత్రంబులు నీసనాతన నిలయంబు పరమ పదంబు నీపరివారంబు లనంతగరుడ విష్వక్సేన కుముద కుము దాక్షచండప్రచండ జయవిజయాది నిత్యసూరి వర్గంబులు బ్రహ్మాండంబులును బ్రహ్మాండాంతర్గతంబులగు స్థావరజంగమంబులును దశావరణంబులును మూలప్రకృతి యునండాధిపతులైన బ్రహ్మలును నీ విభూతులు అనఁగా నీకిష్ట వినియోగార్హంబైన యాస్తి నీయప్రాకృత దివ్య మంగళ విగ్రహంబు తారుణ్యశాశ్వతంబై రోగ దూరంబై భోగసారంబై లావణ్యమయంబై సౌందర్య

యుక్తంబై విచిత్రలీలాస్పదంబై నిఖిలకల్యాణగుణ సము
దాయ సముపేతంబై నిరవద్యంబై తనరారుచుండు నిట్టి
నిన్ను నేమనిసన్నుతింతు నేపదార్థంబులర్పింతు నెవ్వండైన
నేమనిఁకొనియాడుదునని యానందబాష్పంబులతో గద్గద
కంఠంబుతో రోమాంచంబుతో బద్ధాంజలితో శిరఃకంపం
బుతో నుతింపుచున్న సుదామునిఁ గౌఁగిలించి జనార్దన
పరబ్రహ్మ మిట్లనియె. 114

ఆ. విషయరక్తిలేక వివిధవాంఛలులేక
గాఢభక్తితోడ గూఢభంగి
నన్ను నీవు కొల్చుచున్నందువలన సం
తోషమందినాఁడ దోషరహిత. 115

ఆ. కపట మానసమునఁ గల్పశతములు న
న్గొలుచుచున్న వానిఁ దలఁచఁబోను
స్వీయలోపమనుచుఁ జింతింపలేక నన్
మాఱఁగోరునట్టి దుర్జనుండు. 116

తే. హోమతప్తృతముంచుకొలఁది నజాతవేద్కుఁ
డతిశయించినపగిది మదాశ్రయునకు
భక్తి రేఁగినవేళ నా భవ్యకరుణ
లలి విజృంభించుచుండుఁ గల్లయునరాదు. 117

తే. పాంచభౌతికదేహ సంబంధ దోష
మున నొకానొకవేళ దాసునకు భక్తి
తగ్గినను సన్నగిలదు నాదయ గదార్తుఁ
డైనబాలకు తలిచన్నులట్లుపుత్ర! 118

క. కమలాసనాండ మొక్కటి
సమస్తభూతముల తోడ సమసిన నా
చిత్తము శోషిల్లదు భక్తుని
శ్రమముంగని దుఃఖమొందు సరణి మహాత్మా 119

ఆ. కర్మయోగికంటె ఘనజ్ఞానయోగుల
కంటెఁ బారి కాంక్షి కంటె యతుల
కంటె గొప్పవారిగా గణుతింతు మ
ద్భక్తజనుల నెపు డపారప్రీతి. 120

క. నీవొసఁగిన పుష్పంబుల
చే విస్తృత మోద మేనుఁ జెందితిఁ గోరం
గా వచ్చు నిత్తుఁ గొంకక
యేవరమైన నన దాసుఁడిట్లనిపలికెన్. 121

క. నీ దర్శనమునకంటెన్
లేదుగదా కోరఁదగు బలిష్ఠవరము నీ
వేదైన నిత్తుననుటం
గాదన శక్యంబుగానికతన నడిగెదన్. 122

సీ. కార్చిచ్చుఁ గనిన జింకలపోల్కిఁ దుర్గుణా
వళులు నాలోనుండి పాఱవలయు
భూజమ్ములు వసంతమునఁ బూచినట్లు సు
గుణములు నాలోఁ జిగుర్పవలయు

ధన్విని ర్ముక్త ప్రదరముభంగి మదీయ
వివిధ కిల్బిషములు వెడలవలయు
ధరణీధరముభంగిఁ దావకభక్తి నా
తలఁపులో సతతంబు నిలువవలయు

నల భగీరథుకాలంబునందు మిన్ను
వాఁక భూలోకమునుఁగూర్చి వచ్చినట్లు
రావలయు ముక్తి నాకు నన్నావరించి
యుండు స్వీయులకనినఁ గృష్ణుండు పొంగి. 123

వ. నీవడిగిన వరంబులన్నియు నొసంగితిఁ గాని వీనిచే నాకు
సాహిత్యంబు కలుగలేదని మందహాసంబొనర్చె. 124

సీ. కనుసైఁగచే నెల్లకార్యంబు లొనరించు
దాసదాసీ జనోత్కరముగలిగి
తమిమార్గణులకు దానమొనర్చి ననుఁ దలు
గని ధాన్య ధనకనకములుగలిగి
విమలాయురారోగ్య సముపేతులై సదా
తనరారు దుహితృ నందనులుగలిగి
భవన సౌధారామ పశుదంతి ఘోటక
రమణీయ పద్మాకరములు గలిగి

నీ కుటుంబమువారెల్ల నిఖిల సుగుణ
సహితులై నిన్ను సేవింప సౌఖ్యమొందు
మా యని రమాధవుండు ప్రేమమున వరము
లొసఁగి రామునితోడ నవ్వసతి వెడలె. 125

క. చనుచుండ రామకృష్ణుల
తను సౌందర్యము గభీరతా వైఖరి యౌ
వనలావణ్యములంగనుఁ
గొని పౌరులు విస్మయంబుఁగొని పల్కిరొగిన్. 126

సీ. మరుదావళికిరీట మాణిక్యరుచులచే
త సపర్యఁ జెందు పాదములతోడ
ఖలురనెల్ల వధించి ఘన సాధువులఁ బ్రోవ
నోపు నాజానుబాహువులతోడఁ
ద్రైలోక్యముల నవలీలఁ బాలింపఁగ
లట్టి రాజన్య చిహ్నములతోడఁ
గంఠీరవంబునకంటె గోపతికంటె
తవణిల్లు సాంద్రకంఠములతోడ
గంధసింధురగమన వైఖరులతోడఁ
గమలబాంధవ సంకాశ కాంతితోడ
విమలమైపొల్చు చంద్రాననములతోడఁ
బరఁగు వీరెవ్వరో గదా పౌరులార. 127

వ. అని వితర్కించి నానాకులజులైన పౌరులు కర్పూర నీరాజ
నంబు లొసంగి బహువిధోపహారంబులు సమర్పించి రామ
కృష్ణులం బూజించిన నమ్మహాపురుషులు వారల ననుగ్ర
హించి రథ్యయందరుగుచుండ నొక్క ప్రదేశంబున. 128

సీ. రవికరశుష్క వీర తరఘూసచ్ఛటా
సమమైన తామ్రకేశములతోడ

శిఖిశిఖాదగ్ధాగ్రావశిష్టకాష్ఠ పత్రికా
రంబైన మలినవర్ణంబుతోడ
సమజనాకర్ణనాసహ్యమై గార్దభ
సంకాశమగు గళస్వనముతోడ
హ్రస్వావయవత్రి వక్రాన్వితమై సదా
పరఁగు వికారరూపంబుతోడఁ

జూపఱకు నవ్వుఁ గలిగించు చూడ్కితోడ
బెడిసియిటునటు తడఁబడు నడలతోడఁ
గలపు పుంబాత్రలనుఁబట్టి కంసదాసి
ముదముతో రామకృష్ణుల కెదురువచ్చె॥ 129

ఆ. అన్నలంత దూరమందుండినఁ దదీయ
పాణిగతపదార్థ పరిమళంబు
మలయుచుండె దశదిశలయందుఁ గృష్ణుఁ డ
వ్విస్మయంబుఁగాంచి వెలఁదికనియె. 130

క. సుభ్రూ! యెవ్వరిదాన వ .
దభ్రానందమునఁ బోయెదవు కలపములే
విభ్రాజిష్ణునకిచ్చెదు
విభ్రాంతాశయపుగాక వినరింపు చెలీ. 131

క. రంభోరువైన నీసం
రంభము నీ హస్తగతసురభి వస్తునము
జృంభణముఁగన్న మాహృద
యాంభోజము లుల్లసిల్లె నన్నులమిన్నా. 132

క. వీరెవరోయనుచుఁ దిర
స్కారమతివిగాక మమ్ముఁ గరుణించి భవ
త్సౌరభ వస్తువులిమ్మన
నా రసికాగ్రణికిఁ బలికె నచ్చెలువరహిన్. 133

ఉ. చక్కఁదనాల లెంకివి ప్రసన్న ముఖాంబురుహుండవీవు స
మ్యక్కరుణాంబురాశి వటులైతిఁ గదా యని వెక్కిరింతువే
చక్కఁదనంబు లేని ననుఁ జాలు భళీ కలపంబులీయనే
మక్కువతో భవాదృశులు మానసమందున నిచ్చగించినన్.

శ్రీకృష్ణుఁడు

వ. లతాంగీ! నవ్వుటాలకై పరిహాసంబాడితి నింతమాత్రమున కే కోపంబు వచ్చెనా. 135

కుబ్జ

వ. రసికజనాగ్రణీ ! క్రోధ సూచకంబులగు సంభాషణంబు లేవియు నేనుజరిగించలేదు మీరు పరిహాసంబుగా ముందు వల్కితిరి దానికిఁ దగినట్లు మాట్లాడనిచో దేవరవారి దివ్యచిత్తంబునఁ గోఅంత కలుగునన్ని జ్ఞానానుసారంబుగా మాట్లాడితి నీ ముఖారవిందంబు నిరీక్షించి నీ పల్కులు విన్నచో నెట్టి శుష్కహృదయులకైనఁ గోపంబు రాదు సరేగదా మీఁదుమిక్కిలి పూర్ణానురాగం బుద్భవిల్లును.

శ్రీకృష్ణుఁడు

వ. ఆహా! కేతకీ ప్రసూనంబు కంటకంబులచేఁ బరివేష్టింపఁ బడి యుండినను బరిమళంబు వాసించిన తెఱంగున నీ

రూపంబు వికారంబుగా నుండినను స్వభావవాక్యంబు లమృతోపమానంబుగా నున్నవి. 137

కుబ్జ

వ. సౌందర్యనిధీ! నాకు సహజంబుగా సుగుణంబులు లేక పోయినను మంత్రగాని మంత్రబలముచేఁ దృణము బహ్మాస్త్రంబగు నట్లు భవదీయ దివ్యదర్శనంబుచే మదీయ వాక్కాయ మనంబులు పవిత్రంబు లగుటవలన సుగుణవంతురాల నైతి. 138

శ్రీకృష్ణుఁడు

వ. నీ వెవ్వరిదాన వికసలపంబు లెవ్వరికిఁ గొనిపోవుచుంటివి?

కుబ్జ

వ. నేనుఁ గంసదాసిని రాజసన్మానార్థ మీ సుగంధద్రవ్యంబులు గొనిపోవుచున్నాను. మదీయ నామధేయంబు త్రివక్ర యని జనులాహ్వానింతురు. 140

శ్రీకృష్ణుఁడు

వ. మాకీ పరిమళద్రవ్యంబులయందు మిక్కిలి మక్కువగలిగి యున్నది. సమర్పించెదవా కంసభయంబుచే నంగీకరింపవా. 141

కుబ్జ

వ. మీ వాక్యార్థంబు విచారింపఁగా సుగంధవస్తువులయందుఁ బూర్ణానురాగంబు లేనట్లు తోఁచుచున్న దట్టివారికిచ్చి ప్రయోజనంబేమి. 142

బలరాముడు

వ. ఈలతాంగి సూదివలెవచ్చి దబ్బనమువలెవర్తింపుచున్నదే.

శ్రీకృష్ణుఁడు

వ. మాకుఁ బూర్ణానురాగంబు లేదంటివే యెందువలన. 144

కుబ్జ

వ. ఏవస్తువు నెవ్వఁడు ప్రేమించునో వాఁ డవ్వస్తువునందలి గుణదోషంబులు విచారింపఁ డెట్లంటివేని జారుండు లోకాపవాదంబునకుఁ గొంకడు పానరతుండు మానహానికిఁ జోరుఁడు ప్రాణహానికిని శంగింపరు ప్రతిపదార్థ వాంఛారతుండును దద్దోషంబు లాలోచింపఁడు నీవు కలపంబుఁ గోరుచుఁ గంసునివల్ల భయపడెదవా యని నన్నడిగితివి కావునఁ బూర్ణానురాగంబు లేదని యెఱింగితి. 145

శ్రీకృష్ణుఁడు

వ. నీయూహ సమంజసముగానే యున్నది నేను పరావమానాసహిష్ణుండ నగుటచే నడిగిన నేరంబు మన్నించి పరిమళద్రవ్యంబులిమ్మని యడిగిన నా కుబ్జ యిట్లనియె.

సీ. ఇది పటీరస్నేహమిందు వంశవరేణ్య
పూనూనె యిది జగత్పూజ్యపాద
రాజార్హమిది మృగరాజ విక్రమ యిది
కాలాగురువుచుమీ కమలనాభ

ఘనసారమిది వధూజన పుష్పకోదండ
పన్నీరమిదిల సచ్ఛన్నిధాన
సాంకవంబిది విరాజస్ఫారదేహకు
రంగనాభియిది మాతంగగమన

జాపకంబిది సుగుణకలాపనిలయ
బాహ్లికంబిది యాజానుబాహుయుగ్మ
మలయజంబిది దేవసన్మానధుర్య
విమలగోశీర్షమిది వృష్ణివీరవర్య! 147

క. పరిమళ ద్రవ్యములన్నియుఁ
గరమనురాగంబు తోడఁ గైకొనిన సరే
పురురక్తి లేని వస్తువు
నిరసించి మిగిలిన వానినిం గొసినసరే.

క. అని మువ్వంకల చేడియ
వనజాక్షునకా సుగంధవస్తువు లీయం
గనుముదమునఁ గృష్ణుఁడు కై
కొని సిరి కొసంగెనందుఁ గొన్ని నృపాలా! 149

తే. తానొసంగిన కలపముల్ మేననలఁదు
కొనెడు కృష్ణునిఁగాంచి వీపునకు నేనుఁ
బూసెదనటంచు నా కుబ్జ పూనికొనిన
వారిజాక్షుండు నవ్వుచు నూరకుండె

క. ఆవసితఁగాంచి పౌరుల
హా పురుషోత్తముని దేహ మంటియులఁదె నెం
తో పూని చందనాది మ
హా పరిమళవస్తుప్రాగ మచ్చెరువుగదా! 151

క. మువ్వంకలు గలదనియును
రువ్వకుఁ గొఱగానిదని కురూపిణి యనుచుఁగా
నవ్వితి మీకుబ్జను నే
డివ్వనజాక్షు దయఁగాంచు టెఱుఁగమి నకటా. 152

వ. అని యిట్లు పౌరజనసహస్రంబులు పరమాశ్చర్య భరి
తాంతఃకరణులై చూచుచుండ న ప్పుండరీకాక్షుండు
సుగంధ ప్రియుండు కావున నదభ్రసాహిత్యాశయుండై
యా కుబ్జను లోకోత్తర సౌందర్యవతిం జేయఁదలంచి
తదీయ పాదంబులు తన పాదాంగుష్ఠంబులం ద్రొక్కిపట్టి
దాని గొదలక్రింద లోకరక్షణప్రశస్తంబులగు పాణిపద్మం
బులుంచి యాకర్షించి విడిచిన నజ్జగన్నాయకుని హస్త
స్పర్శ ప్రభావంబున. 153

సీ. అవటంబులై బిడాలాక్షాభమైన లో
చనములు హరిణలోచనములయ్యె
నరిమేధ దండంబులట్లు బొప్పులచేఁ జె
లగు భుజంబులు మృణాళంబులయ్యెఁ
జిన్న చేటలపోలికఁ జెన్నారు శబ్దగ
హములు శ్రీకారంబులై పొసంగెఁ

పల్లము ఒపెరితుమ్మ

బక్కలు శింఘాణమెక్కువై నిండిన
పెను బుఱ్ఱముక్కు నువ్వు ననయయ్యె
ముడిబొమలజంట కార్ముకమ్ము సరిదూఁగె
లంబకుచములు లికుచంబుల కెనయయ్యెఁ
గోడిమెడఁబోలు గళము సంకుతులయయ్యె
వాసుదేవుని కృపచేఁ ద్రివక్రకపుడు. 154

సీ. కమలినమాడ్కి నీలిమగల రదనచ్ఛ
దములు రక్తకలతాంతంబులయ్యె
వరఘటీయంత్ర పిఠరముఁబోలిన స్వకో
దరము నిర్మల కృశత్వములుగాంచె
నస్థిసంఘాన్వితమై కండలేని స తొడలు
క్థులు కదళీస్తంభములనుఁబోలె
సరవిఁ జూపఱకు ననహ్యమై కనుపట్టు
ముంగాల్ప్రపదంబు లాకచ్ఛపముల నెనసెఁ
చరణతలములు విద్రుమస్ఫురణఁ దనరెఁ
గలువరేకులజాడ నంగుళులు వెలసె
నడుమునకు లేమి శ్రోణులకడరె ఘనము
వాసుదేవుని కృపచేఁ ద్రివక్రకపుడు. 155

సీ. కొన్నాళ్ళు మట్టిలో నున్న దేయను నిందఁ
బడయక విలసిల్లు పసపుఁగొమ్ము
కుంపటికాకలకు వశంబుగాకుండఁ
బొడసూపు మేలి పసిఁడిసలాక

కర్కశభావ మెక్కడనో తొలంచి చై
తన్యంబుఁ గాంచిన తమ్మికెంపు
చంచల భావలేశంబు విసర్జించి
నిలిచిన సౌదామనీలతాళి
రాణఁ గరగించిపోయు వరప్రవాళ
రాశియననొప్పె గుబ్జాపురంధ్రి తనువు
కమలలోచను దివ్యానుకంపచేత
వినుము పరుసంబుసోఁకి హేమించునట్లు. 156

సీ. గళనిస్వనంబు కోకిలముల వారించెఁ
బలుకు కీరములతోఁ బంతమాడె
హాసంబు చంద్రికతో సమానంబయ్యె
గమనంబు గంధద్విపముల నేలె
లపన పద్మం బక్కలానిధి నిరసించెఁ
బలుచాలు ముత్తియంబుల నదల్చెఁ
జాతుర్యమొగిఁ గవీశ్వరుల నాజికిఁ బిల్చె
సౌకుమార్యము శిరీష సుమమెనసెఁ
దుఱుము నీలపుఱాల చుట్టఱికమొందెఁ
గత్తి సమమైపొసంగె నూగారుసారు
క్రమతరమైన వళులు భంగములదూఁటె
వాసుదేవుని కృపచేఁ ద్రివక్రకపుడు. 157

తే. ఎలమివిష్టపముల నలరింపఁ గోరి
యజుఁడుకల్పించు మోహినీయంత్ర మనఁగఁ

బంచబాణుని యూఱవ బాణమనఁగ
వెలసెఁ గృష్ణానుకంపచే నల త్రివక్ర. 158

తే. రామపాదధూళిచే మును శిలవధూ
త్వము వహించె నీ త్రివక్ర కృష్ణ
కరుణచేత సోయగముఁ గాంచె వీఁడు వాఁ
డొక్కఁడేమొ యన్నరి పెక్కు జనులు. 159

క. ఆసమయంబున హాటక
వాసుండు త్రివక్రఁ గాంచి వనితామది సం
తోసముగలిగెనె కొఱంతలు
వాసెనె యన నామె పల్కె వనజాతునితోన్. 160

ఉ. నీకరుణారసంబు మహనీయ కరాంబుజమే శరీరిపై
సోఁకునొ తచ్ఛరీరియలసుండయినన్ జగదేకమాన్యుఁడౌఁ
గాక కొఱంతలంగనునె కావున నేను పునీతురాలనై
వీఁక వహించినంగలదు వేఱొక వాంఛిత మాలకింపుమా.

ఉ. ఇచ్చితి నిర్జరాంగనల కేనియు దుర్లభమౌ సురూపమా
పచ్చపటాణిజోదు నను బైకొని కాఱియ పెట్టసాగినా
డిచ్చ వలంబడంచుటకు నే మనుజాధము నాశ్రయింతునా
యిచ్చ ఫలింపఁ జేయుటకు నీకొనిభర్తృవుకమ్ము కేశవా!

క. ఈ రుచిరాకారం బొనఁ
గూరిచి నన్నన్య జనునికొఱకిచ్చిన నీ
మారాకారము వృథగా
దా రసికాగ్రణులు విన్నఁ దల్లడఁ బడరే. 163

క. పురుషత్వమున్న చో నా
సరసీజాక్షుం డమోఘ సౌందర్యముచేఁ
బరగెడు కుబ్జను విడుచునె
సురతముఁ గావింపకన యశోహానిగదా. 164

చ. పలుకులనేక మేమిటికి పారకృపారస మానసుండవై
యెలమి భవచ్ఛుభాంగము మదీయశరీరముతోడ నేకమై
చిలుకపటాణి రాతుపనిచే సుఖమొందిన నిల్చుఁగాని య
ట్లలవడకున్న నా బ్రతుకహా బలునాళ్ళిలమీఁద నుండునే.

చ. ఇదివరదాఁకఁ గాముకుల నీకొనికొల్చెడు కామినీచ్ఛటల్
వదరుచు నిందఁ జేసితి వ్యవాయమనన్ మదనుండనంగఁ
ద । త్ప్రదరములన్న నారసెడు ప్రాజ్ఞతలేని జఘన్యపో
టనై । తుదకుఁ దదీహలొందితి వధూత్వము నీవానఁ గూర్ప
మాధవా. 166

క. నీపాణి సరోజముచే
నా పాణి గ్రహించి మఱియు నాపదమును నీ
శ్రీపాదముచేఁ ద్రొక్కితి
వీపని దాంపత్యధర్మమేగద కృష్ణా. 167

మ. మరియాదల్ నిరసించి వ్రీడనటు పొమ్మాయంచు వర్జించి
నా । కరముల్ చాచులుఁ గోరుచున్నవి నినుం గాఁగింట
లాలింప నీ । నరమధ్యంబున నట్లొనర్చినఁ జెఱుల్ నా

సొంపు నీకీర్తియుం । చు రహిగ్ యోచనఁ జేసి యోర్చి
తిని యాసూ నాస్త్రి నాటోపముగ్. 168

మ. అని పొంగారుముదంబుతోడ సరసీజాక్షుగ్ సమీపించియ
వ్వనితారత్నము కొంగుఁబట్టి నరమా ప్రాణేశుఁడాశ్చర్య
హృ।ద్వనజుండై యిటు వల్కెఁ సత్వరమెదగ్, వారింపుమీ
నాడువాం । ఛనొగిందీర్చెదఁ గంసునింగెడపియు, త్సా
హంబుతోఁ బిమ్మటగ్. 169

క. ఈవేళకుఁ గోపింపకు
మీవిలసిత గృహముఁ జేరు మీ మూకెపుడుగ్
మీవంటివారి వసుతులె
తావులగుగ్ సొంతయూరు తలఁగిన కతనగ్. 170

మ॥ అనిగోవిందుఁ డుస్వీయహస్తము తదీ,యాంగంబునందుం
చి సాంత్వన వాక్యంబులఁ దేర్చినంతట వధూ, త్తంసంబు
మోదించి వె । న్నుని పాదంబుల శీర్షముంచి లలిఁ గ,
న్నుల్ మోపి జోహార్లు చ । య్యనఁ గావించి పురీజనం
బలర, నాత్మాగారముం జేరఁగగ్. 171

ఆ. అయ్యాగార వైభవాధిక్యమెన్నంగ
నలవిగాక వైజయంతమట్లు
సర్వభోగ్యవస్తు సముదాయసము పేత
మైతనర్చుచుండె నద్భుతముగ. 172

ఆ. ఆనికాయ్యమునకు నన్నివైపులయందు
నిబిడనిష్కుటము లనేకముండె

నిష్కుటములలోన నిర్ఝరతరువులఁ
బోలుభూరుహంబులోలిఁదనరె. 173

క. ఆ నిష్కుటములలో లో
తైన సరస్సులును వాని యందంబు జముల్
జానగు సౌగంధికములు
నానాకువలయములుండె నవ్యతరంబై. 174

క. శుకములు జక్కవపిట్టలు
కికీదివ్వులు కలరవములు కేకులు వరచా
తకములు పికములు బకములు
సకల విహంగములు గలిగి చనె నత్తోటల్. 175

క. ఆవిపుల నిష్కుటాళి ప
రీవృతమగు మేడలోఁ జరించెడు వరదా
సీవార మెదురుగాఁజని
వావిరిఁ బూజించి యాత్రివక్రాపదముల్. 177

క. బంగరుపళ్లెరమునఁ గూ
ర్మింగడిగి పటమునఁదుడిచి మేడకురమ్మా
బంగారుబొమ్మ యన న
య్యంగనఁ దత్సౌధమునకు నరిగి కనంగన్. 178

సీ. హాటక ధనపూర్ణ పేటికలొకమూల
బలితమౌ ధాన్యరాసులొకమూల
విలువగల్గిన వస్త్రవిసరంబు లొకచెంపఁ
బరిమళద్రవ్య ప్రపంచమొకట

సురుచిర శాకవస్తువ్రాత మొకప్రక్క
దధిసర్పిత్రక దుగ్ధంబులొకటఁ
దపనీయ డోలావితానంబు లొకక్రేవ
లలిత భోజ్యపదార్థము లొకయోర

నిండి మంగళ దేవతాన్వితమైన
నిలయమునఁ జేరి కుబ్జ గణింపరాని
విస్మయముఁ జెంది యిమ్మహావిభవమెల్ల
నంబుజాక్షు ననుగ్రహమని తలంచి. 179

సీ. కమనీయ హేమప్రేంఖలయందు నూఁగుచుఁ
జెలువొప్పఁ గైసేఁతఁ జేసికొనుచు
నారామములలో విహారంబు సల్పుచు
సఖియలచేఁ బరిచర్యఁ గొనుచు
రాజాంగనలతో సరవిబంతులాడుచుఁ
జంద్రశాలోపరిస్థలిఁ దిరుగుచు
శుకమరాళాది పక్షులను లాలింపుచు
సత్కథాగ్రంథముల్చదువుకొనుచు

భక్ష్యభోజ్యలేహ్య పానీయచోష్యాదు
లారగించి సౌఖ్యమందిమనుచు
వారిజాక్షురాకఁ గోరుచు సైరంధ్రి
నిలిచియుండె నాత్మనిలయమందు. 180

శ్రీకృష్ణుండు కంసాదులఁ జంపి స్వజనకాదుల బంధవిమోచనంబు సేయుట

వ. అంతనక్కడఁ గృష్ణుండు కుబ్జను వీడ్కొని రాజమార్గంబు వట్టి చని చని కంసమందిరద్వారంబు సమీపించి యచ్చటంగల ప్రచండశరాసనంబుఁ దుత్తుమురు సేసి కువలయాపీడమను దంతినిఁ దదీయాధోరణుని వధించి సభాస్థలంబున కరిగి ముష్టికుని బలరామునిచేఁ జంపించి తాను చాణూరుని జముప్రోలికనిచి వరుసగా మల్లురనందఱి గెడపి కంసుని వధించి దేవకీవసుదేవోగ్రసేనాదుల కారాగృహవాసంబు వదలించి శ్రీకృష్ణుండు తల్లిదండ్రులకిట్లనియె.

క. తలిదండ్రులకంటెనుఁ బూ
జ్యులు లేరు శరీరికనుచు శ్రుతులును శాస్త్రం
బులు సెప్పుచుండెనా సూ
క్తులు నమ్మి చరించువాఁడు దురితము లడచున్. 182

క. ఆకారణమున మిమ్ముల
నా కంసుఁడు బంధనాలయంబున నుంపం
జేకొని ప్రోవక కడపితిఁ
బోకాలము తప్పుగాదె పొరినూహింపన్. 183

క. దాసునితప్పులు దండము
తో సరియనుసూక్తి మీమతులఁదలఁచి యద
భ్రాసక్తినిఁ బ్రోవుమనం
గా సరసిజాక్షు వారుకని పలికిరొగిన్. 184

క. మా పూర్వకర్మఫల మి
య్యాపద పాల్చేసెఁగాని యక్కట నీవే
లా పరితాపముఁ జెందెదు
తాపసమందార నీకుఁ దప్పులుగలవే. 185

ఆ. ఇప్పుడైననీవు హెచ్చినకరుణతోఁ
గంసుఁజంపి సమ్ముఖముల పిలిచి
తల్లిదండ్రియని ముదంబున గౌరవ
మ్ముంచి పల్కితదియె ముక్తి మాకు. 186

వ. అని దేవకీవసుదేవులు జనార్దనునిఁ గౌఁగిలించి ముద్దువెట్టి బలభద్రుసహితమట్లు లాలించి కంసాసురునివల్లఁ బొందిన మనస్తాపంబు దిగనాడి రటుపిమ్మట భాగవత శిఖామణి యైన యుగ్రసేనుండు బలరామకృష్ణులఁ ననేకవిధంబులఁ బ్రేమింప నప్పుండరీకాక్షుం డుగ్రసేనునకుఁ బట్టాభిషేకం బొనర్చె నటుపిమ్మట వసుదేవుండు కులగురుండైన గర్గునిఁ బిలిపించి రామకృష్ణుల కుపనయనంబు సేయించి వారి జన్మకాలంబున మనోదత్తంబులైన పదివేలగోవులను వెండియుం గొన్ని ధేనువులను బ్రాహ్మణులకు దానం బొసంగె నిట్లుండ నొకనాడు శ్రీకృష్ణుండు దన దివ్య చిత్తంబున నిట్లని వితర్కించె. 187

మ. జననంబుల్కల వెన్ని యోజగతిపైఁ జగ్గింపగా వానిలో
మనుజత్వంబు ప్రధానమమ్మనుజ జన్మంబుకాల సద్విద్యచే

తనె సాఫల్యముఁ గాంచు సద్గురుని చెంతం జేరి శుశ్రూషఁ
జేసినఁగాదే చదువబ్బునట్టి గురునిఁ సేవింపనర్హ బగుఁ.

వ. అని యోజించి మాధవుండు బలభద్రసమేతుఁడై యిరువురును వారణాశికిఁ జని పూర్వమవంతిని వాసుండై ప్రస్తుతము కాశిలో బాలురకు విద్యఁ గఱపుచున్న సాందీపని యనుగురునిఁ జేరి యాశ్రయించిరని నరాజిట్లనియె. 189

ఆ. వేదవేద్యులై వివిధవిద్యలాత్మలోఁ
గలిగియున్న రామకనక వాసు
లేల గురుని చెంత కేగిరో వివరింప
వలయునన్న యోగివర్యుఁడనియె. 190

క. తా మాచార్య సపర్యా
కాములు కాకున్న మనుజ కాండంబులదే
క్షేమపథంబని సద్గురుఁ
బ్రేమింపక చెడుదు రనెడు భీతికి వశులై. 191

తే. విద్యలెల్ల నధీనమై వెలయుచున్న
వానిలోలోనమాటి సర్వప్రపంచ
సంగ్రహార్థము కాశికిఁజని బుధాగ్ర
గణ్యుఁడైన సాందీపునిఁగాంచి మ్రొక్కి. 192

తే. మేము విద్యార్థులై వచ్చినాము చదువు
సెప్పవలెనన్న విప్రుఁడాశీర్వదించి

రామకృష్ణుల విగ్రహోద్దామ సుందర
రాపఘన లక్షణంబులకు లరితలచె. 193

క. నరనారాయణులో భా
స్కరచంద్రులో హుతాశ గంధవహులో ని
ర్జరవైద్యులో కాకుండిన
ధరలో వీరలనుఁబోలు ధన్యులుగలరే. 194

క. వీరలపై నాచార్య
త్వారూఢము నెరపినట్టులైన యశోవి
స్తారుఁడ నౌదుననుచు వి
ద్యారంభము సేసె యాదవాన్వయుల కొగిన్. 195

క. సమిధలు దర్భలు బహుప
ర్ణములనుఁ దెచ్చుచు మురారి రాములు శాస్త్రో
క్తమగు గురుభక్తిఁ జేయుచు
సమస్తవిద్యలనుఁగోరి చదివిరిలేశా. 196

సీ. ఐదు బడులలోని యక్కరాలొకనాడు
పైకెక్కన గుణితంబు లొక్కనాడు
కాఠిన్య విమల నిఘంటువులొకనాడు
మక్కువ శబ్దాదు లొక్కనాడు
నొక్కొక్క యామ్నాయ మొకనాడు
వెండియు నొక్కొక్క వేదాంగమొక్కనాడు
నొక్కొక్క యుపవేద మొకనాడు ధాతువు
లొకనాడు శాస్త్రమొక్కొక్కనాడు

నేర్చుకొనిరల సాందీపనికడ రామ
నలినలోచను లఱువదినాల్గువిద్య
లఱువదియు నాల్గుదినముల కచటనుండు
చదువరులు లజ్జయును మహాశ్చర్యమొంద. 197

క. ఈపగిదిఁ జదువ నాసాం
దీపనివారలల సత్ప్రతిభఁగన వాఁదం
బాపాదించిన జయమునఁ
దీపారిరి గురుఁడుమెచ్చి దీవనలిచ్చెన్. 198

వ॥ ఏతత్సమయంబున సహాధ్యాయులగు విద్యార్థులొక్కొక్క
రుఁగా నిట్లనిరి. 199

సీ. శబ్దమొక్కటి వేయిసార్లు వల్లించినఁ
గాని నోటికిరా దొకానొకపుడు
వచ్చెనంచును గురువరుఁ జేరియప్పగిం
పఁ దలంప నాల్గవపాలునిలుచు
నానాలుగవ భాగమైన సభాస్థాన
మునఁ బ్రసంగించుచో మొదలెరాదు
చదివిన చదువులే సంవత్సరంబుల
కొలఁది వల్లించిన ఫలముఁగాన
రాదు మాకటు బహుదుష్కరమగు విద్య
లెల్ల నేర్చితిరయ్యారె పల్లవములు

గోసినట్టులఁ గన్నులు మూసినట్టు
లల్పకాలంబులో మనీషాఢ్యులార. 200

సీ. సురదీర్ఘికా ప్రవాహ రయనిభంబులై
వెలయు మీవిశద వాగ్విస్తరములు
ముక్తాఫలసమూహములఁబోలి నిరతంబు
కమనీయమైన మీ విమలలిపులు
గాంభీర్యమున దుగ్ధకంధినిఁబోలు మ
హత్తరంబైన మీయాశయములు
శాంతిచే మెలఁగెడు సన్మునీంద్రులకైనఁ
గీర్తనీయములు మీ వర్తనమ్ము
లయ్యలార విద్యలార్జించి స్వస్థాన
మునకుఁ బోవుమిమ్ముఁ గనినయంత
నింకఁజూడఁజాల మీ జన్మమున వీరి
ననెడు చింతమాకు నధికమయ్యె. 201

వ. అని విశ్లేషభీరువులై దుఃఖింపుచున్న సహశ్రోతలనాలింగనాదులచే సంభావించి సాంత్వన వాక్యంబుల నాదరించి సాందీపనిఁగాంచి ప్రభూ! గురునకు యోగ్యోపహారంబు సమర్పించినంగాని శిష్యునకు సార్థకంబులేదని పెద్దలు వక్కాణింతురు గావున నెద్దియైనం గోరుమనుటయు నక్కోవిదుండు రామకృష్ణుల ప్రతిమప్రభావసంపన్నులగుట నెఱింగిన వాఁడగుటంజేసి వారలంగని మహాత్ములారా

సంవత్సరములక్రిందట స్నానార్థంబరిగి మృతిఁ బొందిన
బాలునిఁ దెచ్చియిమ్మనుటయు సమ్మహాపురుషులు పారా
వారంబు డాయంజని యిట్లనిరి. 202

క. వనధిమా దేశిక నం
దనుఁ డొకవత్సరమునాఁడు తావకనీరం
బున మునిఁగి చచ్చెనట యి
చ్చినచో మంచిదగుఁ దడవుసేసెదవేనిన్. 203

క. ఇంకింతుము నిన్ననఁగ భ
యంకర వాక్యమ్ము విని మహాబ్ధివడఁకుతోఁ
గింకరభావంబూని శి
వంకరులైనట్టి వృష్ణివర్యుల కనియెన్. 204

ఉ. పంచజనాఖ్య రాక్షసుఁడు బ్రాహ్మణసూనుని మ్రింగి నన్ను
వం । చించి మదీయగర్భమునఁ జేరెనన్ విని రామకృష్ణు
లే । తెంచి జలస్థదైత్యుని వధించి తదీయ శరీరమున్ వి
దా । రించి ద్విజన్ముఁ గానక పొరిం గనిరందునఁ బాంచ
జన్యమున్. 205

క. ఆ పాంచజన్యమునుఁ గొని
గోపాలురు యమపురమునకుఁ జని దరరవ
వ్యాపారంబొనరించిన
గోపురద్వారంబుఁ జేరుకొని జముఁడంతన్. 206

ఆ. రామకృష్ణ పాదరాజీవములకు సా
ష్టాంగనతులొనర్చి స్వనిలయంబుఁ

జేర్చి శాతకుంభ సింహాసనము లిచ్చి
యెదుటనిల్చి వారి కిట్టులనియె. 207

ఉ. ఏలినవారలిచ్చుటకి నేమితపంబున వచ్చినారు మ
త్పాలన లోపమేమయిన, బాల్పడి తెచ్చెనొ మిమ్ము నం
చును । ద్వేలభయంబుగల్గెఁ బనిఁదెల్పినచో సవరించు
కొందు నా । పాలిటి వేల్పులార! యనఁ బల్కెన నవ్వి
జనార్దనుండనున్. 208

మ. కలదే లోపము నీకుఁ ధర్మమున కగ్గంబై ప్రజాపాల నం
బలఘుజ్ఞానముతో నొనర్చెదవు శ్రేయస్స్వాంతకాశీపురిం
గల భూదేవకుమారుఁడిచ్చుటకి రాఁగా వానిఁగాంక్షించి
యీ । స్థలికిన్ వచ్చితి మాగురూత్తమున కాతండాత్మ
జుండౌఁ జుమీ. 209

క. నేనబ్బాలునిఁ గొనిచని
దానము దేశికుని కీయఁదలఁచితి ననినీ
యూన కెదురుగలదే యని
కీనాశుఁడు దెచ్చి బాలుఁగృష్ణుని కొసఁగెన్ 210

క. యమునకు సెలవొసఁగి రమా
రమణుఁడు గురుపుత్రుతోడ రామునితోడన్.
గమనించి వారణాశి పు
రమునకుఁజని గురునకనెఁ గరములు మొగిచియున్. 211

క. ఇతఁడేనా మీసూనుఁడు
మతిలోఁ గలలోపములు సమసెనే కట్నం

బితరంబడిగిన నిచ్చెద
ము తొలఁగఁబోమన్న విప్రముఖ్యుఁడు వల్కెన్. 212

తే. గురుఁడు కోరినకట్నంబుఁ గొంకులేక
తెచ్చియిచ్చి కోఱంతలు దీర్చినట్టి
శక్తిమంతులుగలరె యిజ్జగతిలోన
మీరుగాక న్యులెందైన ధీరులార. 213

ఉ. ఎక్కహాయంబులున్ రథములేని కపిండులుగల్గి యేలఁగా
మిక్కిలి భూములుంగలిగి మీనపతాక శరోపశాంతికై
చక్కరబోండ్లుగల్గి ధనసంపదగల్గి యశంబుగల్గి మా
కొక్కఁడులేక సౌఖ్యములనొందుడనన్ దరహాసవక్త్రులై.

వ. రామకృష్ణు లాచార్యునకు ముహుర్ముహుర్నమస్కారంబు
లొనర్చి సెలవొంది మధురాపురంబునకరిగి జననీజనక
ప్రభృతి బాంధవజనంబుల నానందపరచుచుండి రటు
పిమ్మట. 215

శ్రీకృష్ణుఁడు కుబ్జాగృహంబున కరుగుట

ఆ. ఒక్కనాడుకృష్ణు డుద్ధవునింగూడి
యరదమెక్కి కుబ్జనాదరింపఁ
దలఁచి పోవుచుండఁ దద్వార్త చేటిచే
విని త్రివక్రగాంధ వినయమొప్ప. 216

వ. లేచి కొంతదూరంబరగి. 217

సీ. తనవారు మున్నేడు తరములనుండి దాఁ
పగబయల్పడిన సేవధియనంగ
నిన్నాళ్లుపోటమై యేడ్చినందున జాలి
పడి మారుఁడిడిన సంపదయనంగ
దమ్మిపుట్టువు ప్రమాదము దిద్దుకొని కూర్మిఁ
బనిచిన లిఖిత ప్రపంచమనఁగ
గోటిజన్మములఁ జేకూర్పంగ రాశియై
తనువుఁదాల్చిన సుకృతంబనంగఁ
దన్నుఁడాసిన వరయశోదాకుమారుఁ
జారుకోటీరు ఘోరసంసారదూరు
నుతసుధాశనవారు నంచితగభీరుఁ
గనియె సైరంధ్రి కన్నుల కఱవుదీఱ 218

తే. అట్లుగని నందసూను దివ్యాంఘ్రియుగము
పసిఁడి హరివాణమున నుంచి భక్తితోడఁ
గడిగి తడియొత్తి పాదోదకములు కొన్ని
గ్రోలి పైఁజల్లుకొని యింటఁ గొన్ని చిలికి. 219

క. భాగవతుఁడైన యుద్ధవు
బాగుగఁ బూజించి మ్రొక్కి భర్మాసనముల్
లోఁగిట వైచినఁ గృష్ణుఁడు
భాగవతుఁడు నాసనముల పై నిల్చిరొగిన్. 220

సీ. ముందుగా వ్యాకులమ్మునఁ జరియించెడు త్రివ
క్రామతి కేశవాగమనవార్త

విను వేళఁ జెవులఁ బ్రవేశించె హరిడాయ
గమనింపఁ జేసెఁ బాదముల నిలిచి
హస్తయుగ్మముఁ జొచ్చి హరిపదప్రతతాళి
నావాప్తిఁ గలిగించె నక్షియుగముఁ
జేరి యిమ్మాధవోదార సౌందర్యాంగ
దర్శనలాభంబొదవనొనర్చె
నోలిహరితోడ ఘనరతి కేళి సౌఖ్య
మింకఁగనుటెప్పుడని హెచ్చరింపఁ దొడఁగె
నౌర మానసమునకు సాధ్యంబుగాని
పనులుగలవె జగంబునఁ బార్థివేంద్ర. 221

మ. వరకుబ్జామనమమ్మురారి పదముల్ వర్ణించి యామీఁద
సుం । దర జంఘాయుగమున్ స్పృశించి తరువాతన్
సక్థులన్ నిల్చి భా । స్వర తుందంబుఁ గటిప్రదేశము
రముం బ్రాపించి శ్రోణీయుగో! ద్ధుర సౌందర్యము సన్నుతిం
చి ఘనసంతోషంబుతోఁ బిమ్మటన్ 222

మ. హరిపాణుల్పరికించి బాహుల సొంపగ్గించి కంఠంబొగిం
బరిరంభించి కపోల యుగ్మమును సంభావించి బింబోష్ఠపై
ఖరి కానందముఁ జెంది నాసికను వేడ్కం జేరి నేత్రంబులా
దర మొప్పం దిలకించి పొంగెనువ ధూత్తంసా శయంబ
త్తటిన్ 223

మ. లలిగోవిందుని భ్రూయుగంబె నసిఫాలస్థానమున్ డాసి
యా । వలశబ్ద్రగహాముల్ నుతించి శిరమున్ వర్ణించివాల

చ్ఛటా । లలితంబుగని వ్రేళ్ళ సొంపుఁగని గోళ్ళంగాంచి
లావణ్యమి । మ్ముల మెచ్చెఁ సుదతీ మనంబు విలస
న్మోహంబు వర్ధిల్లఁగాఁ. 224

మ. జననంబాదిగఁ జంచలంబయి ప్రపంచస్థంబులౌ వస్తు
వుల్ । గను కుబ్జామనమున్మురారి విమలాంగంబుం బ్రవే
శించి వా । కొనవీల్గాని ముదంబుఁజెంది మఱచెఁ ఘో
రాక్షచర్యల్ మహా । మునియోగంబునఁ జొక్కుమాడ్కి
హరిపై మోహంబు సామాన్యమే. 224

ఉ. అత్తఱి నుద్ధవుండు కనకాంబరుమీఁద మెలంగుచుం బరా
యత్తముగాని చిత్తముగలట్టి వధూమణిఁ బాఱఁజూచియి
మ్మత్తకరీంద్రయాన సురమౌని సుదుర్లభమైన వైభవం
బిత్తఱిఁ బొందె బుణ్యచయ మేమియొనర్చెనో తొంటి
బాములన్. 225

వ. ఇట్టి ప్రస్తావంబులచేఁ గాలంబుగడచుటయు సాయంతనం
బున నుద్ధవుండు స్నానసంధ్యాదికాల్యంబులు దీర్చినటు
పిమ్మట సైరంధ్రి పట్టరానితమకంబున. 226

సీ. జలజాక్షు హాటకాసనమునందుంచి వి
నయమొప్ప నుద్వర్తనంబొనర్చి
సరిలేని పన్నీట జలకంబులాడించి
మేలిపావడల నెమ్మేనుదుడిచి
జాళువానూలి వస్త్రంబులు గట్టించి
నునుపుఁ గురులకుఁ బూనూనెరాచి

కస్తూరి చందనాగరువు లలంది విం
జామరంబులచే భృశముగవీచి
పూలసరులు కొన్ని పొలుపార సిగఁజుట్టి
కొన్ని మెడను వైచి కూర్మితోడఁ
జేరి కప్పురంపు నీరాజనములిచ్చి
పూజఁ జేసెఁ గుబ్జ భూవరేంద్ర. 227

వ. ఇట్లు పూజించి భోజనశాలకుం జేర్చి కృష్ణు నుద్ధవునితోడ సువర్ణపీఠంబులం గూర్చుండఁబెట్టి భక్ష్యభోజ్యచోష్య లేహ్య పానీయాదులు చామీకర మోచాపర్ణంబుల వడ్డించి దాసీజన పరివృతయైన సైరంధ్రి యిట్లనియె. 228

సీ. పాటింపుమనుచు దీపంబునో సంగరే
ప్రబలాంధకారంబుఁ బాపురవికి
ఘృతలేశముననె యాహుతులనో సంగరే
సర్వభక్షకుఁడై పొసంగు శిఖికిఁ
దమిమీఱఁ గార్పాస తంతువర్పింపరే
సస్యములొప్పించు చంద్రమునకు
నాపోశనంబీరె యంభోధిఁ బుడిసెడు
జలముసేసిన కుంభసంభవునకు
నట్లె మేము నీకు నర్పించు నాహార
మును భుజింపవలయు మొనసినీవె
పత్రపుష్ప తోయ ఫలములతో సంత
సించువాఁడవని వచింపలేదె. 229

వ. భోజనానంతరము తాంబూలాదులంగొని యుద్ధవుండు హరినివీడ్కొని వేఱొక మందిరమ్మున శయనించెనంత నమ్మాధవుండు నీహారకిరణకాంత శిలాకుట్టిమంబగు చంద్రశాలకరిగి మణిదీపంబులచేఁ బ్రకాశించుచున్న హంసతూలికా తల్పంబునందు శయనించె నటుపిమ్మట సైరంధ్రి మంగళస్నానం బాచరించి గోవిందుని భుక్తశేషంబు 230
భుజించి.

సీ. హరిపాద తలనిభంబై కోకనదవర్ణ
మెనసిన కౌశేయమును ధరించి
కనకాంబరుని హాసమునుఁ బోలి చంద్ర సం
కాశమౌ వరకంచుకంబుఁ దొడిగి
తోయజాక్షుని కీర్తితో సమానంబైన
చందనంబు శరీరమందు నలఁది
వలమురితాల్పు మేవలపుతో సరియౌ సు
గంధతైలము వెండ్రుకలకుఁ బూసి
పుష్పమాలలు కంధరంబున ధరించి
విమల మణిబంధములుగొన్ని వ్రేళ్లయందుఁ
గొన్ని వనమాలికలు సుట్టుకొని మరుద్వ
ధూలలామంబు చందానఁ గ్రాలిమఱియు. 231

సీ. తారలనెనయు ముక్తాహారములతోడఁ
గమనీయ తాళ పత్రములతోడఁ
రమణీయమగు శిరోరత్నంబుతోడఁ బ్ర

భాయుక్తమగు వాలపాళ్యతోడఁ
గనకాంగుళీయకాంగదములతోడ గ్రై
వేయలలంతికా వితతితోడ
నవకింకిణీ రశనాశలాపముతోడఁ
గొమరారు బలు సూడిగములతోడ

వెడలి సైరంధ్రి మరుదలివేణి యానఁగఁ
బాంచజన్యధరుని సమీపించినంత
నారసిక జనశేఖరుండాదరించి
రమణికరమును స్వీయకరమునఁబట్టి. 232

క. శయ్యాకు నాశ్రరించినఁ
జయ్యన నక్కోమలాంగిచని వెన్నుని ప్రా
పియ్యెడఁ గలిగెఁ గదాయను
నెయ్యంబునఁ గౌఁగిలించె నీరజనాభుఁ. 233

మ. పరిరంభించి మురారిపై నొరగి యో ప్రాణేశనాకీవు సుం
దరరూపంబొన, గూర్చినప్పుడె భవత్తారుణ్య సౌందర్య వి
స్తరలావణ్యములెల్లఁ దక్కెనని మోదంబందితింగాని దే
వరకారుణ్యము నేటిదాఁకఁజరిపెఁ వాల్లభ్య తేజోనిధీ. 234

క. ఓదయితా నీవేగిన
దాదిగ జరిగిన దినంబుల సదృశమై యొ
న్నొక్క దివ్యయుగములాయెను
నీదయయీనాటి కొదవెనే రసికవరా. 235

ఉ. ఎక్కడనుంటి వింతతడవేటికిఁ జేసితి వెవ్వరడ్డమై
యక్కఱతోడ నిల్పి రహహా నృపకాంతల కౌఁగిలింతలం
జిక్కితివేమొ నాకడకుఁ జేరుదొ చేరవొయంచజస్రముక్
మిక్కిలి దుఃఖమొందితిఁ జుమీ దెసఁగానక ప్రాణనాయకా!

సీ. చిరఁజీవి కూయుచో శ్రీకృష్ణుఁడీనాడు
వచ్చుట నిజమంచు వలచియుందు
వామాంశము మదీయ వామాక్షి పదరుచో
హరిరాక నిజముసుమ్మని తలంతు
రహిఁబింగళావిష్కరము డాసిపలుక వె
న్నుని పొందుచేకూరునని యలరుదుఁ
గలలోన నీరూపుఁగని నవ్వుడమ్మలు
దినమువచ్చెదవని దెసలఁగాంతుఁ
గాని నీవురాని కారణంబున నిశ
లెల్ల మోహమాటకేడ్చియేడ్చి
నన్ను నేనె సాంత్వనములఁ దేర్చుచుఁ గంట
నీరువెట్టుకొనుచు నూరకుందు. 237

సీ. వివిధదిక్కులనుండి వేల్పుసానులను ర
ప్పించి సోదియు వచింపించినాను
కార్తాంతికులకు రొక్కములిచ్చి నాతలం
పౌనా కాదోయంచు నడిగినాను
పుణ్యతీర్థముల కుబ్బునఁబోయి వేల్పుల
కెల్ల మ్రొక్కిడి నుతియించినాను

స్వర్ణదుర్వర్ణాది శ్లాఘ్యవస్తువులచే
సత్పాత్రదానముల్ సలిపినాను
కాని యీ సత్కృత్యములచేతఁ గాక నీదు
కరుణచేఁ దావకప్రాప్తి కలిగెనాకుఁ
బట్టువడితివి కౌఁగిలి పంజరమున
నింకఁ బోనిత్తునే జగదీశకృష్ణ. 238

చ. నిజమనుకొమ్మబద్ధమని నీవుతలంపు మెటైనఁగాని నీ
రజదళనేత్ర మామక కరంబును నీవుగ్రహించుటాది చి
త్తజుఁడు శరాసనంబుఁగొని దారుణబాణములేయుచుండె
న । గ్గజిబిజిఁ బాపవే యతులకామము దీర్పవె ప్రాణ
నాయకా. 239

శా. స్త్రీజన్మంబువహించి నిర్మల వయశ్శ్రీఁజెంది కామాగ్ని
లో । రాజిల్లు రతిసౌఖ్యమారయు వధూరత్నంబు ని
న్గాంచుచో । నీజన్మంబునగాని వేఱుభవమందేగాని నీతో
రతుల్ । తాఁజెందం దలపోయుఁగాని యితరుం దాఁకంగ
వాంఛించునే. 240

శా. అంగీకారముసూపితేని ధరణీశాంభోజగంధుల్ స్వకీ
యాంగంబుల్ నవరత్న భూషణచయంబర్పించి నీభార్యలై
బంగారంబునుఁబోలెఁగొల్చెదరు తద్భామావళిన్ దూఱిమ
త్సాంగత్యంబున కీడ్చితెచ్చినది సౌశీల్యమేకాదొకో.

ఆ. ధరణిలోని దేహధారులు వేలుల
కులకొలందినాకుఁ గానఁబడుచు

కైన నేమిఫలము నీ నఖాగ్రముఁగన్న
సౌఖ్యమగునె నాకు సత్యశీల. 242

తే. శిలలు రత్నంబులగునె యోజింపఁ దుహిన
బిందువులు వృష్టిధారలై పెంచగలవె
సస్యములనట్టులె శరీరిసంఘమెల్ల
నీవుకాఁగలరే నాకు నీరజాక్ష. 243

క. అని వచియించు విసారా
క్షినిఁ గృష్ణుం డంకమందుఁ జేరిచి నీచే
సిన పరిచర్యకు మెచ్చితిఁ
గను మొసఁగెద సురతసుఖము కామినియనుచున్. 244

చ. సరసిజలోచనుండు రహిఁజాచిన స్వీయకరంబు తద్వధూ
శిరమున మోపి చెక్కులు వసింపఁగఁ జేసి కుచద్వయంబుపైఁ
గరమనురక్తితోఁ గిలిపి కౌనుపయిన్ నిలుపన్ లతాంగి తాఁ
బరవశయై మురారి పయి వ్రాలి ముహూర్తములోన 245
లేచియున్.

చ. హరిమెడఁగౌఁగిలించి ముదమారఁగఁ జెక్కులు ముద్దు
వెట్టి పే। రురమునఁ జాచులుంచి చెలువొప్పఁగ నొత్తి
హృదీశ యున్నివా। సరములు రాశ తామసము సల్పిన
దానికి శిక్షవైతు న। బ్బురముగనంచు నన్నెలఁత పొం 246
దుగఁ జందురు కూనలుంపఁగన్.

ఉ. అన్నులమిన్న సేయుపని కంబుజనాభుఁడు సంతసించి య
క్కన్నియఁ గౌఁగిలించి కుతుకంబమరం బలుకెంపులుంచి

వి| ద్వన్నుతమా నఖక్షతకదంబములుంచి రమించె నాను
తోఁ| బన్నగ నిర్జరాంగనలు బాగు బళేయని మెచ్చ
నట్లుగన్. 247

ఆ. కళలెఱింగి దేశకాలంబులెఱిఁగి పా
త్రంబెఱింగి కంసదానవారి
సురతకేళిసలుప సుదతీలలామ సౌ
ఖ్యంబుఁజెంది తనివిఁగానకనియె. 248

ఆ. ప్రాణనాథ! నీవు ప్రకృతిపూరుషుఁడవు
కావుగనుక యెంతకాలమిట్లు
రతులొనర్చుచున్న రాగంబుతగ్గదు
హెచ్చుచుండుఁగాని యింతిగమికి. 249

సీ. వరసుమమాలికల్ బరువువీడినదాఁకఁ
పరిరంభ మొనరింపు ప్రాణనాథ
మకరికా పత్రముల్మాయుదాఁక పయోధ
రములు మర్దింపు మరాతిహరణ
పైనఁబూసిన కలపము రాలువరదాక
స్పర్శసుఖంబిమ్ము సరసిజాక్ష
సమ్మదాశ్రువుల నంజనము కరఁగుదాఁక
సురతంబొనర్పుమీ సూరివంద్య

యనుచు నప్పుణ్యసాధ్వి దైత్యారినడిగి
యడిగి పలువారు కౌఁగింట నదిమియదిమి

ప్రేమమీఱఁగ ముద్దులు వెట్టిపెట్టి
ప్రవిమలానంద మొందెఁబో పార్థివేంద్ర. 250

సీ. తరుణీ హృదయము మార్దవమయ్యెఁగుచములు
కాఠిన్యభావ మే కరణిఁదాల్చెఁ
గలికీ నడుము లేమిఁ గనెఁ శ్రోణియుగళ మే
చందాన. గౌరవంబొంది నిలిచెఁ
బాలతీ విమలఫాలఫలకో పరిసునీల
కుటిలాలకము లెట్లు పొటమరించె
లలనా చిగురు టాకులనుఁబోలు వ్రేళ్ళపై
వాడి నఖంబులే జాడఁబొడమెఁ

చెప్ప వేయని శౌరివచించినంత
నామెవిని వానిగుట్టు నా కేమి తెలియు
నయ్యసర్వజ్ఞుఁడైన నీ వరయవలయుఁ
గానియని చొక్కి నవ్వెనచ్చాననమిన్న. 251

క. మును తావకవిశ్లేష
మ్ముననిద్దుర పట్టకోరె మునరుచి తొలఁగెన్
నినుఁ బొందిన యానందం
బున నిపుడటులయ్యె నాకుఁ బురుషవరేణ్యా. 252

శా. గోపాలేశ్వర సంభ్రమంబుడిగి సంకోచంబువర్జించియే
వ్యాపారంబులఁబోక నిస్తుల కృపావంతుండవై మన్మథా
స్త్రాపాతవ్యథఁగుందునన్ను భవదీయాపాంగవీక్షాప్తిచేఁ

గాపాడందగు నూఱు వర్షములు సౌఖ్యంబొందెదం
గేశవా. 253

మ. కలబుంగాష్టలు వాసరంబులు నెలల్ గాథంబులై దుర్వి
షం। బులు గాఁదోఁచెను నీవులేనపుడు సమ్మోదంబుఁ
గావించి చిం। తలడంగించెఁ దదీయకాలములె యీస్థానం
బునం జేరి నీ వలఘు ప్రీతివసింపఁ జిత్రమిది సర్వైశ్వర్య
సంధాయకా. 254

సీ. లికుచముల్ బటువో నాదుకుచముల్ బటువో చేఁ
బట్టిచూచి వచింపు ప్రాణనాథ
నా కపోలములపై నీకపోలములుంచి
నును పేవియో తెల్పు కనకచేల
లలి నానడుము నీవలగ్నంబు పిడికిటఁ
జేర్చి భేదముఁదెల్పు శ్రీనిధాన
మత్పాణితోడ భవత్పాణిఁ గీలించి
మృదువెద్దియొ వచింపు సదమలాంగ

యనుచు సైరంధ్రి నందనందనుని బిగియఁ
గౌఁగిలించి తదంకంబుఁ గదిసిపలుకఁ
జారుమందస్మితముచే మురారి తగిన
మాఱుమాటలువల్కె భూమండలేశ. 255

సీ. నీ కుచగిరుల సన్నిధిఁ జేరి డాఁగంగఁ
గందర్పమృగయుఁ డెక్కడికిఁ బోవు

భవదధరామృతపానంబు నేఁజేయఁ
గామపిపాసాధికంబు సమసెఁ
దావకాంగాష్టాపదంబు సంపాదింప
విరహదారిద్ర్యంబు వెడలిపోయె
భవదీయ సంగమప్రాప్తి నేఁజెందంగ
దశవిధావస్థావ్యథలు నశించె

దావకీనోపకారంబుఁ దలఁచి తలఁచి
పొంగెదనటంచు నయ్యదుపుంగవుండు
రావేయని తల్పమందు సైరంధ్రినొత్తి
చేసె నాలింగనంబు జేజేలుమెచ్చ. 256

సీ. నీళనీచందాన లాలించినాడని
వినలేదు మనమో వివేకులార
భూదేవి కీరితి భోగమిచ్చినమాట
లాలించలేదు మహాత్ములార
పద్మాలయకు నిట్టి భావంబొసగెనంచు
నానుడి పుట్టదో జ్ఞానులార
దివియందుఁబుట్టిన నవలాలకీమాడ్కి
భోగంబు లీలేదు పుణ్యులార

దైత్యపరిపంథి కృష్ణావతారమొంది
నేటికీ కుబ్జ కొసఁగెంబో నిబిడసౌఖ్య
మని వచింపుచు నిర్జరు లద్భుతముగఁ
బూలవానలు గురిసిరి భూపవర్య. 257

సీ. చెలిమిక త్తియలు భాషించినప్పుడు సమా
ధానమిచ్చెడు తీరికైన లేక
తమిమజ్జన మొనర్చి దాసీలు తనమేని
తడియొత్తునందాఁక దడవులేక
యిరుగు పొరుగు వార లేదియైన వచింప
నాలకించెడు రంధ్రమైన లేక
చేలంబులునుఁ బూలమాలికల్ రహిఁదాల్చు
చోనవకాశ మింతైన లేక

సూర్యుఁడుదయించు టస్తమించుటయుఁగాన
కమ్మహాదేవి బంగారు బొమ్మ కుబ్జ
నందనందను పాదారవిందములు భ
జింపుచు సుఖించె నేమని చెప్పవచ్చు. 258

సీ. కవినూత్న నిర్మాణ కాలంబునందునఁ
దనమానసము ప్రబంధంబునందు
ఘనశూరుఁ డాహవంబొనరించు వేళల
గాఢలక్ష్యము కార్ముకంబునందు
భవ్యకర్మంది తపము సేయునప్పుడు
సాధనప్రాప్తి సమాధియందుఁ
దమిఁగదర్యుండు యత్నమొనర్చు నవసరం
బునస్వక ప్రాణముల్ ధనమునందు

నర్పణము సేయు పగిదిఁ దదంబుజాక్షి
నందనందను నందున డెందమెపుడు

నిలిపి యనన్యంబు వర్జించి నిబిడభోగ
మందె గణుతింపఁ దరమె పుణ్యాతిశయము. 259

సీ. వ్యవసాయంబున వర్తకంబునను సేవావృత్తిఁ గోటివృ
త్తి వశంగంబుల మానసంబులిడి శక్తింగాంచుచున్నట్టి
మా । నవసంఘంబులకంటె సంతతము నానాకృత్యముల్
మాని కే । శవు నర్చించిన కుబ్జదెంత విమలస్వాంతంబొ
యోజింపుమా. 260

వ. ఒక్కదినంబున దేవకీనందనుని పాణి తనపాణిచేఁ గీలించి
సైరంధ్రి యిట్లనియె. 261

చ. వనజదళాక్ష పూరుషులు నామలకెన్నియొ భూషణం
బులున్ । ధనము లమూల్యవస్త్రములు ధాన్యములున్
రతనంబులిచ్చినన్ । మనసున సేవగించి పయిమాటలచేఁ
దనియింతురట్టి జ । వ్వనులు రమింపఁగోరి నిను వావిరిఁ
బిల్తు రదేమిచోద్యమో. 262

ఉ. గౌరవమొంది నిర్భర సుగంధముఁ జెంది వికాసమొంది యి
దారుణియందు గంధఫలి తారొగనెనే భ్రమరంబునట్లె
శృం । గారముఁగల్గి యౌవనముఁగల్గియుఁ గృష్ణుని బొంద
మైతి మా । హా రమణీత్వ మెందుకనియందురు కొందఱు
నిన్నుఁగూర్చియున్. 263

ఉ. ఇత్తఱిఁ గర్మభూమిపయి నింపలరన్ నవలాలమై నరేం
ద్రోత్తమశాలలన్ జననమొంది సురూపముఁ బొంది మన్మ

థా। యుత్తమహృదబ్జములఁ గలిగి యాదవనాథునితోఁ రమిం
పలే। యుత్తలమొందఁగా వలసె సుక్కటియుందురు కొంద
రచ్యుతా. 264

మ. మరియాచేటికిఁ బెద్దవారినుడుల౯ మన్నింపఁగానేల చె
చ్చెరసామీప్యముఁ జేరి కృష్ణుఁగని దాసీభావముం బొంది
హృత్సరసీజంబుల నిత్తుమేని మనవాంఛల్ దీర్పఁడే
యమ్మహా! పురుషుండందుకు కొందఱంగనలు నిన్ మో
హించి ప్రాణేశ్వరా. 265

ఉ. ఒక్కని యాజ్ఞలోఁ నిలువవొక్కలతాంగికిఁ జిక్కఁబోవనీ
వెక్కడనున్న నేపనుల నెట్లొనరించిన నేమిసెప్పిన౯
దిక్కులనుండు సూరులును తింతురు వేదమయుండవౌటనీ
వెక్కడమామకీన భవమెక్కడ నెంతటికెంత మాధవా.

ఉ. ఈయెడకీవువచ్చి లలినిన్నిదినంబులు నిల్చియుండుటల్
కాయజసౌఖ్యమొందుటకుఁ గాదుమదుత్కట భక్తికగ్గమై
పాయక నిల్చినాడ విదిపండితహృద్యముగానికాదయా
హేయము హేయమన్న నరుఁడేగును దుర్గతికబ్జలోచనా.

మ. సితకీరంబున కన్నివైపులను వాసింగన్న మాధుర్యమే
సతతంబుండునుగాని తిక్తమొక పార్శ్వంబందునంగల్గ ద
గ్గతినీ చర్యలు లీలలు౯ నుడులు మోక్షశ్రీప్రదంబుల్ముని
స్తుతియోగ్యంబులునై చెలంగుఁ గద రక్షోవంశ శైలాశనీ.

ఉ. కొలిచిన వారికిచ్చెదవు కోర్కులుకొల్చినవారి భక్తికిం
గలదు మితంబు నీకిడు సుఖంబులకు౯ మితిగల్గదందులోఁ

జెలులబలల్ స్వతంత్రమునుఁ జెందనివారను జాలిచేత మి
క్కిలి దయఁ బ్రోచుచుండెదవు శీతకరాభ యశోధురం
ధరా. 269

శా. పాతివ్రత్యసుమంగలత్వములు సౌభాగ్యంబు యోగ్యంబు
ని । ర్భీతిత్వంబును మానినీజనుల కీపృథ్వీస్థలంబందు నీ
చేతన్నిల్చునుగాని లేనియెడఁ గాసింజెందరే దుర్జన । వ్రా
తోద్భూత దురంతదుఃఖ నిబిడావాప్తిన్ జగన్నాయకా.

క. ఇటులని కరములు మోడ్చిన
మిటారిఁ గని కేశవుండు మృదుహస్తముచే
గుటిలాలక రమ్మని చెం
గటికాకర్షించి పలికెఁ గడుఁపుసిమురుచున్. 271

క. నీవాడుదాన వైనన్
భామిని నాతత్వమెఱిఁగి భాషించితి విం
కే వరమైన నొసంగెద
వేవేగమె కోరుమన వివేకమునననన్. 272

చ. అవని ననేకజన్మములకైనను జీలికిఁ జావుగల్గ ద
ట్లవ్వటఁ దదీయజీవుఁడు గలంతటికాలము చానమిన్నవై
భవదనుకంపనొంది నినుఁ బాయకకొల్చుచుఁ బుష్పకా
ర్ముకకో । త్సవములఁ దేలునట్టుల వెసన్ వరమిమ్మన శౌరి
నవ్వుచున్. 273

క. ఇచ్చితి నవ్వరమనఁగా
నచ్చామీకరసమాంగి యలరి ముకుందున్

మెచ్చి పరిరంభసౌఖ్యం
బిచ్చి కపోలములు పుడికె నిభపురనాథా. 274

ఉ. పంకజనాభుఁడట్టు లెలపాయమునందునఁ గుబ్జఁగూడి నా
నాంకసుఖంబులందఁగఁదదంగనయున్ సమమౌవయస్సుచే
బంకజనాభుఁగూడి నిరపాయసుఖంబులు సెందుచుండె న
ప్పొంకముఁజూచినన్ వినిన భూరియఘంబులు నాశమౌఁ
గదా. 275

సీ. దండియంబున స్వవస్త్రములుంచి మురవైరి
పరిధానములు దానిపైనవైచు
ముందద్దమున నిజముఖము నిరీక్షించి
హరి మోముఁగను నద్దమల్లెయుంచి
తన రూపమునుఁ గుడ్యమున వ్రాసి హాటకాం
బరుని చిత్రముదానిపై లిఖించుఁ
గమలాక్షుపాణి ఖైఖరి పుత్రికాయుక్త
చోలములోఁ గక లేవేళఁదాల్చుఁ
దనపటంబునుఁ బెట్టెలో నునిచి దాని
పై విభుని రూపపటముంచి ప్రాణనాథ
మెచటఁజూచిన మీఁదైతి పీవదేమి
విస్మయమొయును కుబ్జ గోవిందుఁగాంచి. 276

క. హరితనయింట నిలుచు వా
సరములలో నతడొనర్చు చర్యలుకుబ్జా

తరుణి విడికి పటముల శుభ
కరమని వ్రాయించెఁ జిత్రకారులచేతన్. 277

క. ఏగదిలో నేమేడల
నేగోడలయందు నిండ్లనెచటఁగనిన నా
నా గర్భగృహమ్ములలో
నా గోవిందుని పటంబు లగపడుచుండెన్. 278

శా. మారీచుండు భయంబుచేత రఘురామస్వామి రూపంబు
ఘో। రారణ్యంబున సర్వవృక్షసముదాయంబందుఁ గ
న్నట్టు లా। సైరంధ్రీమణి భక్తిచేతఁగనె గృష్ణస్వామి
రూపంబు భ। వ్యారామంబుల మేడలందునను స్వప్నా
వస్థలందున్ రహిన్. 279

క. మారీచుఁడు కంసుండిత
రారంభముమాని కేశవాకృతి భయవి
స్ఫారగులై కాంచిరి ముద
పారఁగమై కాంచెఁ గుబ్జ పరికింపుమెదన్. 280

చ. వెలగలు గంగరావులును వేములు మఱ్ఱులు రావిమావి
జ। మ్ములుకల జువ్వలూడుగులు మోదుగు గేదఁగి జాజి
నిమ్మమ్రా। కులు గురివెందపొన్నలును గోరఁట మంకెన
మొల్లమల్లె దాఁ। కలుగల తోఁటలంజలిపెఁ గామినితో
మురజిద్విహారమున్. 281

చ. కలికలు కుట్మలంబులును గమ్మనిపూవులు పల్లవోత్కరం
బులు వెసఁగోసి మాధవుఁడు పూని వధూమణిమీఁద

జల్లఁగాఁ । గిలకిలనవ్వి యహో ప్రలతి కృష్ణుని దేహాము పుష్ప
నిర్మితా । చలమును బోలఁ జేసి సరసంబగుమాటలువల్కె
న త్తతిన్. 282

సీ. దయిత నీమంజులాధరనిభ ఫలసంత
తుల నీనుచున్నదీ తుండికేరి
దితిజారి భవదీయదేహావర్ణము తోస
మానమైనది యుత్తమాలశాఖి
పురుషమణీ భవత్పరిమళాధిక్య సం
కాశమై వెలసె శ్రీఖండభూజ
మఖిలేశ నీదు కల్యాణగుణాభ ఫ
లౌఘములొసఁగె ద్రాక్షావనిజము
పుణ్యశీల వీని పొంకంబుఁ జూడనీ
గౌరవాతిశయముఁ గాంచి బాంధ
వంబొనర్పఁదలఁచు వైఖరి నున్నది
యన్న వెన్నుఁడనియె నతివఁగాంచి. 283

సీ. తిర్యగ్గమనమొంది తిరుగాడు హరిణమే
శరణి నీ నేత్రయుగ్మంబుఁబోలు
శీతభీరుఖ్యాతిఁజెంది పుట్టినమల్లె
విరులెట్లు నీదుపల్వరుసఁ బోలు
కంటకావృతమై ప్రకాశించు కేతకీ
సుమమెట్లు నీదు నిద్దమునుఁబోలు
వాడినంతట నేలవ్రాలెడు ముంకెన
పూవెట్లు నీదు కెమ్మోవిఁబోలు

సాటియగు నేమొయని పెక్కుచందములనుఁ
దర్కమొనరించి చూచి సార్థకముగాన
రాక నేనాస మానితీరమణి యనఁద
రస్మితము సేసి కౌఁగిసైరంధ్రివలెక్క. 284

క. ఆరామములన జస్రము
శ్రీరమణివసించునని వచింతురు బుధులా
శ్రీరమణి సౌఖ్యమునకా
ధారుండవు నీవకావె దనుజవిదారా. 285

ఆ. నీవులేనివేళ నీవనభూములఁ
గాంచియుంటిఁగాని గవ్వకైన
సాటిరాక నీదు సంచారమున వైభ
వమున వెలసెనిపుడు వనజనాభ. 286

క. ఈగతిభాషించిన శర
ణాగత వత్సలుఁడు సారసాక్షినిఁగని యెం
తో గారవించి సరసికి
నేగెన్ జలకేళిసలుప నింపలరారన్. 287

సీ. కమనీయ భవదవక్త్ర పరాక్రమాభమా
కోకనదములచే గొనబుమీఱి
భవదీయ హాసప్రభానిభంబైనట్టి
పుండరీకములచేఁ బొలుపుఁగాంచి

తావకీన యశోవితాన సంకాశ మ
రాళ సంఘములచేఁ రాణఁజెంది
భవదీయ గౌరవోత్సవ సన్నికాశమౌ
సౌగంధికములచే సతతమమరి
కొలఁకు రాజిల్లుచున్నది గొప్పవాఁగు
తనకడకు వచ్చునప్పుడు తగినవస్తు
వులనుగూర్చుట కొలఁదివారలకు సహజ
మౌఁగదాయని హరితోడ నతివపల్కె. 288

సీ. తనయగాధాధికత్వంబైన భవదీయ
గాంభీర్యమున కెనగాదటంచుఁ
దన పూలలో మరందంబైన నీమాధు
రీ గుణాభంబౌట రిక్తమనుచుఁ
దన తోయనిర్మలత్వము తావకీనాంగ
పావనతకు నీడుపడదటంచుఁ
దన తమ్మిరేకులైనను భవదంగుళీ
పూగంబుతో సరిబోలవనుచు
నెంచి కాఁబోలు కొలఁకు చలించుచుండె
నటులఁ గాకున్ననూర్మి కాచ్ఛటలికేల
కలుగుననుచున్న సైరంధ్రి పలుకులాల
కించి శ్రీకృష్ణుఁడామెపైఁ గేలుమోపి. 289

మ. రావేసుందరి పూవుఁబోడి నవలా రాజీవపత్రేక్షణా
రావే చందనగంధి కుందరదనా రాకేందు బింబాననా

రావే బంధురకంధరా గుణవతీ రక్తాబ్జ పాణీవధూ
రావేయంచు మురారి కుబ్జనొగి నీరంబందుడించెన్ రహిన్.

సీ. కుటిలాలకను నీటనటుడించి మధువైరి
తనపాణి నామె తుందమున మోపి
యీదించి యీదంగ మోదించికుత్తుక
బంటినీరముల లోపల వసింపఁ
జేయంగ నా లేమ చేతులెత్తుచు నుద్దు
గుడువంగఁ గౌఁగింటఁ గ్రుచ్చియెత్తి
నీటిపై నిలిపి యా నీరేజనయనుండు
కొంతసేపీది యక్కాంతతోడఁ
దీరమునుఁజేరి యామెపై నీరుజల్లెఁ
జానమిన్నయు హరిమీఁద జలముఁ జల్లె
నిట్టుజలకేళిసల్పి వారిద్ద ఱాల
యంబుఁ జేరి సుఖించిరో యవనినాథ. 291

వ. ఇట్లు సౌధంబు డాయుటయు నమ్మందిరంబునంగల దాసీజనంబు లద్దివ్య దంపతుల శరీరంబులు మేలివస్త్రంబు లం దడియొత్తి చీనాంబరంబు లొసంగిన ధరించి సర్వాలంకార భూషితులై రటుపిమ్మట మధుసూదనుని యరాళ కుంతలంబులు ప్రసాధనిచేఁ జిక్కుదీయుచు సైరంధ్రి యిట్లనియె. 292

సీ. ఉన్నతాసనమునందుండి కొమ్మడి విప్పఁ
గా నేలదాఁకు దీర్ఘంబుగలిగి

యూవచ్ఛిరంబుపై నావిర్భవించియుఁ
గమనీయతర సమగ్రములుగలిగి
కేతకీసుమముల నూతనాదర్శంబు
లను గేలిగావించు నునుపుగలిగి
పులిదిండిజాల సొంపును హరింపఁగఁజాలి
నిగనిగయను జగాజిగులు గలిగి

సరవిఁ దనరారు నీశిరోజముల కీప్ర
భావ మేరీతిఁ గలిగెనో ప్రాణనాథ
యనుచు సైరంధ్రి చిక్కుదీయంగ మంద
హాస మొనరించె నా సువర్ణాంబరుండు. 293

తే. అటుల జరపుచు మధ్యాహ్నమైనమీఁద
షడ్రసోపేత పూత భోజన మొనర్చి
రాత్రికాలంబుడాయ సైరంధ్రికొసఁగ
సురతసౌఖ్యంబు నమ్మధుసూదనుండు. 294

వ. ఇవ్విధంబునఁ గృష్ణుండాకుబ్జ కమానుష సౌఖ్యంబులొసం
చుండఁ గొన్నిమాసంబులు కడచె నటుపిమ్మట సైరంధ్రి
యిట్లనియె. 295

ఆ. ఇన్నినాళ్ళనుండి యిబ్భంగి భోగంబు
లీవొసంగ నాదుభావమందుఁ
దనివిగల్గదయ్యెఁ దలపోయ గోపాల
సతుల కెట్టులుండు సరసిజాక్ష. 296

ఆ. నిన్నుఁగూర్చి వారలెన్నివిధంబుల
నేడ్చుచున్నవారొ యిప్పు డుద్ధ
వుని బిడానఁ బంపి గోపికల ర
ప్పించి నాకుఁ గానిపింపుమనిన. 297

వ. మానినీమణీ నేను మఱచియున్నను మహాభక్తులగు గోప
కామినులను స్మృతికిఁదెచ్చి మేలొనర్చితివి వారలిప్పు
డిచ్చోటికి వచ్చుటకు వీలులేదు నీవు చూడఁగోరితివేనిఁ
బ్రభాసతీర్థమందుఁ జూపింతునని మాధవుండు వల్కెనని
శుకయోగీంద్రుఁడు పరీక్షిన్నరేంద్రుని కెఱింగించె నంత.

శా. పారావారపరీవృతోరు నగరీప్రాసాదసందోహ సం। చా
రోదార విదర్భరాజతనయా స్వాంతాబ్జ హేళీవధూ।వా
రానంగ విహంగరాట్తురగ దీవ్యద్రత్న కోటీర సం।సార
క్లేశ వినాశ ధేనుగణరక్షాదక్ష కంసాంతకా. 299

క. సరసీరుహ మృదుపాదా
కరుణాహృత ఖేదసుజన కాండాహ్లాదా
నిరుపమ వంశనినాదా
పరిపాలితవేద లోకభరణ వినోదా. 300

మాలినీవృత్తము

సురుచిరగుణజాలా, సూరివారేడ్యశీలా
కరివర పరిపాలా, క్రమగాంగేయచేలా

దురితదితిజకాలా, దుఃఖనిర్మూల లీలా
పరిచరజనలోలా, పాకజిన్నీలవాలా. ౩౦౧

ఇది శ్రీ సీతావల్లభప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్రరత్నానుసంధాన పవిత్రాంతరంగ నిఖిలదుర్మతశిలోచ్చయ దంభోళీభూత సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహబోధిత విశిష్టాద్వైత రహస్యార్థధురంధర శఠగోపయతిరాడ్వర వరయోగిప్రభృతి పూర్వాచార్యచరణసరోజ భ్రమరాయమాన మొవ్వవంశతిలక కృష్ణాంబాకృష్ణార్యతనూజ శ్రీవైష్ణవవిధేయ వేంకటదాసనామధేయ ప్రణీతంబైన గోపికావిలాసంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము

సంపూర్ణము.

# గోపికావిలాసము

## చతుర్థాశ్వాసము

---

క. శ్రీకృష్ణ సమరవిజయా
ప్రాకృత దివ్యాంగ లోకపావనలీలా
స్వీకృత కల్యాణగుణా
నీక జగన్నిలయ వారినిధి గంభీరా. 1

వ. అవధరింపుము. 2

క. సైరంధ్రీమణి విమలా
గారంబుననుండి శార్ఙ్గకార్ముకుఁడరి సం
హారుం డుద్ధవునిఁ దరిఁ
జేరుచుకొని పల్కెనిట్లు క్షితిభృత్ప్రవరా. 3

శా. అన్నా యుద్ధవ భక్తులై సకల వాంఛానీకముల్దూఱి మ
త్సాన్నిధ్యంబునఁ జేరి కొల్చిరల ఘోషస్త్రీలు నన్వీడి యె
ట్లున్నారో దిగులొంది డీలుపడి యీయుర్వీస్థలింబాసి యే
మన్నారో విని చూడమైతిమిగదయ్యా యిన్నినాళ్లేగినన్.

శా. అక్షీణాశయులై సదాకొలుచు భక్తానీకముం జేరి యో
గక్షేమంబులు సంతతమ్మరసి తత్కాంక్షల్ ఫలింపించి దే
హాక్షీణంబగు నంతదాఁక మహనీయ శ్రద్ధఁగాపాడుచున్

మోక్షంబిచ్చుట లెల్లకార్యములలోఁ ముఖ్యంబు నాకాఁ
జుమీ. 6

శా. తన్నేనమ్మి భజించు వారల మనస్తాపంబుఁ జల్లార్చి నీ
రాన్నంబుల్కలిగించి యాపదలు వాయంజేసి రక్షించుసం
పన్నుండా మగవానిదే బ్రతుకు తద్భాగ్యంబె భాగ్యంబు
కా ।కున్నంజచ్చిన లాభనష్టములు లేవూహింప భక్తాగ్రణీ

మ. వివిధ గ్రామపురీస హస్రముల తీవిన్ సంతతంబేలు భూ
ధవు డందొక్కటివోయినన్ బహుళచింతాస్వాంతుఁడై
నట్లు భ । క్త వరండంబులు కోటులుండినను మద్దాసా
ళిలో నొక్కసా । ధువునైనన్ విడలేదు నాహృదయ మో
దోషజ్ఞ చూడామణీ. 7

ఉ. ధారణగల్గినేనె నిజధారకపోషక భోగ్యవాళిగా
నారసిసంచరించెదు వ్రజాంగన లిత్తఱినన్నుఁ బాసిమే
తీరుననేడ్చిరో కినిసి తిట్టిరొ ప్రాణములేదిరో నిరా
ధారతఁగాంచిమే మయిరొ తద్వ్యథ నెంచినఘోరమయ్యె
డున్. 8

ఉ. మందకుఁ బోయి నీవు వ్రజమానిను లందఱిఁ జేరఁదీసియా
నందముఁగల్గఁజేసి వేసనానుడులన్నియుఁ దెల్పిపాణిచే
నిందునిభాస్యలన్నిమిరి యేను ప్రభాసనమాఖ్య తీర్థముం
బొందిననాడు రండనుము పొమ్మన నుద్ధవుఁడాత్మఁబొం
గుచున్. 9

తే. హరికివలఁగొని మ్రొక్కి తదంఘ్రియుగముఁ
గన్నుఁగవనద్దిలేచి యాజ్ఞ నువహించి
పటు శతాంగము నెక్కి వ్రేపల్లెకరిగి
నందు నీక్షింప నాతఁడానంద మొందె. 10

తే. అర్ఘ్యపాద్యాదివిధుల మహార్చలొసఁగి
పాడియావును మఱి మధుపర్కమిచ్చి
యుద్ధవుని పాదముల ఫాలముంచి మ్రొక్కి
తిండివెట్టించి శయ్యఁ బరుండఁ జేసి. 11

మ. బలరాముండు నధోక్షజుండు సుఖులై పాలింపుచున్నారె
కే | వలనీతిన్ మధురాపురంబు నగరీవాసుల్ మహాభక్తి
వా | రలఁబూజింతురె కృష్ణుఁడచ్చటికిఁ జేరంబోయి యి
న్నాళ్ళకీ | స్థలికిన్ రాక నిరాకరించి మము సంతాపింపఁ
జేసెంగదా. 12

ఉ. నమ్మిన గోపభామల ననాథలఁ జేసి కళిందజానదిన్
వమ్మొనరించి శృంగిణుల వార్తఁదలంపక బృందనైనఁ జి
త్తమ్మున నాదరింపక వృథంగనుతల్లిని నన్నుఁ జూడకే | ట్ల
మ్మహనీయుఁడుండెనిదియద్భుతమయ్యెగదయ్యయుద్ధవా.

క. ఆ నందుని మాటలువినఁ
గానె యశోదకు ముదంబు గాఢంబైనన్
మానిని నిలుపోపక మే
ఘానిధి నుద్ధవునిఁగూర్చి తడయకపల్కెన్. 14

క. ఈభవనమందున నేను
మిన్నాభంగి ననాదరించి యేపురమందో
తా భోగమందునని కల
లో భావింప మొగివేణులోలునిఁ గృష్ణున్ 15

సీ. అటువోయి యిటువచ్చి కుటిలాలకములతో
నన్నుఁజేరి తల్లిరో యని వచించుఁ
దోడుకులపాలు పిదుకువేళ పైవ్రాలి
మెడఁగౌఁగిలించి బువ్వడుగుచుండుఁ
బారుగిరు గిండ్లలోఁ బెరుగు మీఁగడపాలుఁ
ద్రావి వారలతోడఁ దగవుఁదెచ్చు
నవ హేమ కింకిణీ నాదంబు ఘల్లు ఘ
ల్లని మ్రోయుచుండ నాట్యంబొనర్చు
జిలుకపలుకులు పలుకుచుఁ జెంగలించుఁ
గెంపుకంటి విధంబునఁ గేరిపాడు
నట్టి నాబిడ్డ శ్రీకృష్ణుఁడచ్యుతుండు
గానఁబడకుంట జగమెల్ల లేనిదయ్యె. 16

సీ. చైత్రరథముఁబోలె సౌఖ్యంబొనంగిన
బృందావనమును మానందనుండు
విరజా సమానవైఖరి తన్నుఁగొలిచిన
యమునానదిని మదీయాత్మజుండు
దవ్వులందుండియుఁ దనమాట వినిడాయు
మాహోచయమును మా మాధవుండు

తన్నే డుగడయంచు నెన్ని సేవించిన
గోపాంగనల వృష్ణికుంజరుండు
మఱచిపోవుటచాల విస్మయముగాఁ గఁ
దోఁచుచున్నది యెట్టులైనఁ దోయజాక్షు
నిచ్చటికిఁ దెచ్చి చూపింపవే యనంగ
నెలమి నుద్ధవుఁడనియె వారలనుఁ గాంచి. 17

ఉ. గాలిని మూటఁగట్టుటకు గాడ్పు చెలిన్ లలిఁ దాఁక భూమిపై
ఏలగునే జనాళికటు విశ్వమయున్ సకలాంతరాత్ము గో
పాలకులాగ్రగణ్యు మురభంజను నిష్టమువచ్చినట్లుగా
మ్రోలనెయుంచి సౌఖ్యములఁ బొందఁగ శక్యమె యెంత
వారికిన్. 18

ఉ. నిర్మల భక్తినిష్ఠులకు నీరజనాభుఁడు సిక్కుఁగాని స
త్కర్మము లెన్ని చేసిన నొకానొకవేళ లభింపఁబోవఁడీ
మర్మమెఱింగి కాదె సురమౌని పరాశరుఁ డాంజనేయుఁడున్
ధర్మసుతానుజాదులు సదా హరిఁగొల్చి కృతార్థులైరొగిన్.

వ. కావున భక్తియోగంబున జనార్దనుని భజింపుడు కృతార్థులయ్యెదరని నందయశోదలకు బోధించి యుద్ధవుండా రేయి నిద్రించి వేకువ జామున లేచి యమునానదికిం జని కృతస్నానుండై సంధ్యావందనాది కాల్యంబులు నిర్వర్తించి బృందావనంబునం దొక్క వృక్షమూలంబున ను ఖాసీనుండైయున్నంతఁ దదాగమనంబన్నిశాసమయం

బున నెఱింగి యున్నవారగుటఁ జేసి గోపాలాంగనలతి త్వరితయానంబుల నరుగుదెంచి యుద్ధవునింగని నమస్కరించి తదీయానుమతంబున నతనిం బరివేష్టించి కూర్చుండి యిట్లనిరి. 20

మ. వినుమో యుద్ధవ మామనోహరుఁడు దోర్వీర్యప్రసిద్ధుండు
ని । న్ననుపంజాలెనె నేటికిచ్చటికిఁ బొమ్మ్మాయంచు మే
లెంచి తా । జననీవ్రతలఁజూచి రమ్మనుచుఁ జాల్ చాలింక
మాయావి నా । తని నమ్మందగ దెంతవారలకు సంతా
పంబుఁ గల్గింపఁడే. 21

క. మా సేమ మెట్టులుండిన
నాసారసలోచనుఁడు శుభావాప్తుం డై
భాసిల్లిన నాలించి మ
హా సంతోషంబుఁ గాంతు మనవరతంబున్. 22

ఉ. కావున సేమమే గద జగద్విభుఁ డయ్యదువంశసత్తముం
డావనజాతలోచనుఁ డహర్పతి తేజుఁ డమేయశీలుఁడా
పావనమూర్తి దైత్యకులభంజనుఁ డారసికాగ్రగణ్యుఁ డ
ద్దేవసమానుఁ డంచదుగఁ దెల్పు శుభంబని యుద్ధవుండొగిన్.

శా. ఆవాక్యంబుల నాలకించి మహనీయస్వాంత యుగ్గోప
కాంతా । వారంబరి భృద్వియోగమున సంతాపించి బా
ష్పాంబుపా । రావారంబులు గల్గఁజేయుచు రమారామా
మనోనాయకా । దేవా యంచు నుతించి మెచ్చి పలికెన్
దీనాననోపేతమై. 24

క. ఎడతెగక నందనందను
కడనుండుట కెట్టితపముఁ గావించితివో
పుడమిని నీసరిపుణ్యులు
పొడమరు ముందిపుడులేరు బుధజనతిలకా. 25

తే. అఖిలసంగ పరిత్యాగమాచరించి
తన్ను నమ్మిన గోపకాంతలకు నొక్క
మాటయైన వచింపక మధురకేగె
సరసిజేక్షణుఁడట్టి వంచకుఁడుగలఁడె. 26

సీ. వంటకంబు భుజింపవలెనన్న రుచిలేదు
బలవంతమునదిన్న ఫలముగల్గ
దద్దమరేయి యుండైన నిద్దురరాదు
వచ్చిన మెలకువ వచ్చునపుడె
నిశలకన్నఁ బగళ్లు నిడుదలై యొప్పారెఁ
బగటికంటెను నిశల్భారమయ్యెఁ
దగిన బాంధవులలో నెగతాళిమోపయ్యె
దిగులు మాయెదుట మూర్తీభవించె

నందఱికిఁదోఁచెఁ జావురాదయ్యె ననెడు
వినుఁడు గోపాలకామినీ వితతికిచట
నందపుత్రునిఁ బాసిననాటనుండి
యెవరికంటునో యీపాప మెంచిచూడ. 27

సీ. వలచివచ్చినబాల తలఁపుఁదీర్చక ముక్కు
చెవులు గోయించి వంచించినాఁడు

తన్ను నమ్మిన భానుమన్నందనుని వాలి
నెలవునకనిచి తన్నించినాడు
నిన్నెడఁబాయలే నన్నాయనుచు నేడ్చు
భరతువాంఛను భంగపరచినాఁడు
నిండుచూలాలివై నిర్దోషివైయున్న
సీతనరణ్యంబుఁ జేర్చినాడు

సారసాక్షుండు రామావతార కాల
మందు నాతఁడెగద కృష్ణుఁడయ్యె నిప్పు
డక్కటా మార్దవంబెప్పుడైనఁ గలదె
నమ్మిచెడితిమి యాదవనాథునేము. 28

సీ. తలఁచునే మేమెల్లఁ దన కొఱకై బంధు
జనసమూహములఁ బాసిన విధంబుఁ
బలుకునే సంసారముల దూఱినిశలలోఁ
దన్నేముపొందు వృత్తాంతములను
వాకొనునే మమ్ముఁజే కూర్చి రాసలీ
లావినోదమొనర్చు భావములను
వర్ణించునే మమ్ము వరయమునను జేర్చి
జలకేళి సల్పిన సంగతులను

వాసుదేవుండు నిజ భక్తవరుడవైన
నీకుఁ జెప్పక దాఁపడు నీరజాక్షుఁ
డాశ్రితాళి పరాధీనుఁడగుటఁ జేసి
చెప్పవే యుద్ధవా! గొప్ప నేము మొదవు. 29

మ. నరనాథోత్తమ కన్యలా మధుర నున్నారట్టె వారి రమా
వరుఁడౌ కృష్ణునిఁ గాంచి నంతట నె వేవాంఛింతు రమ్మోటి సుం
దరుఁడక్కన్నెలతోడఁ గూడి సుమకోదండ క్రియాలో
లుఁడై । మరగుణ్ రాడని యెంచుకొంటి మిపుడా మా
టల్ నిజంబయ్యెఁబో. 30

మ. అనుబోధంబును సాంకవంబు ఘనసారాదుల్ రహింబూ
సి హెచ్చిన చాతుర్యముతో విలాసములతో శృంగార
సౌందర్య యా, వనలావణ్యనిధానులై మెలఁగు రా
డ్వామాలలామాళ్ళిఁ గూ, డిన కృష్ణుం డెటులొల్లు నీఁ వ్రజ
వధూటీ కూటమో యుద్ధవా. 31

క. ఎక్కడ మధురానగరం
బెక్కడ వ్రేపల్లె కృష్ణుఁ డిచ్చటికిఁ కఁదా
నెక్కరణివచ్చు మాయెద
లుక్కఅనిటు లేడ్చు చుండుటొక్కటి దక్కన్. 32

సీ. మాశృంగిణీపాళి మావులైతగు నె గో
పాల దేవునకు వాహ్యాళి నేయ
మాబలీవర్ధముల్ మద దంతులౌనె కే
శవునకు నెక్కియుత్సవ మొనర్ప
మా విపినము నిష్కుటావళులౌనె నీ
రజనాభునకు విహారంబొనర్ప
మాయాకుటిండ్లు హర్మ్యంబులై చెల్లునే
చక్రపాణికి నివాసంబొనర్ప

నసిశ మిటఁగల గోపకామినులు రాజ
కన్యలౌదురె భోగింపఁగ ల్గిచెలికి
నేలవచ్చును శ్రీకృష్ణుఁ డింకమీఁద
దెలుపవేయుద్ధవా నీకుఁదెలియవచ్చు 33

సీ. మురవైరి యీగ్రామమున సంచరింపంగఁ
గనెడు భాగ్యంబు మాకన్నవలకు
వనజాక్షుఁ డే కాంతమునడాయఁ దత్కర
స్పర్శంబుగనులబ్ధి చన్నవలకు
నెదురైన గోవిందు నదిమికౌఁగిటఁ జేర్చు
ధన్యత మాభుజద్వంద్వములకు
రేఁగి భాషించు వారిజనాభు పల్కుల
చ్చుగవిను పుణ్యంబు శ్రోత్రములకు
నేకశయ్యయందు శ్రీకృష్ణుతో నిధు
వన మొనర్చు యోగ మొనరునే శ
రీరములకుఁ జెప్పవే రమ్యఫణితి వి
స్తార సుగుణధుర్య ధీరవర్య. 34

సీ. శ్వశ్రూశ్వశురుల శాసనమాదరింపక
శ్రీకృష్ణుకడకు విచ్చేసినారు
చెలఁగి యెల్లపుడు పోషించు భర్తలఁబాసి
జలజాక్షు మగనిగాఁ దలఁచినారు
పరలోకగతులిచ్చు వరకుమారులదూటి
నందనందనుని బల్ నమ్మినారు

బహువిధాధారులౌ బాంధవ్యులను వీడి
గోవిందు నేవేళఁ గోరినారు

వల్లవీజను లటులైన నొల్లకుండ
విడిచిపోయెను కృష్ణుడిప్పుడిఁక నేమి
చేయుదురటంచు మమ్ముఁగూర్చి ప్రజలాడు
పరుసముల కోర్వలేమైతి మురుగుణాఢ్య. 35

క. వటుధర్మము గృహిధర్మము
జటిధర్మముగాదు మాది సన్యాసము గా
దిట నిహము లేదు పరమె
ప్పటికైనను గలదొ లేదొ భక్తవరేణ్యా. 36

ఆ. పక్షికైనఁగలదు భావింప సౌఖ్యంబు
పురుగుకైనఁగలదు భూరిసుఖము
మాకు లేదుగాదె మధుసూదనునిఁ బాసి
నందువలన నెట్టులాడవచ్చు. 37

సీ. తేనెలానిన మీఁదఁ దేటితమ్ముల భోజ
నాంతంబునందు గృహస్థునతిథి
విద్యవచ్చినయంత విద్యార్థి గురుని యా
వనమునశింప లంజెను విటుండు
ధనమిచ్చినంత దాతను యాచకుండు తె
క్కలువచ్చినంత వృక్షమును పక్షి

నదితరించిన మీఁద నావను పాంథుఁడు
శిథిలహాలముఁ గృషీవలుండు

విడిచినాఁడు మమ్ము గుడుసు వాల్గొల్వరి
యెన్న లేదు పాపమన్న మాట
భక్తజనులఁ దానె బాధించినట్టైన
నెవ్వ రాదరింతు రిహపరముల. 38

సీ. తనకు జోహారువు లొనరించువానినిఁ
దపియింపఁ జేయఁడే తామ్రరశ్మి
తనప్రీతికై హోమ మొనరించు వానినిఁ
గాల్పఁడే స్పర్శింపఁగా ననలుఁడు
తనకు మాంసంబీయఁదలచి డాసినవాని
లలిఁజంపకున్నె చాఅల మొకంబు
తన్నుఁ బ్రాణముఁబోలె దాఁచినవాని శి
క్షింపించదే దొంగచేత ద్రవ్య

మట్లె మా ప్రాణనాథుఁడయ్యంబు జాతుఁ
డిప్పుడెడఁబాసి మమ్ముల నేడిపించు
చున్నవాఁడెవ్వరికిఁ జెప్పుకొన్న సిగ్గు
వోవుఁజెప్పనిచో దుఃఖమావరించు. 39

ఉ. మేనులు వాయనెంచుకొని మేమొక మోచన సేసి నిల్పినా
మానలినాక్షుఁడెప్పటికి నైనలభించు లభించెనేని యా
మానశరాసరాజ్యమొగిఁ జొప్పడునంచుఁదలంచికానిచోఁ

బూనమె చావుఁజెందుటకుఁ బూనిన సాధ్యముగాని కా
ర్యమే. 40

చ. కరుణ కసాయివానికినిఁ గల్గునొకప్పుడు మందుడైన దు
ర్నరునకుఁ జానలందొదవు నర్మిలి పుణ్యనిధానమైన మా
హరికెటు దప్పెనో నెనరహా నెఱనమ్మిన గోపికాపరం
పరపయినస్మదాఘమటుపాల్పడఁజేసిన దేమొ యుద్ధవా.

మ. జననంబొందిన వేళలోఁగలుగు దోషంబో భవంబొందిచే
సినదోషంబొ పురాకృతాఘమొగదా చీకాకుఁజెందించె
మ । మ్మనిశంబీగతి నెట్టులోర్వఁగలమయ్యా వాసుదే
వుండు దీ । ర్చనఁగా కెవ్వరుతీర్తురీవ్యధను సూరిస్తుత్య
జ్ఞానాశయా. 42

ఉ. వారిధిమీఁదివృష్టి పెనువాఁకపయిన్ రహిఁజల్లినట్టి ప
న్నీరము కొండఁబ్రాఁకనిడు నిచ్చెన నిద్దురజెందు దాతనుం
గోరి భజించుయాచకుని గోరుకులట్టుల వ్యర్థమయ్యెఁ గం
సారినినమ్మి మాఁబ్రతుకహో యిఁక నేమనవచ్చు నుద్ధవా.

ఉ. ఈసచరాచరక్షితికి నెన్నఁగనేనె నియామకుండనై
భాసిలుచున్నవాఁడ ననుఁబాసినచో గతిలేదు జీవికా
యాసముఁజెందియైన వశులాదురు గోపవధూటులంచురా
ధాసఖుఁడిట్లు వేచుటలు ధర్మమె తెల్పఁగదయ్యయుద్ధవా.

సీ. గమనింప శౌరి పాదములు నొచ్చెనటంచు
ఘనకుచంబులచేతఁ గాచినాము

నేలపైఁ గూర్చుండనేల నందకుమార
యంచు మాతొడలపై నుంచినాము
దైత్యమర్దనుని లతాంత డోలికలపై
నుంచి బల్వేడ్కతో నూఁచినాము
రాత్రులందొకటి వ్యర్థంబుగాకుండ ని
మ్ములఁ జక్రధరుఁ జేరి కొలిచినాము
గాని కారుణ్యమిపుడు మాపైనమాని
యెట్టులుండెనొ శ్రీకృష్ణుఁ డితరదేశ
మందు రాజాంగనలఁగూడి యకట ధర్మ
మానె యోజింపు ముద్ధవా మానసమున. 45

సీ. సాంకేతికస్థల సామీప్యమునఁ జేరు
నంతలో మాకెదురగుచువచ్చి
మీమీగృహంబులు మీవారలందఱు
సేమమాయనుచు వచించిమెచ్చి
మృగభయంబులు లేవు మీకీవనమునందు
నేనుండఁగానని నెనరుదెల్పి
వలచినట్టులఁ జేయవచ్చునంచును స్వకీ
యామల దివ్యదేహంబొసంగి
మమ్ముఁబ్రోచిన దానవమర్దనుండు
నేటికేటు విస్మృతింగాంచె నేటికింత
కర్కశస్వాంతుఁ డయ్యెనో కారణంబుఁ
దెలుపవే యుద్ధవా నీకుఁ దెలిసెనేని. 46

సీ. నవనీతమునకన్న నాఁడెమై కరఁగెడు
మార్దవగుణమెట్లు మాటినాడు
పరిపంధి కేలొగ్గఁ గరుణించు శరణాగ
త్రాణగుణమెట్లు దాఁచినాడు
నమ్మినవారి నెన్నటికైన మరువని
యుపకారగుణమెందు నుంచినాడు
తనదైన తన్నైన దాసులకిచ్చెడు
దానగుణంబెట్లు మానినాడు
వేణుధరుఁడు స్వకీయ కల్యాణగుణము
లన్ని తాకట్టువెట్టెనో యన్యజనుల
కట్లుగాకున్న మమ్మేల యాదరింప
కుండును వచింపు ముద్ధవా యున్నరీతి. 47

సీ. మురవైరిసౌశీల్యమునుఁ జూపకున్నచో
నతనితో మేము మాట్లాడఁగలమె
దనుజారి సౌలభ్యమునుఁ బూనకున్నచో
మించి యాతనితో రమింపఁగలమె
దరపాణి వత్సలత్వము దాల్పకున్నచో
నమ్మహా మహుని డాయంగ గలమె
కమలలోచను ననుకంప లేకున్నచో
సొదిది నప్పురుషునిఁ జూడఁగలమె
మరుని తండ్రి చనవు మాకీయకున్నచో
నమ్మహానుభావు నంటఁ గలమె

యిన్నిగతులమమ్ము మన్నించి తుదకిట్లు
సలుప నేమిసేయఁగలము తండ్రి ! 48

సీ. పలుమఱి తాల్పరి పలుకులబ్బిన నాడ
శేషరత్నంబులార్జించినట్లు
నలినాక్షు నుపగూహనంబుఁ జెందిన వేళ
సేవధినవకంబుఁ జెందినట్లు
నగధారి వరచుంబనములుగాంచిన సావి
నణిమాది సిద్ధులనందినట్లు
కనకాంబరుఁడు నిధువన మొనర్చినతఱి
ఘనస్వర్గ సుఖము గైకొనిన యట్లు
సంతసించిన గోపికాశయము లిప్డు
డుడుకుచున్నవి కాలంబు గడవ వశమె
దైవ మతిబలశాలిగదా తలంప
నతని కెవ్వార లడ్డు బుధాగ్రగణ్య. 49

సీ. చిననాడు ముండమోసినకన్య లన్యప
తినిఁబొందరాని శాసనముగల్గె
నాశాసనము భంగి నాచరించెదమన్నఁ
గామ మోహంబులగ్గలములయ్యెఁ
గామశాంతికి గూఢ కార్యంబొనర్పంగఁ
బాపిష్టిగర్భంబు బయలుసేసె
నాభ్రూణమును మాయునట్లొనర్చెదమన్న
సతిప్రాణములకు మోసంబువచ్చు

నిన్ని దండములకు నిక్కమై మనఁడంచు
స్త్రీలనేల భువిసృజించెఁ గనక
గర్భుఁడతని నెన్ని కాలము వల్కిన
గాని యఘము లేదుగదని తోఁచు. 50

ఆ. అస్వతంత్రల బలమై మగవారి దా
సీజనంబులై కృశింపుడనుచు
మమ్ము సృష్టిఁ జేసె మాయావి యా బ్రహ్మ
దేవుఁడతని తప్పుఁ దెలుప వశమె. 51

సీ. నిన్నుఁ బాసినఁ దాది నిమిష కాలము బ్రహ్మ
కల్పసమంబుగాఁ గడపిరనుచుఁ
దాము స్త్రీలగుట నీదర్శనంబొనరింపఁ
గోరియు నిటకు రా నేరరనుచు
దుర్మరణము ముందు దుఃఖమూలంబౌట
వెఱచి యిప్పటికి జీవించిరనుచుఁ
దనువు లచ్చటనున్న మనములజస్రంబు
నీయందుఁ దప్పక నిలిపిరనుచు
మాయుదంతము నందకుమారుతోడ
నొక్క చెప్పుమతండు నీ ప్రక్కఁ జేరి
యొక్కఁడేయున్న తఱిఁ జెవి కెక్కునట్లు
లచ్యుతాశ్రితవర్య మహాద్రిధైర్య. 52

సీ. సర్వసంగములు విసర్జించి శరణన్న
రామామణులఁ బాయరాదటంచు

ఇహపరసౌఖ్యంబు లెనయక మందలోఁ
జేడెలు మిగుల నల్లాడిరనుచు
సామర్థ్యముండి యా సతుల మొఱాలి కిం
పక యూరకుండుట పాపమనుచు
జీవచ్ఛవంబులై వావిగనేడ్చు లే
మలమీఁద జాలెట్లు కలుగదనుచు
దీనులగువారి కాఠిన్యమూని దుఃఖ
పరుపఁజూచుట లదియేమి ఫలమటంచు
నడుగుమా కృష్ణుసాన్నిధ్యమందుఁజేరి
మేముసెప్పిన చందాన నోమహాత్మ. 53

సీ. కాఁపురంబులుదీసి కనకాంగులనురోసి
పరదేశమేగుట పౌరుషంబె
సుందరాంగులనెల్ల నిందలొందఁగఁజేసి
యపసరిల్లుట సమాఖ్యాతిశయమె
దిక్కులేక కృశించు చక్కఁరబోండ్ల గో
డాలింపకుంట గుణాతిశయమె
శోకాగ్నిచేఁగూలు సుదతీమణుల హత్యఁ
జెందఁజూచుట మహానందకరమె
నీకనుచు వాసుదేవు ననేకగతుల
నడిగి తరిఁకింపుమయ్య మహాత్ములైన
వారికిఁ బరోపకారమేవగలనైన
భూషణముగాదె యోజింపబుధవరేణ్య. 54

ఉ. ఏమొక తెంపుసేయుదు మిఁ కెన్నటికిన్ మధుసూదనుండు
మా । సేమముఁగోరి సన్నిధికిఁ జేరిచి ప్రోవకమానెనేని
యా । పై మురవైరినామములు ప్రస్తుతిసేయుచు నక్క
ళిందజా । నామతరంగిణింబడి వినాశముఁజెందుట నిక్క
మౌఁజుమీ. 55

మ. నలికాపీనముకంఠులేమి మృతికన్నన్ సాధ్వసంబెప్పుడుం
గలుగన్నేరదు దేహధారికి నిశాకాంతార్కులుం దార
కల్ । గలకాలం బిల నుండఁగాఁదరమె యగ్గాంగేయ
చేలుండు మ । మ్ముల్ఁ బాలింపకయున్నఁ జావుఁగనుటే
ముఖ్యంబు ధీరాగ్రణీ. 56

మ. బ్రతుకంగోరుట సౌఖ్యలబ్ధికెగదా భావింపఁగా దేహి సం
తతి శర్మంబిసుమంతలేనియెడఁ జింతాస్వాంతులైయుందు ర
గ్గతి మాకిప్పుడు సంభవించెఁ దనువు ల్యాంఝింపగా నేల
శ్రీ । పతి ధ్యానింపుచుఁ బ్రాణముల్ విడుతు మాపై నేమి
గానున్నదో. 57

ఉ. రాలఁగరంపవచ్చు మృగరాజు నధీనముసేయవచ్చు నా
భీలఫణిం గరండమునఁబెట్టి విషంబడఁగింపవచ్చు మా।పా
లిటి వేలుపైన మధుభంజనుమానస మెంతగట్టిదో।చాలి
ద్రవింపఁజేయుటకు సాధ్యముగాదుగదయ్య యుద్ధవా. 58

ఉ. అందనిమ్రానిపండులకు నఱ్ఱులుసాచిన సార్థకంబులే । దం
దురు వాసుదేవుపయి నాసను మానుమటంచు నన్ని మో

చందములన్ వచించి వినఁజాలక మామనమెల్ల వేళ
విందునియందునిల్పి పలవించును గాని చరింప దెందునన్.

తే. మేము బ్రతికినఁ జచ్చినఁ గోమలాంగు
డైన శ్రీకృష్ణదేవు దివ్యాంఘ్రియుగమె
యేడుగడయనినమ్మి తదితరములను
మఱచియున్నారమనుచు వేమఱు వచింపు. 60

ఉద్ధవుండు గోపికల నూరార్చుట

క. అనివచియించిన గోపీ
జనవాక్యము లాలకించి సాధువరేణ్యుం
డనఘుం డుద్ధవుఁడీగతి
ననియెన్ మాధుర్యపూరితాలాపములన్. 61

ఉ. ఎన్నియొనాళ్ళనుండి జగదీశుఁడు కృష్ణుఁడు మిమ్ముఁ బాసితా
మన్నన్ జూడకున్న ధృతిమాలక యన్యమునందుఁ బోకయా
వన్నిశలుంబవళ్లు మురవైరి భజింపుచు మీమనంబు లి
ట్లున్నవి భక్తిచేనిలిచి యుగ్మలులార మహాద్భుతంబుగన్.

చ. కులటలు గారుమీరు యదుకుంజరుఁడున్ విటకాడుగాడు
మీ | రలఘుతరాశయుల్ విమలు రద్భుతభక్తినిధాను
లయ్యశోనిలయుఁడు పుండరీకదళ నేత్రుఁడు పాప విదూ
రుఁడాశ్రితా | వళులకధీనుఁడై మెలఁగు వాఁడు పరాత్పరుఁ
డెంచి చూడగన్. 63

మ. బలుజన్మంబులఁ జేయు పుణ్యములు సాఫల్యంబుఁ జెందం
గమీ । కలగోవిందునిపై జనించె విమలంబౌ భక్తి మీ
భక్తిని । శ్చలతాధిక్యముచేతఁ బట్టువడి నిచ్చల్పాయ
లేకుండ న । జ్జలజాతాక్షుఁడు మిమ్ముఁ బ్రోవఁదలఁచున్
సర్వప్రకారంబులన్. 64

సీ. వనజనాభునిఁ బొందవలెనను కామంబు
హరిమమ్ముఁ బాసెనేయనెడు క్రోధ
మిందిరాపతిఁ బాసియెటులుండు మనులోభ
మచ్యుతాంగములపై నధికమోహ
మరిపాణిమగఁడయ్యె ననుమదంబతఁడన్య
సతిఁ బొందుననెడు మాత్సర్యమెపుడు
గల్గి మీపడరి వర్గంబును శ్రీహరి
కర్పించితిరిగాని యాశతోడఁ
బామరులభంగి సంసారబంధనములఁ
జిక్కరైతిరి పాపంబు సేయరైతి
రేమిసెప్పుదు మీకిది యెన్నిభవము
లందుఁగల పుణ్యమో చకోరాక్షులార. 65

ఉ. తావులు మావులావులు లతాకుసుమంబులు దొడ్డగిడ్డులున్
బావులు చేలుతోఁటలును బంగరుసొమ్ములు బిడ్డ
లుంబతుల్ । భావలు మామలత్తలును బందుగు లందఱు
నిత్యమంచు మీ । భావములోఁ దలంచి హరిభక్తియొన
ర్చితిరేమి పుణ్యమో. 66

మ. సరవిన్ లోకమునందు ఘోరమగుసంసారంబునందుండు
దో। పరహస్యంబులెఱింగి సద్గురుని పజ్జం జేరియాజ్ఞానిచే
హరిపాదంబులునాశ్రయించి యపవర్గానందముం జెందు
టల్। ధరపై నైజము నిష్క్రియత్నముగ దద్ధర్మంబుమీ
కబ్బెంబో. 67

గో పి క లు

వ. జ్ఞాననిధానాశయా! నిన్నుం గాంచుటచేతను నీ వాగమృతం
బు జుఱ్ఱుటచేతను చిరకాలంబు మాప్రాణేశ్వరుండగు శ్రీ
కృష్ణునెడబాసిన యాయాసంబు కొంచెముకొంచెముగా
దొలంగుచున్నది. కాని యొక్క సందేహంబుగలదు యెట్లం
టివేని వీరుజారిణులనియుఁ బతిపుత్రాదుల విడిచిన పతిత
లనియు మమ్ము లోకులు దూషింతురు. తత్పరుషవాక్యం
బులాలకించునపుడెల్ల మాస్వాంతంబులు చింతాక్రాంతంబు
లగుచున్నవి. ఇదినిశ్చయమేనా. 68

ఉ ద్ధ వుఁ డు

వ. తల్లులారా! మీసమాచారంబటులుంచి మొదట నావృ
త్తాంతం బెఱింగింతు నాలకింపుడు నానామధేయం బిది
వఱకే మీకుందెలిపితి నేను దేవతాగురుండగు బృహ
స్పతి శిష్యుండ నమ్మహాత్ముని యొద్ద సమస్తశాస్త్రంబులు

వల్లించి శరీరికిఁ గర్తవ్యం బెద్దియని యడుగ నక్కోకిలవిదుండు నన్నుంగాంచి బిడ్డా! పురుషార్థంబులన్నింటిలో శాశ్వతం బగుటం జేసి మోక్షంబు ప్రధానం బయ్యపవర్గంబు భగవదనుగ్రహంబుచే సిద్ధించు నా భగవంతుం డాదినారాయణుం డతండిప్పుడు భూభారహరణార్థము శాంబరీ గోపాలుండై యవతరించె నమ్మహాపురుషుని సేవింపుము నీ జన్మంబు సార్థకంబగునని వచింప నాలకించి యిమ్మర్త్య లోకంబునకువచ్చి వివాహంబుమాని సంసారంబు వర్జించి సర్వసంగ పరిత్యాగపూర్వకంబుగా శ్రీకృష్ణు నాశ్రయించిభజింపుచుంటిని మీరును నావలె లౌకికంబు వర్జించి గోవిందు నాశ్రయించితిరి కృష్ణశాసనంబుచే మిమ్ముల నూరార్పవచ్చితి మీప్రభావంబు మీకుఁదెలియక యల్లాడుచున్నవారు మీరు పతిపుత్రాదుల విడుచుట దోషంబుగాదు మీరు పతితలునుగారు విడువక పతిశుశ్రూషఁ గావించిన సతులకు స్వర్గాదిలోకంబులు లభించునవి పుణ్యక్షీణం బైనతోడనే జీవులం బడఁద్రోయు నందువలన నవి సామాన్యధర్మంబు లనంబడు. భగవంతు నాశ్రయించుట విశేషధర్మంబు విశేషధర్మంబుచే మోక్షంబు సిద్ధించుఁ గావున మీరు సామాన్యధర్మంబు విసర్జించి విశేషధర్మం బవలంబించితిరి విశేష ధర్మంబు నాశ్రయింపలేనివారు

సామాన్యధర్మంబు విడిచినచో మోసంబగుంగాని మీకు లోపంబులేదు భస్మంబునొసంగి కస్తూరి నార్జించినవారికిని బత్తెనమ్మి గజంబునుఁగొన్న వారికిని లాభమేకాని నష్టంబు లేదుగదా. 69

గో పి క లు

వ. మోక్షంబనఁగా నర్థమేమో మాకుఁ దెలియలేదు స్పష్టంబుగాఁ దెలుపుడు. 70

ఉ ద్ద వుఁ డు

వ. దేహికిరువదియాఱు తత్వంబులు గల వవియేవి యనఁగా బృథివ్యాప స్తేజోవాయురాకాశంబులను భూతంబులైదు త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియంబులైదు వాక్పాణి పాదపాయూపస్థలను కర్మేంద్రియంబులైదు శబ్దస్పర్శ రూపరసగంధంబులను విషయంబులైదు మనోబుద్ధి మహదహంకారంబులు నాలుగు యీప్రాకృత తత్వంబులు యిరువది నాలుగు యిరువదియైదవవాఁడు జీవుఁడు యిరువదాఱవవాఁడు పరమాత్మ జీవుఁడిరువదియాఱు తత్వంబులలో• నీదేహంబు నందున్నవాఁడిందులోని ప్రాకృత తత్వంబు లిరువది నాలుగు వదలుటయే జీవునకు మోక్షంబనియు ముక్తియనియుఁ బెద్దలు వక్కాణింతురు. 71

గోపికలు

వ. అట్టి మోక్షంబు జీవునకెట్లు సిద్ధించును. 72

ఉద్ధవుడు

వ. ఎవ్వని నిగ్రహంబుచే జీవునకీసంసారబంధంబు ప్రాప్తించెనో అట్టి భగవంతుని యనుగ్రహంబుచే నిది వదలునే గాని యుపాయాంతరంబులచే విడుచునది కాదు దొరతనమువారొ కానొక మనుష్యునకు విధించిన శిక్షను వారే కదా విడుదల చేయవలసినవా రిదియెల్లరకుఁ దెలిసిన విషయమే కదా. 73

గోపికలు

వ. సంసారంబనఁగా నర్థమేమి దానిస్వరూపంబెట్టిది 74

ఉద్ధవుఁడు

వ. సంసారంబు సుఖలేశంబు లేనిదైనను విపరీత జ్ఞానులైన పామరులకు సుఖరూపంబుగాఁదోఁచు నర్థపంచక జ్ఞానంబుగలవారలకది యున్నదియున్నట్లు గోచరించుటచే దుఃఖరూపంబై తోఁచునట్టి జ్ఞానుల నేకుల నేకవిధంబుల వర్ణించి ముముక్షువులకుఁ బరమోపకారంబొనర్చిరి, వానిలోఁ గొన్నిపద్ధతులు వివరింతునాలకింపుడు, వైరాగ్యమునకు

మించిన లాభంబును సుబోధకుమించిన సుఖంబును గురు
నకుమించిన రక్షకుండును సంసారమునకు మించిన శత్రు
వునులేడని కొందఱు వచించిరి. 75

వ. మఱియు వివిధరోగంబులను పెద్దపులులును, శబ్దాది విష
యంబులను పొదలును నానావిధతృష్ణలను వృక్షంబులును
భార్యానందనారామాలయ క్షేత్రంబులను నెండమావు
లునుఁ గృత్యాకృత్యంబు లెఱుంగనీయని యవివేకంబను
చీఁకటియుఁగలిగి సంసార మరుకాంతారంబు విరాజిల్లు
చున్నదని కొందఱు సూరులుసెప్పిరి. 76

వ. వెండియు నొక మహారణ్యంబుగలదు దాని కాద్యంతం
బులులేవు దాని లోపలికిఁ బోవుటకు మార్గము తెలియునే
గాని వెలుపలికేగుటకు వీలులేకుండు నది సంసారారణ్యం
బని యెఱుంగుడయ్యరణ్యంబున దేహధారి ప్రవేశించి
బోవుచుండ మార్గంబునందు రోగంబులను వాగురలు
మాటిమాటికిఁ గాళ్ళందవులుచుండె దుష్టస్నేహితులను
మృగంబులు నాభాసబాంధవులను చోరులు వానింబొదివి
వేధించిరి వార్ధక్యంబను భూతంబుఁగాఁగిలించి యెంత
విదిర్చినంబోక శరీరంబునం దైక్యంబయ్యెఁ గర్మేంద్రియ
జ్ఞానేంద్రియంబులను గంధసింధురంబులు కల్వరపెట్టుచుం
డెనిట్టి దుర్దశతోనామనుజుండేగుచుండి దేహాత్మభ్రమయను

నూతియందుఁ దలక్రిందుగాఁబడి జీవితాశయను తీవకుఁ గాళ్లుదవిలించి వ్రేలాడుచుండెడి నా నూతిలో యముండను కాలసర్పంబు నాలుకలు గోయుచుండెనా నూఁతియొడ్డున నాయువను వృక్షంబుండెడి ఋతువులను నాఱుతలలును మాసంబులను పండ్రెండు కాళ్ళును గలిగి సంవత్సరంబను గజంబుండెరాత్రిం బవళ్ళను నల్లని తెల్లని యెలుకలెల్లపుడు నాయుర్వృక్షంబునకుఁగల వ్రేళ్లు సఱకుచుండెనా వృక్షంబునందుఁ గామంబులను తేటులును కామరసంబులను తేనెచుక్కలును గలిగియుండెనా మరంద బిందువు లెన్ని త్రాగిన నామనుజునకుఁ దృప్తిగాకుండె నింతలో నాయుర్భూజంబు పడిపోగా జేతనుండు యమవశ్యుండై బాధ లనుభవించె దీనినిఁ బండితులు వైరాగ్యంబను కార్చిచ్చుచే దహించి సుఖపడుదు రీప్రకరణంబు మహాభారతంబునందుఁ గలదు. 77

వ. ఆశయను సలిలంబును మన్మథుఁడను గాలిచే నెగురగొట్టబడిన మోహంబులను తరంగంబులును భార్యయను సుడియుఁ బుత్ర సహోదరులను మొసళ్లును చుట్టాలను మత్స్యంబులును జీవితాశయను డిండీరంబును స్నేహితులను వరాటకంబులును కామక్రోధంబులను తిమి తిమింగలంబులును గలిగి సంసారంబను సముద్రంబు తనరారుచున్నదని కొందఱు జ్ఞాననిధులు వచించిరి. 78

వ. ఈదుఃఖసాగరమైన సంసారంబునందుఁ బాంచ భౌతికదే హంబను రాజధానిగలదు దానికింద్రియంబులను నవద్వా రంబులుగలవు. అంతములేని దుఃఖసమూహమను వృక్షము చే నేర్పరుపఁబడిన యవిద్యయను రథంబుగలదు ఆరథం బునకు రాగద్వేషాదులను గుఱ్ఱంబులుగలవు గుణత్రయ మను మంచంబుగలదు కర్మమను సింహాసనముదాని మీ దరుచియను చిత్రాసనముగలదు. అనిత్య వస్తువులను దాసవర్గము వివిధ వ్యాధులను భార్యలుగలరు పరహింస పరనిందా పరద్రవ్యాపహారణము పరానువర్తనము పరాన్న భక్షణములను భోగంబులుగలవు యిట్టిరాజధానిలో దేహమే జీవుఁడను భ్రమగల యాత్మకుఁ బంచప్రాణము లను పురోహితులు పట్టాభిషేకము సేసిరి పట్టాభిషిక్తుఁడైన జీవమహారాజుగారిని ఖ్యాతిలాభ పూజలను భట్రాజులు కొనియాడుచుండిరి. అభిమానములను దాసీలు పుణ్యపాప ములను వింజామరంబులు వేయుచుండిరి కామ క్రోధలోభ మోహ మదమాత్సర్య దంభాహంకారేర్ష్యాసూయాదు లను సామంతరాజులు కొలుచుచుండిరి అకృత్యకరణ కృ త్యాకరణ భగవదపచార భాగవతాపచార సహ్యాపచా రంబులను వారులుపరివేష్టించి యుండిరి. యింద్రియంబులను మదద్విరదంబులను గట్టి శరీరమను రథమునందుంచి కాల

మను సారథి జీవ(?)గుహారాజు గారిని దేహాభిమానివచ్చు
చున్నాడు అన్యశేషభూతుఁడు వచ్చుచున్నాడు భగద్విస్మృ
తిగలవాఁడు వచ్చుచున్నాడని చోపుదారి కేకలు వైచు
చుఁ దిప్పుచున్నాడు జ్ఞానులీ నికృష్టరాజ్యమును దిరస్క
రించి మోక్షసామ్రాజ్యమునుఁ జూఱఁగొనుచున్నారు.
అజ్ఞానులీ రాజ్యాధికారము లభింపవలయునని శ్రమపడు
చున్నారని కొందఱార్యులు వచించిరి. 79

గోపికలు

వ. భాగవతాగ్రణీ! జీవునకీసంసారము నీశ్వరుఁడేలవిధించెను 80

ఉద్ధవుడు

తొల్లి జీవులందఱునుఁ బ్రళయకాలంబున నిరవయవులై
మిణుగురు బూచులవలెనే పురుషార్థము సాధింపలేని
వారైయుండఁగా గారుణ్యనిధియగు భగవంతుఁడు 81

సీ. తనదివ్యవిగ్రహంబునుఁ జూడఁ గన్నులు
తనువలగొనఁగఁ బాదద్వయంబు
తనకథలాలింప ఘనశ్రోత్రములు తన్ను
నిరతమర్చింపఁ బాణిద్వయంబు
తనపేరులు నుతించు కొనరసజ్ఞ తదీయ
తులసినాఘ్రాణింప దొడ్డనాస
జీవులకొనఁగూర్చి క్షితియందుఁ బుట్టింప
వారలమ్మార్గంబు వదలిపెట్టి

కలుపుడీయుటకిచ్చిన కట్టుతోడఁ
గనులు పోఁగొట్టుకొన్నట్లు గాఢపాత
కంబులొనరింప జీవికిఁ గల్గెనిట్టి
ఘోరసంసారమేమందు నారులార. 82

గోపికలు

వ. ఇట్టి సంసార బంధంబు లూడ్చుకొనఁ గోరినజీవున కుపాయం బెద్ది. 83

ఉద్ధవుఁడు

వ. ప్రథమంబున జ్ఞానానుష్ఠానంబులుగల సదాచార్యు నాశ్రయించి తదీయానుగ్రహంబుచే సర్వశక్తుండును సర్వేశ్వరుండును సర్వాంతర్యామియు సర్వనియంతయు నైన శ్రియఃపతి నాశ్రయించి తత్కారుణ్యంబుఁ బడయవలయు నప్పుడతండీ సంసారబంధంబునుఁ దొలఁగించి శాశ్వతానందం బిచ్చును. 84

వ. భగవంతుని స్వయముగా నాశ్రయింపవలదా సదాచార్యుండేల. 85

ఉద్ధవుఁడు

వ. స్వయముగా భగవంతు నాశ్రయించుటకువీలు లేదెందుకనఁగా నతండెట్టివాఁడో యెంతవాఁడో యెట్లాశ్రయింపవలెనో యెందుకాశ్రయింప వలెనో యాశ్రయింపకుండిన లోప

మేమో తెలియదు స్వస్వరూప పరస్వరూప విరోధిస్వ
రూప ఉపాయస్వరూప పురుషార్థ స్వరూపంబులను అర్థ
పంచకజ్ఞానంబును చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడను, తత్వత్ర
యంబును ముముక్షువైనవాఁడు ముందుగాఁ దెలియ
వలయు నింతేకాక వేదాంత శాస్త్రంబపారంబుగాఁ గలదు
దాని నంతయుఁ దెలియవలయునన్న గురుండు లేక సాధ్యం
బుగాదు. 86

సీ. నియతి విగ్రహములు నిర్మింపవలెనన్న
శిల్పకారులచెంతఁ జేరవలయు
సొంపుగా నది విస్తరింపంగ వలెనన్న
గర్ణధారుని కృపఁగాంచవలయు
నద్భుతపాండిత్య మార్జింపవలెనన్న
లలినుపాధ్యాయుఁ గొల్వంగవలయు
సాములో మర్మంబు సాధింపవలెనన్న
నెలమి మల్లురనాశ్రయింపవలయు
గానవిద్యఁబొందఁగావలెనన్నచో
గాణఁగొల్వవలయుఁగాన దేశి
కాశ్రయంబులేక హరిఁగన నెంతటి
వారి కలవిగాదు వామలార. 87

గోపికలు

ఉ. మంచిదియట్టులైన గరిమన్ నినుమించిన దేశికుండు లే
డెంచఁగ సర్వసంగముల నెప్పుడొ త్రెంచి మురారి పాదప

ద్మాంచిత భక్తిచే మెలఁగినట్టి మహాత్ముఁడ వౌటఁ జేసి బో
ధించఁగదయ్య మేము కడతేరెడు మార్గ మనూనప్రేమతోన్

శా. శ్రీకృష్ణాంఘ్రియుగంబుఁ గొల్చి మనుటల్ శ్రేయస్సౌ సం
సారచే । ష్టాకాంక్షం బతిపుత్రికాతనయ వస్త్రక్షేత్ర స
ద్బాంధవా । నీకంబుం గొనియాడుటే సుకృతమో నీకేది
వేదాంతసా । రాకారంబని తోఁచునో తెలుపుమయ్యా
దాని నింపారఁగన్. 89

ఉద్ధవుఁడు

చ. పలుకఁగనేల దానములు భవ్యతపంబులు తీర్థయానముల్
సలిపినవారికంటె విలసన్మఖకర్తలకంటె యోగులై । వెల
సినవారికంటెఁ బృథివీస్థలి మీరు మహానుభావులై । పొలి
చితిరమ్మలార యదుపుంగవుఁ గొల్చిన కారణంబునన్. 90

ఉ. ఏపనిఁ జేసినన్ ఫలము నీవలె దేహికి నీశ్వరుండు వాఁ । డే
పనిఁ బూని దేవకికి డింభకుఁడై జనియించె నన్యమా । వ్యా
పృతు లీసడించి మనసార భజించితి రమ్మహాత్ము నా । హా
పొగడొందె మీ భవము లంగనలార కృశింపనేటికిన్. 91

సీ. చిత్రగుప్తుఁడు లిఖించిన మీ వృజినపంక్తు
లందలి లిపులు శూన్యంబులయ్యెఁ
దఱిఁ జూచి మీకుఁ దత్తఱపాటు గలిగింపఁ
దలఁచెడు మృత్యువాంఛలు నశించెఁ
బలుమాఱు మీజీవములఁ దోలుబొమ్మలు

గాఁజేయు బ్రహ్మైకకార్యముడిగ
బలుజన్మములలో వేతలు గల్గఁజేయు మీ
పాతకంబులు పటాపంచలయ్యె

సాదిరి పరుసవేది సోఁకిన నినుము బం
గారమైనపోల్కి మీరుపద్మ
నాభునాశ్రయించి శోభిల్లినందున
దిగులువాసె గొల్ల తెఱవలార 92

సీ. తొడిమనుండియు జారిపడిన మామిడిఫలం
బతుకునే యావృంతమందు మరల
పెరుగునుండి మథించి యరసి తీసిన వెన్న
కలియునే తలఁప దక్రంబునందు
శిఖిశిఖాదగ్ధమై చెడినట్టి శుల్బంబు
బంధించునే జంతువారములను
పరుసంబు సోఁకి బంగరువైన లోహంబు
కాలాయసంబు కాఁగలదె పిదప

నట్లె భవబంధమోచనుఁడైన వాసు
దేవు సంబంధమున నత్యుదీర్ణులైన
మీకుఁ సంసార మిఁకలేదనేకజన్మ
కర్మములు లేవు యోజింపఁగాంతలార 93

సీ. ఆజన్మవైష్ణవుండై భక్తివిగ్రహం
బనిపించుకొన్న ప్రహ్లాదునాడు

దేవహూనుల కుపదేశించి సత్కీర్తిఁ
గనినట్టి కలహభోజనుని నాఁడు
హర్యవతార రహస్యంబనేక లో
కములలో నించు వ్యాసముని నాఁడు
రామాయణ గ్రంథరాజంబు నిర్మించి
భువిఁ గొసంగిన నాకుభవుని నాఁడు

ఘనవిచక్షణుఁడైన యా హనుమనాఁడు
రాగమెఱుఁగని శ్రీ శుకయోగి నాఁడు
బ్రబలి చిందులుద్రొక్కిన భక్తికాంత
డస్సియుండియు మీచే వయస్సుఁగాంచె. 94

ఆ. మీరు కాంతలాట లారసియాభక్తి
కాంతచెలిమిసేసి కదలమండ
మిమ్ముఁగొలుచుచుండె మేదినిలోనఁగు
లాభిమాన మిట్టిదగునుగాదె. 95

సీ. తనకంటెఁ జిన్నలౌ జనులందుఁగల మనో
వ్యాపారమిల దయయనఁగఁబరఁగు
భార్యాసుతాదులపై స్వాంతముండుచో
నది మోహమనెడు విఖ్యాతిఁగాంచు
మితిలేని వస్తుసంతతులపైఁగల వాంఛ
కలరు నాహ్వయము దురాశయనఁగ
నంగనాపురుషుల కన్యోన్యముగఁ బుట్టు
నట్టి కోరికి కామమనఁగవెలయు

నిందిరాధీశుపై నేగు నెవని చిత్త
వృత్తి యది భక్తియనుపేర విస్తరిల్లు
నట్టి సద్భక్తి మీయందు నతిశయించెఁ
గాన మోక్షంబు సుళువయ్యె గరితలార. 96

తే. రమణులార! భవచ్ఛరీరములు విమల
భక్తికాంతామయంబులై ప్రజ్వరిల్లి
నందునం గాక యీ నందనందనుండు
పొందు నేమిమ్ముఁ బ్రాకృతపురుషునట్లు. 97

మ. బలుజన్మంబులఁ జేసినట్టి సుకృత ప్రాగ్భారధూతాఘులై
యిల జన్మించినవారి పైకరికి హాయిన్నిల్పు సద్భక్తి నా
మలతాంగీమణి యీమె నిల్పు హృదిసీమన్నిల్చి శ్రీకృష్ణుఁ
డి । మ్ముల నద్దేహ కనిష్టముల్తోలఁచి సన్మోక్షంబొసంగుం
జుమీ. 98

క. దేనికిలోఁగక భక్తిక
ధీనుండై మెలఁగుచుండు దితిజారి తదీ
యానూన మర్మమెఱిఁగిన
మానులు కొలిచెదరు భక్తి మానిని నెపుడున్. 99

సీ. భావించి బలియింట దౌవారికుండయ్యెఁ
బ్రహ్లాదుకొఱకుఁ గంబమునఁబుట్టె
దంతికై సేవాయుతముగఁ గొలఁకుఁ జేరె
బాలునకై నూత్నపదమొనర్చె

బోయవిచ్చిన ఫలంబులు మెక్కెఁ బక్షికి
మోక్షసామ్రాజ్య మిమ్ములనొసంగెఁ
గపులకు రాజ్యభోగములిచ్చె నుడుతకు
నెనలేని సౌఖ్యంబునిచ్చి పొగడె
నిట్టిపనులెన్నియైన సర్వేశ్వరుండు
సేసెఁ జేయుచున్నాఁడు సేయఁగలఁడు
భక్తికాంత కధీనుఁడై భామలార
మీకు లొంగుటయును దానికై కదమ్మ. 100

సీ. కులహీనులైనవారలకు గౌరవమిచ్చె
నిరుపేదలకు ద్రవ్యనికరమిచ్చె
నధికమూఢులకు విద్యాప్రభావంబిచ్చె
రూపహీనులకు సురూపమిచ్చె
బలహీనులకు సార్వభౌమపదములిచ్చె
నజ్ఞానులకు జ్ఞానమమరఁ జేసె
శోకార్తులకు భూరిసుఖమిచ్చెఁ గామార్థ
ధర్మములు గూర్మిఁ గొందఱికొసంగె
భక్తికాంతకులొంగి యప్పరమపురుషు
డెన్నియైనను దాసులకిచ్చుచుండు
గాని వేఱుపాయంబులఁ గానరాడు
పొదలఁ జేయుఁడు భక్తినిఁ బొలఁతులార. 101

వ. మఱియు నబ్భక్తివిలాసినికి జ్ఞానవైరాగ్యంబులు సేతులు శాస్త్రానుభవంబు నేత్రంబులు జితేంద్రియత్వంబు పాద

యుగళంబు సత్యశౌచంబులు స్తనంబులు భాగవతాభి
మానంబు చెలిమికత్తె గురుభక్తి శీర్షంబు భగవద్దాస్యంబు
శరీరంబు శాంతిశమదమాది గుణంబులు వివిధావయవం
బులు యిట్టి భక్తికాంతను జక్కఁగా బోషించినవారికి శ్రీ
మన్నారాయణుండు వశుండై యనిష్టంబులు తొలగించి
యిష్టంబులు సేకూర్చును. 102

గోపికలు

వ. యోగిజనాగ్రగణ్యా ! విష్ణుభక్తిసర్వోత్కృష్టంబంటివి సరే
గాని దానతపోనియమాదులు కావా. 103

ఉద్ధవుఁడు

వ. కానేరవెట్లందుఁ లేని సత్కార్యంబునకైనను దుష్కార్యం
బునకైనను ఫలమునిచ్చువాఁడు సర్వేశ్వరుండు దేహ
ధారి యనేక పుణ్యంబులొనర్చి యొక్క పాపంబార్జించె
నేని భగవంతుఁడు రెంటికిని ఫలంబులొసఁగు నక్కాలం
బునఁ బాపఫలంబు తీవ్రంబగుటచే దాని ననుభవించుతఱి
శరీరి తబ్బిబ్బుఁజెంది మఱియుఁ బాపంబు లధికంబుగాఁ
జేయు దీనికిఁ దార్కాణంబుగా దినమునకు లక్షల గోవుల
చొప్పున ననేకవేల సంవత్సరంబులు దానంబొనర్చిన
నృగమహారాజు ఊసరవెల్లియయ్యె శతాశ్వమేధంబు

లొనరించిన నహుషమహారాజు కొండచిలువయయ్యె గొప్ప తపస్సంపన్నుఁడగు యయాతి తలక్రిందుగా స్వర్గంబునుండి భూలోకంబునఁబడె మూఁడువేలవర్షంబులు ఘోరతపంబొనర్చిన శ్వేతుండు స్వకీయ దేహమాంసంబు భుజించె దుర్వాసోముని రాజమాత్రుండైన యంబరీషునకులొంగి పరాభవంబుఁగాంచె వేదాధ్యయనపరుండైన కౌశికుండను నామంబుగల బ్రాహ్మణుండు ధర్మవ్యాధుండను బోయవాని నాశ్రయించి ధర్మంబులెఱింగె. సత్యహరిశ్చంద్రుండు మాలవాని యింటదాస్యంబొనరించె నింకననేకులిదే ప్రకారంబున విపరీత ఫలంబులఁగాంచిరి. యిదియంతయు భగవద్భక్తిలేని దోషంబని యెఱుంగుము. భగవద్భక్తి విరోధులైనవారికిఁ బుణ్యంబులు పాప ఫలంబిచ్చును. పాపంబు లక్షయంబులగును. 104

గోపికలు

వ. స్వామీ! పాపంబులు సేయఁగూడదని శాస్త్రంబులువిధించినవి గాని మీవాక్యంబులవలనఁ బుణ్యంబులొనర్పఁ గూడదని తేలుచున్నది. చాలావిపర్యాసముగా నున్నదే. 105

ఉద్ధవుడు

వ. విదుషీమణులారా! మీరు గ్రహించుట పొరపాటు పుణ్యంబులొనర్పఁగూడదని నేను సెప్పలేదు. పుణ్యఫలంబులశా

శ్వతంబులనియు నల్ప ఫలదంబులనియు సమయోచితం
బుగా విపరీత ఫలంబులిచ్చు ననియుఁ జెప్పితిని భక్తినిశ్చ
యఫలదంబై నిరపాయంబై శాశ్వతానంద ప్రదంబైయుం
డును. పుణ్యంబైనను, భగవదర్పణ బుద్ధితోఁ జేసినచో
భక్త్యాకారంబు వహించును. భక్తిముదిరినచోఁ బ్రపత్తియ
ను నామంబుఁగాంచు. భక్తిరాజ్యంబునఁ బ్రవేశించినవా
రందఱు సూర్యునిభంగిఁ బ్రకాశింతురు. 106

గోపికలు

భాగవత శిఖామణీ! భక్తియోగంబు మంచిదని పలుమా
ఱు వచింపుచుంటివి అట్టిభాగవతుల ననేకులునిందింపు
చున్నారే యెందువల్ల వారికిఫలంబేమి? . 107

ఉద్ధవుఁడు

వ. భక్తులైనవారికిఁ బుణ్యంబునుఁ బాపంబును సమూల
ముగా నశించినంగాని మోక్షంబుఁజెందుటకు వీలులేదు
కావున భాగవతుల దూషించువారు వారిపాపంబును
భూషించువారు వారి పుణ్యంబునుఁ బంచుకొందురు
అప్పుడు భాగవతులు నిర్మలులై మోక్షంబుఁ జూఱఁ
గొందురింతేకాక భగవద్భక్తులను నిష్కారణంబుగా
నిందించువారిజన్మంబుననే బలుబాములనొందుదు రెట్లం

టిరేని మహాభాగవతులగు సనకసనందనులఁ దిరస్క రించి హరిమందిర ద్వారపాలకులగు జయ విజయులు మూడుజన్మంబుల రాక్షసయోనిం బుట్టిరి త్రిశంకుఁడు వసిష్ఠుని నిందించి వెంటనే చండాలుండయ్యె శ్వేతద్వీపవాసులగు స్త్రీజనంబులఁ దిరస్కరించి త్రిలోకకంటకుండగు రావణుండు నలిబిలియై ప్రాణంబులు దక్కించుకొని పాఱి పోయెఁ బ్రహ్లాదుని బాధించి హిరణ్యకశిపుండు నశించె నింతయేల శాండిలినియను శూద్రస్త్రీని సామాన్యము గాఁదిలకించి హరివాహనంబగు గరుడుండు స్వకీయపక్షంబులు పోగొట్టుకొని మరల నామెను నుతించి ఱెక్కలు మొలపించుకొనియె భాగవతులకు జాతినిరూపణంబుగాని వృత్తి నిరూపణంబుగాని కుల నిరూపణంబుగాని విద్యా నిరూపణంబుగాని యువయువ నిరూపణంబుగాని వాస నిరూపణంబుగాని చేసి నిందింపరాదు జీవునకు భాగవతాపచార దోషంబు మిక్కిలి బాధాకరమైనదిగా నెఱుంగుడు మిమ్ముల నెవ్వరైన జాణులని నిందించిరేని వారు దుర్గతిఁ దప్పక పొఁదుదురు నాభక్తులను శూద్ర సామాన్యులుగాఁ దలఁచి యవమానింపఁగూడదనియు నట్లవమానించువాఁడు రౌరవాది నరకంబులఁ బడుననియు విష్ణుభక్తిలేనివా రేకులంబునఁ బుట్టిననుఁ జండాలురనియు

నాభక్తులు గంగాతోయమువలెఁ బవిత్రులనియు మద్భక్త విరోధులను పద్మకోటి శతసంవత్సరంబుల కైన మన్నింప ననియు మఱియు వారల నాసురయోనిం బడఁజిమ్ముదు ననియు నష్టవిధభక్తులుగలవాఁడు మ్లేచ్ఛుండైనను వాఁడు నావలెఁ బూజ్యుఁడనియు భాగవతులు నా బహిఃప్రాణంబులనియు భగవంతుం డనేక ప్రదేశంబుల వచించెను భాగవతులను కులనిరూపణ మొనరించుట మాతృయోని పరీక్షవంటి పాపంబనియు శాస్త్రంబుగలదు. 108

గోపికలు

వ. భాగవతసార్వభౌమా! భక్తినిరపాయంబైనదంటివి మమ్ము లను భక్తులంటివి జనార్దనుండు మమ్ముల నిన్నిదినంబు లేల విడిచెను. 109

ఉద్ధవుఁడు

వ. జనయిత్రులారా! మీరడిగిన ప్రశ్నకు సమాధానంబు లేకపోలేదు వస్తు వెంతగొప్పదైనను సామీప్యంబున సులభంబుగానున్నచో లోకులు దానిని గౌరవింపరు.మల యాద్రియందుండు చెంచువారు మంచిగంధపుఁ గట్టెలను పొయిలోఁ బొట్టుచుందురు. అట్లే పరమయోగుల కంద రాని జనార్దన పరబ్రహ్మంబు మీసన్నిధి నుండఁగాఁ గోడి

రాలంబోలె రత్నంబులం జిమ్మునట్టు లమ్మహాపురుషుని
జారుండనియుఁ బ్రాణేశ్వరుండనియుఁ దలంచి చులకనగాఁ
జూచితి రందువలన మీ పారమార్థికంబునకు హాని గలిగె
మీకు మేలొనర్పఁగోరి యతఁడు దూరస్థుండయ్యె నక్కా
రణంబున శ్రీకృష్ణుండు యోగిజన దుర్లభుండని గ్రహించి
తిరిగదా. 110

గోపికలు

వ. మేము గ్రహింపకపోయినచో నాయనకు లోపమేమి
విరేచనాల మాత్ర తెలియక స్వీకరించినను పనిచేయు
నగ్నిహోత్రంబునందెఱుఁగక కాలువెట్టినను కాల్చు
నట్లే శ్రీకృష్ణుండు మమ్ముల రక్షింపరాదా. 111

ఉద్ధవుఁడు

వ. మీరు మంచి ప్రశ్నంబడిగితిరి కాని దానియందును లోసం
బుగలదు యెట్లంటిరేని విరేచనాల మాత్రయని తెలిసిన
వాఁడ జీర్ణకాలమం దుపయోగించును తెలియనివాఁడె
ప్పుడైనను వేసికొని తేనిరోగంబుఁ జెందును దీనికొక
చిన్నగాథ నెఱింగింతు నాలకింపు మొకానొక వైద్యుం
డొక రోగికిఁ దినుటకొక యౌషధంబును కనులలో వేసి
కొనుటకు నాభికలికంబు నొసంగె నామందులను దెచ్చు

వాఁడున్మత్తుండగుటచేఁ గనులలో వేయు నాభిని నోటిలోను నోటిలో వేయు మందును గనులలోను వేయగా నారోగి వెంటనే చచ్చె నొకానొకఁడు రత్నంబు దొరకగా దానినొక ధనవంతునికడ కెత్తుకొనిపోయి మూడురూపాయిలకు విక్రయించె నాధనవంతుం డమ్మణిని యేబదివేల రూప్యంబుల కమ్మెఁ గనుక వస్తుతత్వంబెఱుంగని వారిట్టి ప్రమాదంబుఁ జెందుదు రదియట్లుండ నగ్ని నెఱింగినవాఁడు వంటయందును దీపాదులయందు నుపయోగించుకొన నెఱుంగనివాఁడు ప్రమాదముఁ జెందును భగవత్తత్వంబు నారయనివాఁ డెంత భక్తి చేసినను పూర్ణ ఫలంబుఁ జెంద నేరడు. 112

వ. గురుపుంగవా! భగవద్భక్తునకు భక్తితోఁబాటుగా నర్థపంచక జ్ఞానంబుండవలయునని తెలుచున్న దదియట్లుండనిందు శ్రీకృష్ణుండిఁక మాకీజన్మంబునఁ గానరాడా. 113

ఉద్ధవుఁడు

వ. తల్లులారా! మీరిప్పుడడిగినంతటి పాపకార్యంబునకు శ్రీకృష్ణుం డొడిగట్టువాఁడుగా డమ్మహాపురుషుండు కృతజ్ఞుండు గావునఁ బ్రభాసతీర్థంబున గ్రహణస్నానంబునకు వత్తుననియు మిమ్ముల నచ్చటికి రండని చెప్పుమనియు నొక్కి వక్కాణించెను గ్రహణకాలంబు సమీపించి

వచ్చుచున్నది. మీరచ్చటికి విచ్చేయుడు. నేనిచ్చటికి వచ్చి మూడు మాసంబులు గడచె నింతకాలంబు మహాభాగవతులగు మీవాక్కులచే శ్రీకృష్ణ లీలామృతంబు జుఱ్ఱుచు విడువలేకయుంటిని. మీయార్తిఁ దిలకించియుఁ బాయఁజాలనైతి జనార్దనునిచే నేమి చీవాట్లబ్బునో యని భయంబుగలుగుచున్నది సెలవిండు పోయివచ్చెదను. 114

వ. పుణ్యరాశీ! భగవద్దాసులకు భక్తిహీనుల సాంగత్యసల్లాపములకన్న నగ్నిజ్వాలా పంజరము సౌఖ్యప్రదమనియు భాగవత సాంగత్యంబు నూతనాంబర పుష్ప తాంబూల చందన కర్పూర ధనధాన్య కనకరత్నాదులవలె నానంద ప్రదమనియుఁ బెద్దలు సెప్పుదురు. కావున నిన్ని దినంబులు నీసల్లాప ప్రాప్తిచే సుఖించితిమి. లంకలోనుండు సీతాదేవికి శ్రీరామక్షేమంబు మారుతివచించినట్లు నీవు మాకు శ్రీకృష్ణవృత్తాంతంబెఱింగించితివి యానందభరితులమైతిమి సంభోగసుఖమొక్కటి వినాగాఁ ప్రాణేశ్వరునిఁ జూచినట్లయ్యె. నీవరిగిన మీఁదట మాదుఃఖంబు రేఁగునింతవరకు నెలలు నిమిషంబులయ్యె నిఁక నిమిషంబులుసంవత్సరంబులు కాఁగలవు నీవు పురుషోత్తముని దాసి 115

సీ. మా మాఱుగానీవు వేమాఱుఁ గృష్ణుని
పాదాంబుజంబులు పట్టుకొనుము

కడుపులోఁదలవెట్టికౌగిలించి ముకుందుఁ
జేరిప్రసన్నునిఁ జేసికొనుము
మా దుఃఖముల నెల్ల నీదుదుఃఖములుగా
నెంచి మనంబునం దుంచుకొనుము
తరువాత మాకష్టభరమెల్ల గోవిందు
సన్నిధి వినిపించి సత్యమనుము
మాకుఁదోఁచిన పల్కు లేకాక నీకుఁ
దోఁచిన యుపాయములనుఁ దోడ్తోడఁ దెలిపి
వెలఁదులిఁక నిన్నుఁ గనక జీవింపరనుము
పంకజాక్షుని మముఁగూర్చ ఫక్కిఁగనుము. 116

ఉద్ధవుఁడు

వ. మీవాక్యంబు లన్నియు శిరసావహించితి. 117

ఉ. సుందరులార మీరు పరిశుద్ధచరిత్రలు సర్వవేళ గో
విందపరాయణాశయలు వేమఱుమీ పదపద్మధూళిచే
నిందుఁగలట్టి వృక్షముల హీనమృగంబులు పక్షులుర్లతా
బృందములొందు మోక్ష మొకపెట్టున సంశయమంద
నేటికిక. 118.

వ. అని సాష్టాంగ నమస్కారంబుఁ గావించిన నగ్గోపసుంద
రులు లజ్జించి యబ్భాగవతాగ్రణి పాదారవిందంబులకు
ముహుర్ముహుర్నమస్కారంబు లొనరించి కౌఁగిలించిన
నతండును వారలం గౌఁగిలించి యిట్లనియె, 119

ఉ. వంటలు సేయునట్టి ఘనవాములు బియ్యము దంచునట్టి
వా | రింటికివచ్చు బందుగుల కింపొనరించెడు వారు పిల్లలం
గంటిమటంచుఁ బొంగిపడు కామినులుందురుగాని భూమి
మీ | వంటి మురారి భక్తజన వారములుందురె యెంచి
చూడఁగన్. 120

చ. విరులు ధరించువారు బలువీఁకనగల్ సవరించువారశే
వరుని వరింప బాగాయనువారు కురుల్ లలిదువ్వువారు వి
స్తర వసనంబులందుకొని తాల్చు సతుల్గల రెందునైన
మీ | సరి హరిభక్తులుందురె రసాస్థలియందుఁ జరించి
చూచినన్. 121

గోపికలు

సీ. వ్యవసాయమిబ్భంగి సవరింపవలెనని
వివరించువారలు వేనవేలు
వాణిజ్యమున లాభవార్తలువింటె స్నే
హితుఁడాయనెడు వారనేకనరులు
శిల్పంబులోఁగల చెలువమీక్షించితి
వే యనువార లమేయజనులు
నాతోసమాన ధనంబెడఁగలదని
చాటించువారు లక్షలకొలంది
కలరు మానవులెందరోకాని నిన్నుఁ
బోలెఁ దత్త్వంబెఱింగి గోపాలదేవు

గాథలను సెప్పవారలొక్కరును జగతి
లోన లేరైరిగాదె మహానుభావ ! 122

వ. అని యివ్విధంబునఁ బరస్పరంబుగా భాగవత సల్లాప
సుఖం బనుభవించి గోపాలాంగనలవీడ్కొని యుద్ధవుండు
రథారూఢుండై చని మధురాపురంబున కరిగి శ్రీకృష్ణుని
సందర్శించి సాష్టాంగ నమస్కృతు లాచరించి నప్పురు
షోత్తముండు కౌఁగిలించి కూర్చుండ నియోగించి యుద్ధ
వునితో నిట్లనియె 123

క. ఎన్నాళ్లో కడచనె నీ
వన్నాఁ ప్రేపల్లెకరిగి యాభీరకులో
త్పన్నులగు నన్ను లేమను
చున్నారో తెల్పు మార్దవోక్తులననినన్. 124

తే. ఉద్ధవుం డిట్టులనె బూరుషోత్తమునకుఁ
గమలనయన భవద్వియోగమున వల్ల
వాంగనలుఁబొందు దుఃఖ మింతని వచింపఁ
దరమె బ్రహ్మకునైన యాదవ కులేంద్ర ! 125

సీ. నిన్నుఁజూచిననాడు దిన్న యాహారమే
యాహారమయ్యె గోపాంగనలకు
నీ వూరగల పగల్ నెరవు కైసేతలే
కైసేఁతలయ్యె నకామినులకు

నీతో రమించినరాతిరి సుఖమె సు
ఖావసానంబయ్యె నంగనలకు
నిను బొందువేళవఁ గనినట్టి నిద్రయే
నిద్దురయయ్యె నన్నెలంతగమికిఁ
గాంత లింతవరకు గాఢానురక్తి నీ
యందుఁజేర్చి యితరమరయలేక
తొల్లి పాటుతోడ దుఃఖింపుచున్నారు
చెప్పఁజాలవారి తిప్పలిచట. 126

సీ. నీవేణురవమంచు నెమ్మినాలింతు ర
స్వావనాంగులు పికారావములను
నీమేని వన్నెగాఁ గామించి చూతుర
మ్మీనసేత్రలు నీలమేఘములను
నీమార్దవోష్ఠంబులేమో యనుచుఁ జూతు
రాసతుల్ బింబఫలావళులను
నీమోముదమ్మిగా నెటి విచారింతుర
మ్మానినుల్ రాకాబ్జమండలమునుఁ
గానివస్తు యథార్థంబుఁ బూని తెలిసి
మీఁద దుఃఖించెదరు నీవుగాదటంచు
సర్వవిధమైన వస్తువిస్తారమెల్ల
నీవుగాఁ దలపోతు రన్నెలంతలెపుడు. 127

సీ. ప్రేమించి విరివిగాఁ గామసౌఖ్యములిచ్చు
ప్రాణనాథుల నెడఁబాసినారు

ముద్దుచూపించి ప్రేముడి స్వర్గగతులిచ్చు
సూతులపై రక్తిమూసినారు
నవయౌవనంబునం దవిరళమైపొల్చు
మహనీయ భోగముల్ మరచినారు
కలకాల ముచిత భోగస్థానసంజ్ఞచేఁ
బొదలు గీముల నెల్ల వదలినారు
గాత్రసంస్కారములు నేలగలిపినారు
విలువగలభూషణంబులు డులిచినారు
నీవు విడిచినకతన నవ్వావనాంగు
లధిక బాధలచేఁ దూలిరంబుజాక్ష. 128

సీ. బలుకూర్మి నమ్మి వెంబడివచ్చు పాంథుని
విపులాటవికిఁ జేర్చి విడుచునట్లు
సాధ్వసంబునవచ్చి శరణన్న భీరునిఁ
గడుపూన్కిఁ గత్తితోఁ బొడిచినట్లు
ధనముకై చేతులెత్తి నుతించుదీనునిఁ
గోలచే భువిఁ బడఁగొట్టినట్లు
విద్యార్థియై నెమ్మి వేడుకొనినవాని
నెట్టించి చీవాట్లు గొట్టినట్లు
నేడు ధిక్కరించినాఁడు శ్రీకృష్ణుండు
మమ్మునను చు గొల్లకొమ్మలాడు
బరుషవాక్యములకు బదులాడ శక్యంబు
గాకయూరకుంటిఁ గమలనాభ. 129

సీ. వేలుపూరుషులపై విశ్వాస మావంత
యైనఁ బొడమకుండ నడచినాఁడు
లాతిబంధములపైఁ బ్రీతి లేశంబైన
లేకుండఁ జేసి జల్లించినాఁడు
నిఖిలబాంధవ జనానీకంబుపై సదా
కలిగిన మోహంబుఁ దోలఁచినాఁడు
పరకృత్యములమీఁద బ్రసరింపకుండ మా
యవయవంబుల నెల్ల నాఁగినాఁడు

యిన్నివదలి మేము తన్నుఁ బ్రేమింపంగ
మూఁడునాళ్ళు భోగముగలిగించి
పాసినాఁడు కృష్ణపరమాత్మయని బిట్టు
వగచినారు గొల్లమగువలెల్ల. 130

ఆ. దేవ నీవునాకుఁ దెల్పినభంగిఁ బ్ర
భాస తీర్థమునకు భామలెల్ల
వచ్చునట్లు సెప్పివచ్చితి నీచిత్త
మందు నున్నయట్టు లవధరింపు. 131

వ. అనిన జనార్దనుం డాకర్ణించి దాసజన విశ్లేషకుఁ గొంత
సేపు దుఃఖించి యుద్ధవునింగని సాధుశేఖరా గోపాలాం
గనల భక్తి యద్వితీయంబై యొప్పుచున్నది నేను భక్త
పరాధీనుండనయ్యు నింతకాలంబు దర్శనం బీకుండుటవల్ల
నన్ను దూఱినను దోషంబు లేదైననుఁ బ్రభాసతీర్థం
బున వారి నూఱడించెదంగాక యని మధురలోఁ గొంత

కాలంబు జరపి సూర్యోపరాగంబునందు బంధుమిత్ర పరివార సహితంబుగా శ్రీకృష్ణుండు ప్రభాసతీర్థంబున కరిగె నచ్చోటికిఁ గుంతీ సహితులైన పాండవులును నందయశోదలును గోపీ గోపాలకులును గాంధారీ ధృతరాష్ట్ర విదుర భీష్మాదులును అంగవంగ కళింగాది సమస్తదేశాధిపతులును నారదమార్కండేయ విశ్వామిత్ర వ్యాస వసిష్ఠ పరాశరాది మహర్షులును వచ్చి తత్తీర్థరాజంబున స్నానంబొనర్చి దేవ పితృదేవతా తర్పణంబులు గావించి బ్రాహ్మణులకు గోభూహిరణ్యాది దానంబులొనరించి రటుపిమ్మట మునిబృందంబులు శ్రీకృష్ణదేవుని పరతత్వంబుఁ గూర్చి వక్కాణింపుచుండి రయ్యవసరంబున దేశాధిపతులైన రాజులు వసుదేవుని సమీపించి నమస్కరించి యిట్లనిరి. 132

క. కంటివి సుతునిగఁ గృష్ణుని
మంటివి చిరకాలమిలను మానివరులచే
వింటివి సద్గాథలు నీ
వంటి మహాత్ముండుగలఁడె వసుధాస్థలిలోన్. 133

ఉ. ఈధరపై శరీరులెల్లి నెన్ని భవంబులఁ గానలేని శ్రీ। నాథు ననంతు నచ్యుతు ననాథలపాలిటి వేల్పుమానినం।భోధర దేహు నీశ్వరునిఁ బుణ్యచరిత్రుని మమ్ముబోటి భూ। నాథుల కెల్లఁజూపి నయనంబుల కుత్సవ మాచరించితో. 134

సీ. వేదంబు లెవ్వాని విమలప్రభావంబు
వర్ణింపలేనివై వ్యసనమొందె
మౌనీంద్రులెవ్వాని మానసంబులఁ బట్ట
సాధ్యపడక నిరుత్సాహులైరి
నిర్జరులెవ్వాని నిర్మలాఖ్యలు మంత్ర
ములుగా జపింతు రామోదభక్తి
మంగళదేవతామణి యే మహాత్ము ది
వ్యాంఘ్రిసరోజంబు లాశ్రయించెఁ
గూర్మి నెవని పెద్దకొమరుఁ డీజీవుల
మొగిచి తోలుబొమ్మలుగ నొనర్చు
నట్టివాసుదేవునాత్మజుగాఁ గంటి
వేమి నీదు భాగ్యమో మహీశ. 135

ఆ. అంతికస్థమైన యద్దంబులో సము
ద్రంబు తోఁచునట్లు తనయుఁడయ్యె
నీకనంతశాయి నీతోడఁబోల త
ద్భాగ్యమిపుడు మాకుఁ బ్రాప్తమయ్యె. 136

ఆ. అరణియందుఁ బుట్టు నగ్ని మఖములెల్లఁ
బూర్తిఁ జేయుచుండు పోల్కి నీ కు
మారుఁడైన కృష్ణుఁ డీరసాస్థలి కుప
యోగముల నొనర్చు నుతగుణాఢ్య. 137

ఉ. నీకొమరుండుగా హరి జనించిన యంతఁ దదీయపాదముల్
సోఁకుటఁ జేసి పుల్కలు వసుంధరకబ్బిన సస్యసంఘముల్

ప్రాకులమోఘమై పొదగిమానకపండెను రోమజాలమా
టోకటిలేతరాశయ నృపోత్తమ నిన్ను నుతింపశక్యమే.

సీ. అలసోమకాసురువలన శిథిలమైన
యామ్నాయములనుఁ బ్రాపగుచుఁ బ్రోచెఁ
కైటభమధునామకనిశాచరులఁ జంపి
వారిమేధస్సునే వసుధఁ జేసెఁ
ప్రళయకాలములందుఁ బాతాళగతమైన
యవని యజ్ఞవరాహమగుచు నెత్తె
నంభోధిలో మగ్నమైనట్టి తఱిగట్టు
లీనమై నీటఁ దేలించియాఁగె

నఖిలలోకనాథుఁడైన నారాయణుం
డట్టిమేటి నీదు పట్టియగుచుఁ
బుట్టినాడ దేమి పుణ్యమో వివరింప
రాని హేతువయ్యె జ్ఞానసదన. 39

వ. ఏతత్సమయంబున మునీంద్రులు రాజులనిలిపి వసుదేవున
కిట్లనిరి. 40

సీ. యమనియమాది యోగములచేఁ బరిశుద్ధ
మైయొప్పు మా హృదయములకంటె
శోకవినాశమై సుజ్ఞాననిలయమై
తీపారు నత్తెలిదీవికంటె
నధికాంధకారంబు నడగించి జగము భా
సిల్లఁ జేయు సూర్యమండలముకంటె

నణుమాత్ర మాలిన్యమైన లేకుండఁ బ్ర
కాశించు నాస్ఫటికంబుకంటె
నీమనోంబుజంబు నీ గృహిణీగర్భ
మతిపవిత్రమనుచు నాదరించి
కాదె పుట్టినాఁడు కనకచేలుండు కృ
ష్ణాఖ్యచేఁ గుమారుఁడై మహాత్మ. 141

సీ. మలయందొ శిలయందొ లలిఁ బుట్టినట్టి జీ
వనది గ్రామములఁ బావనమొనర్చె
రాలుండు ఖానిలోఁ బ్రభవించు రతనంబు
రాజకోటీరహారముల వెలిఁగె
విపినంబునందు నావిర్భవించిన పటీ
రావనిజము సుగంధాప్తి వెలసెఁ
గసవును మేయు మెకమునందుఁ బుట్టిన
కస్తూరి వామాలికముల వెలసె
నట్లె నీకుమారుఁడైనట్టి శ్రీకృష్ణుఁ
డెల్లలోకములకు నేలికగుచు
దేవమునుల వాంఛఁ దీరిచి రక్షింపఁ
గలఁడు సంశయింపవలదు భూప. 142

తే. మర్త్యలోకంబునందు జన్మంబుఁ గన్న
పంకజాక్షుని భవము లప్రాకృతములు
గాని సుఖదుఃఖ హేతువుల్గావటంచుఁ
దెలియువాఁడు మహాత్ముండు కలఁగఁడెపుడు. 143

క. మును కౌసల్యా దశరథ
జనపతులకు రాముఁడగుచు జనియించి సనా
తన ధర్మంబులు నిలిపిన
ఘనుఁ డీహరియనుచుఁ దెలియఁగా వలయు నృపా. 144

సీ. తన పాదధూళిచేఁ దెనురాఁ బడఁతిఁ జేసె
బోయదానిని లోకపూజ్యఁ జేసె
గఠినరాక్షసులఁ బెక్కండ్ర నొక్కటఁ గూల్చె
మునిజనమ్ముల భయమ్ములనడంచె
నిజదూతచే లంక నీఱుగావింపించి
కూల్పించె రాకాసిగుముల వేల
శాఖామృగములకుజ్వలపరాక్రమమిచ్చె
మించి మున్నీటఁ దేలించె మలలు

రావణాదులఁజంపి విరాజమానుఁ
డగుచు నగ్నిజయించు నిల్లాలితోడ
ధరణినేలెను రామావతారవేళ
నీజనార్దనుఁడో మహారాజతిలక. 145

సీ. రాజ్యాధికార గౌరవముఁగోరినవారు
సేవింపవలయు నీ శ్రీనిధాను
చెలఁగి కవిత్వమార్జింపఁ గోరినవారు
భజియింపవలయు నీభుజగశయను
నాయురారోగ్య ధనాళిఁ గోరినవారు
ధ్యానింపవలయు నీదానవారి

గీతసాహిత్యవిఖ్యాతిఁ గోరినవారు
పాసింపవలయు నీపరమపురుషు
విలసదపవర్గపద మొందఁ దలఁచువారు
కోరికొలువంగవలయు నీవారిజాక్షు
ఇతనిఁ గనకున్న జీవుండు వెతలుగాంచు
శీతభానుకులాంభోధి శీతకిరణ. 146

సీ. వ్రతమూని గురుకులవాసం బొనర్చెడు
బ్రహ్మచారి కితండు పట్టుగొమ్మ
ధర్మార్థకామసాధనపరుండైన గృ
హస్థున కితఁడు మహాబలంబు
బహునిశ్చయముచేఁ దపముసల్పుచుండు వా
నప్రస్థున కితండనన్యదిక్కు
సర్వసంగములు విసర్జించినట్టి య
తివరేణ్యునకు నితండు వసురాశి

పూతచారిత్రుఁడగు నవధూతకితఁడు
ధ్యేయుఁడైయొప్పు నితని నుతింపకున్న
గతులు లేవాశ్రమములకే కాలమందు
భోగదేవేంద్ర యదుకులాంభోధిచంద్ర. 147

సీ. ధనినని పొంగి మాధవునిఁ గొల్వకయున్న
ధనము దంధనమై వ్యసన మొసంగు
రాజనంచు మదించి రమావిభుఁ గనకున్న
రాజ్యంబు తొలఁగియు రాతిఁ జేయు

మునినంచు రేఁగి కృష్ణుని భజింపకయున్న
దపమౌ తపంబై వెతలనొసంగు
వేలుపునంచు నవ్విధు నుతింపకయున్న
నానాఁడె దేవత్వ మడఁగిపోవుఁ

బండితుండనంచు బలిసి కేశవునాశ్ర
యింపకున్న హైన్యమెచ్చితీరుఁ
గాన వాసుదేవుఁడీ నిఖిలప్రపం
చమున కీశుఁ డగును క్ష్మాతలేంద్ర. 148

సీ. జలచరంబులలో విసారచతుర్గతు
లై మృగంబుల వరాహత్వమొందె
నరమృగాకారంబున జనించె నొక్కమా
అసురుల వామనుఁడై జనించె
బ్రాహ్మణులందునఁ బరశురాముండయ్యె
నర్కాన్వయమున రామాఖ్యఁబొడమె
బలరామకృష్ణరూపములఁ జంద్రకులంబు
నం దుద్భవించి యానందునింటఁ

జేరి శూద్రకులము వికసింపఁజేసె
సర్వసముఁడను నేనని చాటనిట్లొ
నర్చినా డిట్టులీ జగన్నాథుఁడనుచుఁ
దెలియవలయును బుద్ధిమంతులు నరేంద్ర. 149

క. అని యిటు నిగమార్థంబులు
మునిజనములు దెలుపుచుండ ముందఱఁగల స

జ్జను లానందంబునఁ గృ
ష్ణుని సన్నుతిఁ జేసి రెలమి జోహారులతోఁ. 150

తే. అంతలోపల రవి క్రుంక నచటనుండు
జటుల కౌఁగి మ్రొక్కి రాజుల సత్కరించి
పనిచి కృష్ణుండు గోపికాజనములుండు
స్థలి కరిగెఁ గుబ్జతోడ నుద్ధవునిఁ గూడి. 151

వ. అదివరకు గోపాల సుందరీమణులు కృష్ణానుమతంబున నొక్క రమ్యారణ్యప్రదేశంబునందుండుటం జేసి యచ్చోటికివచ్చిన జనార్దనపరబ్రహ్మంబును నయనోత్సవంబుగా వీక్షించియానందాతిశయంబుచే మైమఱచినోట మాట రాక కొంతసేపూరకయుండి క్రమ్మఱఁ దెలివొంది ప్రదక్షిణ నమస్కారంబు లాచరించి శ్రీకృష్ణుని పాణి పద్మంబు స్వకర పద్మంబుల నాకర్షించి ప్రాణనాథా గొల్లచెలువలఁ గాంచిన జ్ఞాపకంబు గలదేయని భాషించిన నయ్యంగనల మన్నించి కూర్చుండ నియోగించి తానును సుఖాసీనుండైన పిమ్మట సైరంధ్ర్యుద్ధవులు గూర్చుండి రయ్యవసరంబున నింతమంది భాగవత బృందంబేకకాలంబున లభించెంగదాయని సర్వేశ్వరుండును పరబ్రహ్మప్రాప్తి నేటికిఁ గలిగెఁగదాయని భాగవతులును బ్రహ్మానంద సముద్రంబున నోలలాడుచుండిరా సమయంబున నందనందనుండు వ్రజాంగనల కిట్లనియె. 152

సీ. కలుగునే యారోగ్యగరిమంబు మీా శరీ
రములకు దివమందు రాత్రులందు
నిచ్చునే పాలు మీాకెప్పుడు గోవులు
పనిసేయునే వృషభములు బలిసి
నిలుచునే ధనధాన్యములు గీములందుఁ బొ
సంగునే తృణకాష్ఠ జలసమృద్ధి
యమరునే బృందావనమునకు సేమంబు
పాలునే కాళింది భవ్యరీతిఁ
గోరుచున్నారే వ్రేపల్లెగొల్లవారు
సంతతంబు మదీయదర్శనముఁ బ్రీతిఁ
బ్రాణములతోడ మిమ్ము నిప్పటికి మరల
నేనుఁగాంచుట భాగ్యంబు నెలఁతలార. 153

సీ. లోకాపవాదంబు చేకూరునను సంది
యంబించుకయులేక యడరినారు
దేహబాంధవులనుఁ దెగనాడఁగాఁ గీడు
మూఁడునంచు నెఱింగి వీడినారు
కాఁపురంబులు మానఁగా జీవనంబెట్లు
కడచునాయను శంకవిడిచినారు
తర్కించి నానావిధములైన భోగంబు
లశ్వరంబులటంచు నడచినారు
వివిధవస్తువులను విడనాడి నన్నె ప్ర
ధానునిగ మనముల దలఁచినారు

మీరు మిమ్ముఁబోలు సారాశయులు నాకు
లేరు జగతియందు నారులార. 154

సీ. బంగారురంగుచేఁ బొంగారు మీమేలు
నింగివన్నియఁబోలె నెలతలార
వికసిత పద్మంబులకు నీడయిన మీమొ
గములు వాడినవేమి గరితలార
మంకెనపూల నైర్మల్యంబెనయు మోవి
కవలు కమలెనేమి యువిదలార
న్యూనంబులేని ప్రథానేంద్రియము లిట్లు
శుష్కించె నేమి యోసుదతులార

తే. దేహసంస్కారములు లేని తెఱఁగుదోఁచె
నేమికారణమో తెల్పు డింతులార
యనిన శ్రీకృష్ణదేవు దివ్యాంఘ్రియుగము
నంటి గొల్లెతలనిరి జోహారులొసఁగి. 155

క. ఏవేళ మమ్ముఁబాసితి
వావాసరమాది యింత కబలలమగుమే
మావంత సుఖమెఱుంగక
వేవిధకుల నేడ్చితిమి వివేకనిధానా. 156

సీ. హరిఁబాసి జీవించినందున సార్థక
మింతైన లేదని కొంతసేపు
బలవన్మృతికిఁ బాలుపడితి మానిందల
త్యంతదుర్గతిగల్గునని యొకపుడు

బ్రతికినచోఁ గృష్ణుఁబడసిపొంది సుఖింపఁ
గావచ్చునని యొక్కకాలమందు
మరలఁ గృష్ణునిఁ దెచ్చి మాకిచ్చు పుణ్యాత్ము
లుందురా యనుచు నొక్కొక్కసారి

తెచ్చి చూపకున్న దేవకీసూనుని
యొద్దఁ జేరి మమ్ము నుద్ధరించు
నట్లు సెప్పువారలైన లేరని యేడ్చి 157
నాము నిన్నుఁ బాసి నలిననేత్ర.

సీ. కలలోన నీరూపు కనిపింపఁ గౌఁగిలిం
పఁ దలంచి మేల్కొనుభామ యొకతె
పెరవారు నీపేరు పెట్టి పిల్చినఁ గృష్ణుఁ
డేడీయని వచ్చును నింతియొకతె
చీఁకటిత్రోవకు వీక్షించి నాథుఁడువచ్చె
రారేయనునుఁ జీరురమణియొకతె
కేకికంఠముఁ గాంచి శ్రీకృష్ణుఁడిదె దీని
పైఁ జేరెననఁ యెదు పడఁతియొకతె

చెలఁగి శుభనిమిత్తములుదోఁచె మనకృష్ణుఁ
డిపుడో తేఁపువచ్చు నింతులార
యనుచు నొకతె యిట్టులారాటమొందిరి 158
గోపకామినులు సుగుణధురీణ.

సీ. తొలఁగించితివి జన్మజలధిలోఁ బడఁదోసి
బాధించు సంసారబంధములను

కలిగించితివి భూరికాళలంబొగి సాహి
తీ గానములయందు ధీరులలర
మెలఁగించితి హృషీకముల నన్యసంపర్క
మడిపి నీపదములనుండునట్లు
వెలయించితివి నిలింపుల కందరాని దు
ష్కర భోగభాగ్యముల్ నిరతమొసఁగి

యిన్ని సౌఖ్యంబులిచ్చి మమ్మెన్నరాని
దుఃఖవారాశిలోఁద్రోసి తొలఁగినాఁడ
వేమిసార్థకమిది నీకుఁ గోమలాంగ
తెల్పుపఁదగియున్న వినిపింపు దేవదేవ. 159

సీ. సామర్థ్యముండియు శరణార్థులనుఁ బ్రోవ
డాయని వానిజడత్వమెన్ని
ప్రాభవంబుండియుఁ బరిపాలన మొనర్పఁ
దలఁపనివాని మాంద్యంబుఁగాంచి
స్వాపతేయముకల్గి సరవిమార్గణులకీ
యఁగలేనివాని లోభగుణమరసి
బలువిద్య కలిగియుఁ బరులు యాచింపఁ జె
ప్పనివాని సోమరితనము సూచి

యేవహింపఁ జాలనీ వ్యాఘ్రజీవుల
ననుచు భూమిదేవి పనవునన్నఁడు
దీనభావవేమొ దేవరవారు యో
జించి జెప్పవలయు శ్రీనిధాన. 160

సీ. ఏపూట వచ్చునో మాపుండరీకాక్షుఁ
డనిదెసల్ చూచి లోచనయుగంబు
లెంతచేసెనె కృష్ణుఁడింతులనని సారె
వచియింపుచుంటచే వదనగుహలు
హరిఁగొల్చి సుఖమేమి యార్జించిరని పెర
వారాడు నిందలవలన వీను
లీజన్మమునఁ గృష్ణుఁడీఁక లభింపఁడుగదా
యనితోఁచు నపుడెల్ల నాశయములు

డస్సిపోవుటఁ జేసి యాయుస్సులుండి
యైన శర్మంబుఁగనక యాయాసమునకు
నర్హులైనార మీయద భ్రాఘమెపుడు
చేసియుంటిమొ తెలిసెనా చెప్పుకృష్ణ. 161

మ. బలునాళ్ళీవగఁబాసి మమ్ములఁ దృణప్రాయంబుగాఁ జూచు చుందలఁ పెచ్చోటనో జేర్చియుంచినను నీదాంపత్యమున్ నీకృపా । బలమే కోరి నుతింపుచున్నదొగి మద్భావంబు మేమెంత నీ । చులమో పాపములేమిచేసితిమొ రక్షోవంశ నిర్మూలనా. 162

సీ. కార్పాసమునకంటె గడ్డిపోఁచలకంటెఁ
దేలికైతిమిగదా ధీరవంద్య
పశుపక్షి మృగవారబాలురకంటె మూ
ఢులమైతిమిగదా సుకోమలాంగ

గాజుకంటెను గవ్వకంటె విలువలేని
వారమైతిమిగదా వాసుదేవ
పెనుచెట్టుపై నిద్రఁగనువానివలె నిరా
శ్రయుల మైతిమిగదా సరసిజాక్ష

నిఖిలపదవులువాసి నిన్నె యజస్ర
మాశ్రయించుటఁజేసి యింతయ్యె మాకుఁ
గానఁబడిటివిచట నేటికైన ముందు
బ్రతుకుమార్గంబుఁ జూపింపు పద్మనాభ. 163

క. బ్రతికింపఁ దలఁచి తేనియు
సతులకు సార్థకము నేడుసమకూర్పుము జీ
వితములు దొలఁగింపఁ దలం
చితి వా యటుసేసినను విశేషంబయగుఁ. 164

తే. పొందవలసిన యవమాన మొందినాము
మించి కష్టంబులెల్లఁ బ్రాపించినార
మింక భయమేలమాకు నీవేమిచేయఁ
గలవు మేనుల విడుతు మికాలమందు. 165

మ. అనిశస్నీరు సముద్రమైపొరల నయ్యంభోరుహాక్షుల్ మహా
ధ్వనిఁ గావింపుచుఁ గృష్ణ కృష్ణ యని సంతాపంబుతో
నేడ్వఁగా। విని యానందసుతుండు డీలుపడి రావే రావే
రండో వ్రజాం। గనలాగా యని చానకొన్నాళ్ల నిజా
కారంబుతో నిట్లనుఁ. 166

చ. జరపితిఁ జాలకాలము విషాదముఁ జెందితి రన్నులార ని
ర్జరమునిపుంగవుల్వొగడఁ జూడఁ జరించితి రన్యమేది మీ
స్థిరతరభక్తి మెచ్చితిని తిట్టినఁ గోపము లేదు భోగమి
ద్ధరఁ గలకాలమిచ్చి ప్రమదంబున మోక్షము నిత్తు నాపయిన్

వ. అని యనేక విధంబుల లాలించి జనార్దనుండు వ్రజాంగనలారా యింతకాలంబు మిమ్మొడఁబాసి దుఃఖ మొందించిన నేరంబు క్షమింపుడు మదీయ తత్త్వంబు మీ రెఱుంగుటకును నాయందు నిరంతర ధ్యానయోగంబును గౌరవాభిప్రాయంబును లభించుటకు నిట్లొనర్చితింగాని మీయందలి విరోధంబునఁ గాదు తిరస్కారంబుచేతనుం గాదు యింక మీఁద మీకుఁ గష్టంబులు లేవని వచించి. 168

సీ. పుక్కిటివిడె మొక్క పూవుఁ బోఁడి కొసంగి
పరిరంభ మొక గోపభామ కిచ్చి
స్పర్శించి యొక సరోజాతాక్షి నలరించి
తరుణి యొక్క తెఱఁగైదండ యొసఁగి
యొకదాని కుచముల మకరికాపత్త్రంబు
లుంచి చందురుకూన లొకతె కుంచి
చుంబనంబుల నొక్క సుదతిని లాలించి
దంతక్షతము లొక్క దానికుంచి

కుంజములఁ జేర్చి యాదవకుంజరుండు
రతులఁ దేలింప వల్లవీ రత్నచయము

వాడివాసచే విలసిల్లు వలజపట్టు
లయ్యె నేమనివినిపింతు నవనినాథ. 169

ఉ. కష్టముఁదెచ్చిపెట్టిన నొకానొకవేళలఁ జెంతఁజేర్చి నిర్దు
ష్టసుఖంబులిచ్చెననుఁ దోయజలోచనుఁ డీవలెక్ భళీ
యిష్టములెల్లఁ గూర్చుట కనిష్టములం దొలఁగింపఁ జిత్ర
మా ! చేష్టలొనర్ప నాతనికె చెల్లుఁగదాయని రంగనా
మణుల్. 170

సీ. శిక్షింతునని యొక్క చెలువ శ్రీకృష్ణుసమీ
పించి నిజవేణి మోపివిడిచె
బాధింతునని యొక్క భామ వెన్నునిడాసి
లేఁతనవ్వాలయఁ బాలిండ్లనొత్తె
దండింతునని యొక్క తరుణి కేశవు కుటుం
గటకేగి బిగియారఁ గౌఁగిలించె
స్రుక్కింతునని యొక్క సుదతి మాధవుఁ జేరి
సొక్కుచుఁ జెక్కులు నొక్కుచుండె

ప్రణయకోపంబుతో నిట్లు పడఁతులెల్ల
నా యశోదాకుమారుని జేయుచుండ
దవిలి సైరంధ్రి లేఁగ యుద్ధవుఁడు మిగులఁ
బొంగి హాసంబొనర్చిరి భూవరేంద్ర. 171

సీ. మాతోడ సిన్నాళ్లు మాట్లాడకుండనీ
నోరెట్టులొప్పె మనోజజనక

విడిచిపోమ్మిఁక నీ వివేకప్రౌఢినటంచు
రమణియొకర్తె పూసరములచేతఁ

గట్టినవ్వుచునుండగఁ గనకచేలుఁ
డాశ్రితులకుఁ బరాధీనుఁడగుటఁ జేసి
కదలకుండంగ నెలజాలి కలిగి మరల
విప్పుచుండిరి సతులు పృథ్వీవరేంద్ర. 174

సీ. బంధింతు హరిని హృత్పద్మంబు నందని
కనులు మూయుచు లోనఁగాంచెనొకతె
వర్ణింతుఁ గృష్ణునుదీర్ణప్రౌఢినటంచుఁ
జెలరేఁగి పద్యముల్ సెప్పెనొకతె
కీర్తింతు నిప్పుడీ కేశిసంహారునంచు
బహుమాధురీఫక్కిఁ బాడె నొకతె
భుజమునఁదాల్తు నిప్పూరుషోత్తమునంచు
లీలఁగౌఁగిటఁబట్టిలేపె నొకతె
చెక్కుచెక్కున మోపి చాచిన కరంబు
హరిమెడను మోపి సంతోషమందె నొకతె
యిట్లొనర్చెదు చేడెల నీసడింపఁ
డయ్యెభక్తికిలొంగి కంసాంతకుండు. 175

సీ. ఔదార్యమున కజస్రాధాగమైయొప్పు
కల్పకంబిదెవచ్చె గరితలార
కల్యాణగుణగణౌఘములు గల్గిన తీయ
మావిద్రుమముడాసె మగువలార

ఘనకీర్తియను సువాసనగల్గిన పటీర
వృక్షంబు ప్రాప్తించె వేలుదులార
సాంద్రదయాగుణచ్ఛాయా సహిత తమా
లంబు లభించెనో లలనలార
వాంఛితములు పడయవచ్చుఁ బండ్లెలమి భు
జించి పరిమళము వహించి తాప
మడపవచ్చు దీనినాశ్రయించిన మన
కనిరి కృష్ణుఁగాంచి వనితలెల్ల. 176

సీ. గరిమతో దేవకీ గర్భాఖ్య దుగ్ధపా
థోవారమందునఁ బ్రభవమొంది
పుణ్యంబులను ధనంబులుగల వర యశో
దానందులకుఁ బరాధీనమగుచు
నారదోద్ధవవరాక్రూరాది మణిపరీ
క్షకుల చేసొంపుగా సానదీరి
వర పరాశర పరాశర పుత్రశుకముఖ
మునివర్తకులచేత మూల్యమంది
చెలఁగుచుండు కృష్ణచింతామణి యనేక
వర్షములకుదొరకె వాంఛలెల్లఁ
దీర్చుకొనెడు హాదని దేయని పొంగిర
గ్గోపకాంతలోలి భూపవర్య. 177

సీ. అవయవంబులఁగాంచు హరినీలరత్నంబు
క్రూరాహిరహిత పటీరతరువు

సౌభాగ్యవతి గర్భసంజాత కస్తూరి
పుంజ మంగమునొందు పుష్పచయము
వర్ణంబువేత్తైన వరసితాభ్రనగంబు
చైతన్యమొందిన సాంకవంబు
సుగుణరత్నములచే శోభిల్లు లోహణా
చలము సంభాషించు జాతరూప

శైల మవ్వాసుదేవుఁ డిచ్చానగమికి
దొరకినందున ధన్యులై సిరివహించి
రని పరస్పరముగ నాడి రతివరెల్ల
నేమిసెప్పుదునయ్య భూమీశతిలక. 178

వ. అని యనేక విధంబుల గోపీజనంబులు కొనియాడు చుండ జనార్దనుం డనుగ్రహించి పరిష్వంగ చుంబన రదనక్షత నఖరక్షత మకరికాపత్ర పయోధరమర్దనాదులచే నయ్యంగనామణుల నలరించి నిధువనసౌఖ్యంబపారంబుగా నొసంగి యూఱార్చి సతీలలామలారా యొక్క సందేశంబాకర్ణింపుడేను భూభార నివారణార్థమై యవతరించిన పురుషోత్తముఁడనగుటం జేసి ముప్పదిమూఁడు కోట్ల దేవతలకు మహామునులకుఁ బరమ భాగవతులకు ననిష్టంబులు నశింపఁజేసి యిష్టార్థంబులు సేకూర్ప వలయుఁ బాపాత్ముల కొందఱి నుక్కడగించితి మఱికొందఱిఁ జక్కడవలసియున్నది యుత్తరకురుక్షేత్రంబునఁ గోట్ల

కొలంది రాజుల వధింపవలసియున్నది యింక ననేక కార్యంబులు గల వందువలన నాకు మీతోడఁ గలసి యుండుటకింక తీరదు మీ రుజ్జీవనమార్గం బెట్లంటిరేని బృందావనంబునందు యమునానదీ తీరంబున నొక్క మందిరంబు నిర్మించుకొని మదీయ గుణానుభవకైంకర్యం బులతోఁ గాలంబు గడపుచుండుడు మీకు దేహధార ణోపయోగ పదార్థంబులు మచ్ఛాసనంబు వహించి కల్ప వృక్ష కామధేన్వాదు లవ్వారిగా నొసంగుచుండు నుద్ధవ నారదాదు లప్పుడప్పుడువచ్చి హితోపదేశంబు లొనర్చు చుందురు కాలంబు సుఖలీలఁ గడచును నట్లు సంకల్పించెద నాయురారోగ్యైశ్వర్యంబులుగలిగి వర్ధిల్లుఁడు మీ వైరుల నిర్మూలంబుఁ గావించి పరమపదంబొసంగెదనని బలుతె ఱంగుల నాశీర్వదించి వరంబులొసంగి పదియేనుదినంబులా ప్రభాసతీర్థమున వసించె నటుపిమ్మట నుద్ధవ సైరం ధ్రుల గోపికలును గోపికల నుద్ధవ సైరంధ్రులునుం గొని యాడి రయ్యవసరంబున మధుసూదనుం డుద్ధవ కుబ్జలం గూడి మధురాపురంబున కరిగె వ్రజాంగనలును బృందా వనంబున కరిగి యమునాధునీతటంబున నొక్క విశాల మఠంబు నిర్మించుకొని నిర్మలజ్ఞానంబును సాంద్రతరై కాంతభక్తియు గాఢవైరాగ్యంబునుఁ గలిగి బద్ధసంసారుల

సాంగత్యసల్లాపంబులు వర్జించి శ్రీకృష్ణ పదారవింద మాన
సలై యోగినులై యోగులమీఱి వర్తింపుచుండ ననేక
సంవత్సరంబులు కడచినపిమ్మట బృందావనంబునకు నార
దోద్ధవు లరుగుదెంచిన నవ్విదుషీమణులు సగౌరవంబుగాఁ
బూజించి యుచితాసనంబుల నుండుతఱి నమ్మహాసుందరీ
మణు లుద్ధవున కిట్లనిరి. 179

మ. హరియెచ్చోటఁగలండు సేమమెగదా యప్పుణ్యనిక్షేప
మే। తరుణిం బెండిలియాడెఁ గల్గెనొకో సంతానం బమో
ఘుస్థితిం। బరిపాలించునె రాష్ట్రముం బ్రజల సంపాదించునే
కీర్తి ము। వక్రరాతించరులఁ వధించునె మముం గా
వంగ యోజించునే. 180

క. నావిని యుద్ధవుఁడిట్లను
పావనచారిత్రలార పంకజనాభుం
డీవేళకుఁ గుశలుండై
కావించు నమోఘ పుణ్యకార్యములు సదా. 181

వ. వెండియు మీరడిగినవన్నియు సార్థకంబులై యొప్పు నిప్పు
డమ్మాధవుండు మధురాపురంబువీడి పశ్చిమ సముద్ర
మధ్యంబున విరోధిదుర్గమంబగు ద్వారవతి యను నగరంబు
నిర్మించి యందు వసించి నిస్తులైశ్వర్యనిధియై, రుక్మిణీ
సత్యభామా జాంబవతీ లక్షణా గ్నజితీ కాళిందీమిత్రవిందా
భద్రలనియెడు నెనమండ్రు పట్టమహిషులను షోడశ

సహస్రరాజకన్యలను వివాహంబాడి భోగింపుచు సంతాన
వంతుండై సహస్రదిక్పాలకులవంటి యైశ్వర్యంబును లక్ష
దేవేంద్రులవంటి భోగంబులును గలిగి క్షేమంబుగా వర్ధిల్లు
చున్నాఁడనిన విని సంతోషించి వ్రజాంగన లుద్ధవునిం గని
శ్రీకృష్ణప్రభావంబు వర్ణింపుమనుటయు నతండు నారదుం
జూపింప నమ్మునీంద్రుం డగ్గోపికల కిట్లనియె. 182

తే. సర్వవేళఁ ద్రిలోకసంచారి నగుట
నెల్లదేశంబు లెఱుఁగుదు నెచటనైన
మిమ్ముఁబోలె మురారాతినమ్మికొల్చు
భక్తవర్యులు లేరు పోపడఁతులార. 183

సీ. గాఢసాహిత్యంబుగల కవీశ్వరులందు
మతిమంతులైన పండితులయందు
నతిదాన సంపన్నులగు గృహస్థులయందు
వినుతిఁగాంచిన మహామునులయందు
భవ్యవ్రతాఢ్యులౌ బ్రహ్మచారులయందు
వాసిగైకొన్న సన్యాసులందు
వివిధయోగాభ్యాస విమలచిత్తులయందు
గౌరవాధికులైన గాణలందు
భోగవర్జితులైన విరాగులందుఁ
బూతచారిత్రులగు నవధూతలందు
లేరుమిముబోలు హరిభక్తులారడమున
నేఁటిచూచినఁగాని యోనారులార. 184

క. శ్వేతద్వీపనివాసుల
భాతిఁ మీరెల్ల తఱి ప్రపంచసుఖంబుల్
రోఁతగఁ జూచి యధోక్షజు
నేతలఁపోయుచు ముదంబు నెనసెదరు జలే. 185

సీ. వివిధయోనుల నుద్భవించుట లెడఁబాసి
జీవిమానిసిమేను జెందుటధిక
శుభమాశరీరంబుఁ జొచ్చియు భరతఖం
డమునందుఁ బుట్టుట విమలపుణ్య
మటుజనించినను సర్వావయవములచేఁ
బూర్ణుఁడైయుండు టబ్బురముతలఁప
నట్లుండి చదువరి యగుటదుర్లభమట్టి
భాగ్యమబ్బిన నర్థపంచకంబు
దెలిసికొనుట దుర్లభమది తెలిసెనేని
గమలనయనుని భక్తి దుష్కరము గాదె
సఫలమన్నియునయ్యె మీజననమహిమ
మేమిచెప్పుదు వల్లవభామలార. 186

క. తక్కినవన్నియు వదలుట
లక్కమలదళాయతాక్షు నంఘ్రిపయి నెదల్
నెక్కొనుట జీవకోటికి
మిక్కిలి పుణ్యంబుగాదె మేదినిలోనన్. 187

ఆ. రాజపదము దేవరాజపదము కై
లాసపదంబు పంకజాసనాది

పదములెన్నియైన భర్మచేలుపదంబు
లిచ్చు సౌఖ్యమిడుసనె యింతులార. 188

ఆ. ఆయువునకు బ్రహ్మ నైశ్వర్యమున కగ్ని
హెూత్రు రోగనాశ మొంద రవిని
జ్ఞానమునకు శివుని ధ్యానింపవలె ముక్తిఁ
గోరువారు విష్ణుఁ గొల్వవలయు. 189

ఆ. సర్వసౌఖ్యములును శాశ్వతంబులుగావు
ముక్తి శాశ్వతం బమోఘఫలము
దానిఁ గోరువారు దైత్యారి సేవింప
వలయు నట్టి లబ్ధికలిగె మీకు. 190

వ. మఱియు నిప్పుండరీకాక్షుండు సర్వేశ్వరుండు సర్వజ్ఞుండు సర్వాంతర్యామి సర్వనియంత లీలావిభూతి నిత్యవిభూతి యను విభూతిద్వయంబున కేకచ్ఛత్రాధిపతి వెండియు ననంతకోటి బ్రహ్మాండంబు లితని రోమసమూహంబులందు దుర్దుర ఫలంబులంబోలె నిమిడియుండు నమ్మహాపురుషుండె కృష్ణుండై యవతరించి గోకులంబునం బెరిగి యతిమానుష చేష్టలొనరించుట మీ కెల్లరకుఁ దెల్లంబెకదా శ్రీకృష్ణుం డిచ్చటనుండి బయలుదేఱి మధురాపురంబున

కేగి కంసునివధించి వసుదేవాదుల కారాగృహ బంధనం
బులు దొలఁగించి యమలోకాధీనుండగు సాందీపని కుమా
రుం దెచ్చి కానుకగా సమర్పించె జరాసంధుండొక్కొక్క
పర్యాయ మిరువదిమూ డక్షోహిణుల సైన్యంబులతో
మధురపై దండెత్తగా నతని సైన్యంబుల బలరామ సహి
తుండై యనాయాసంబునఁ బదునెనిమిదిమాఱులు సంహ
రించెఁ గాలయవనునిఁ ద్రుంచి ముచికుందునకు మోక్షం
బొసంగె రుక్మిణీప్రభృతి మహిషుల నెనిమిదిమందినిఁ బది
యాఱువేల రాజకన్యలనుఁ బెండ్లియాడి ద్వారకాపురం
బున సుఖించె బాణాసురుని బాహులు ఛేదించి గర్వ
భంగంబొనర్చె భీమునిచే జరాసంధునిఁ జంపించె ధర్మ
రాజుచే రాజసూయమహాధ్వరంబు సేయించి శిశుపాలుని
వధించి యాసభవారి కాశ్చర్యంబుఁ గలిగించెఁ గుచేలు
నకు మానుషదుర్లభంబగు నైశ్వర్యంబొసంగెఁ గంసునిచేఁ
జచ్చి పాతాళంబున కేగిన బాలురఁ దెచ్చి దేవకి
కొసంగె వాసుదేవ వ్యూహంబున కేగిన వైదిక పుత్రులఁ
దెచ్చి తదీయ జనకున కొసంగె నింతియకాక యశోదా
నందనుండు ద్రౌపదీ మానంబు రక్షించెఁ గంటికి ఱెప్ప
వలెఁ బాండవుల నెల్లప్పుడు రక్షించెఁ బౌండ్రక సాల్వ
దంతవక్త్ర హంసడిభక వజ్రనాభ సునాభాది రాక్షసులఁ

బెక్కండ్ర నుక్కడంచె సకలోపనిషత్సారంబగు గీతా
శాస్త్రంబును ఫల్గునున కుపదేశించె నర్జున సారథియై
యుత్తరకురుక్షేత్రంబునఁ గోట్లకొలఁది రాజులరాజసైన్యం
బుల వధింపించి భూభారంబుఁ దొలఁగించె శ్రీకృష్ణలీలా
ప్రపంచంబింతయనియెంచివక్కాణింప విద్యాధిదేవతయగు
సరస్వతికిని భాషాపతికిని బృహస్పతికిని సర్పపతికినిదరంబు
గాదు తక్కిన వారిం జెప్పనవసరంబులేదు తోఁచినంత
వరకు వివరించితి మోక్షార్థియగువాఁ డెన్ని జన్మంబులకైన
నీజనార్దను నాశ్రయింపవలయు నిమ్మహాపురుషుండు
పూర్వయుగంబులందు మత్స్యకూర్మవరాహ నారసింహ
వామన పరశురామ రామాద్యవతారంబులెత్తి యనే
కాద్భుతకార్యంబు లాచరించి లోకోపకారం బొనర్చె
నిమ్మధుసూదనుండు ధర్మసంస్థాపన సాధురక్షణ దుష్కృత
వినాశంబులకై ప్రతియుగంబు నందవతరించు నితం డవత
రించు నప్పుడు తాల్చు శరీరంబుల ప్రాకృత దివ్యమంగళ
విగ్రహంబులే కాని ప్రాకృత భౌతికంబులుగావు యితం
డే యవతారంబెత్తినను లక్ష్మీదేవి తదీయావతారం బాడు
రూపంబుతో ధరింపుచుండు నీరహస్యంబు దేవతలును
మహామునులును భక్తులు నెఱుంగుదురు తదితరులెఱుంగఁ
జాలరు మీరు భాగవతులగుటచే భగవన్మాహాత్మ్యంబు

గోచరింపుచున్నది సుమీ యని బోధించి నారదోద్ధవు లరిగి రటుపిమ్మట గోపకాంతలు యావజ్జీవ పర్యంతము భగవద్గుణానుభవ కైంకర్యంబులచేఁ గాలంబు గడపి పునరావృత్తి రహితంబైన పరమపదంబుఁ జెందిరని శుకయోగీంద్రుండు పరీక్షిత్తున కెఱింగించెనని సూతుండు శౌనకాదులకు వినిపించెంగావున నిది వినువారునుఁ బఠించువారును వ్రాయువారును బ్రతికిన కాలములోనని ష్టంబులు దొలఁగించుకొని ముక్తిఁ గాంతురు. 191

శా. నీరేజాసన జన్మకారణ జగన్నిర్మాణ రత్నాలయా
ధారాపాపవిదూర ధీరజన వంద్యాపుండరీకాక్ష భూ
భారధ్వంసక రుక్మిణీ రమణి హృత్పంకేజ మార్తాండ కం
సారాతీ శరదిందు వక్త్రమహనీయానంద సంధాయకా.

క. గరుడధ్వజనిరుపమ సుం
దర దేహాదరారి శార్ఙ్గధర ధేనుక సం
హార గురుపుత్ర ప్రాణద
పరమమునిధ్యేయ పాదపంకజ కృష్ణా. 193

మాలినీ

కలికలుష విదారా గాఢ సంసారదూరా
జలదనిభ శరీరా సాధుమోద ప్రచారా

విలసిత గుణవారా వేదవేదాంతసారా
కులగిరి సమధీరా గోపికా చిత్తచోరా. 194

ఇది శ్రీ సీతావల్లభప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్రరత్నానుసంధాన పవిత్రాంతరంగ నిఖిల దుర్మతశిలోచ్చయ దంభోళీభూత సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ బోధిత విశిష్టాద్వైత రహస్యార్థధురంధర శఠగోపయతిరాడ్వర వరయోగి ప్రభృతి పూర్వాచార్యచరణసరోజ భ్రమరాయమాన మొవ్వవంశతిలక కృష్ణాంబాకృష్ణార్యతనూజ శ్రీవైష్ణవవిధేయ వేంకటదాసనామధేయ ప్రణీతంబైన గోపికావిలాసంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము

సంపూర్ణము,



మ ద్వి ర చి త మ గు

# శ్రీ ని వా స ప్ర భా వ ము

[..]ందు

మచ్చునకు గ[..]న్న పద్యములు.

సీ. జలజాతవైరిని క్షయరోగి[..]గావించి
నీరుదాల్పులను మున్నీటముంచి
కల్పభూరుహమునుఁ గదలకుండఁగఁ జేసి
తలపుమానికమును శిలనొనర్చి
సురసౌరభేయి నీసున గడ్డిదినిపించి
క్షీరోదమును గిరిచేఁగలంచి
జీమూతవాహను జీవముల్ద్రొలఁచి ద
ధీచిశల్యంబు శోధించినటికి
దాడి నెరపినట్టి దానవకన్యామణి
వలదుపొమ్మనిన భవత్కరగ్ర
హణమొనర్చి బాయకనిశంబు సేవించె
నేమివింత వృషమహీధ్రనిలయ. 1

బలి దానవేంద్రు నొదలఁదన్ని ధృతిఁదూల్చి
రఘు మహీపతికి శరావమొసఁగి
శిబి ధరాధీశుఁడాసింపఁ గండ[..]ండి
జలజాప్తతనయుని చర్మమొలిచి

## మా యాశ్రమమున లభించు గ్రంథములు

భాష్యకార సమాజస్థాపకులు, మా పితృపాదులునైన

శ్రీ వేంకటదాసస్వామివారివి:-

| | |
|---|---|
| జ్ఞానసూర్యోదయము | రు. 10—00 |
| గోపికావిలాసము | 1—50 |
| సీతారామప్రభావము | 1—25 |
| వరవరమునిహృదయము | 0—75 |
| లక్ష్మీస్తవము | 1—12 |
| భాగవతసురభూజము | 1—00 |

నావి:....

| | |
|---|---|
| కావ్యకళ | 2—00 |
| భారతగానము | 0—37 |
| తపోమహిమ | 6—00 |

---

ప్రాప్తిస్థానము:—

కవిభట్టారక, మొవ్వ విష్ణుదాసు (దాశరథిసూరి)

శ్రీ వేణుగోపాల సేవాశ్రమము

పూడివాడ (వయా) చందోలు

గుంటూరుజిల్లా





సమదర్శన సమయోగ

# సమ్యక్ జ్ఞానులు

# ఆళ్వారులు


భాష్యకార సమాజస్థాపకులు
మహర్షి శ్రీవేంకటదాస స్వామి.
నందం శంకరరామనాథము.
Artist
రేపల్లె, గుంటూరు జి.
1957.



తర్కవేదాంత విశారద

**పండిత శ్రీ మొవ్వ శ్రీనివాసపెరుమాళ్ళుగారు**

శ్రీరమా చిత్రశాల



శ్రీవేణుగోపాల సేవాశ్రమాధిపతులు, తర్కవేదాంత "కవిభట్టారక"
పూడివాడ. శ్రీ మొవ్వ దాశరధి సూరి "విష్ణుదాసు" గారు. ది.30-8-1998

